# అమాయకులు



మూలం

రమేశ్ చౌదరి

అనువాదం

'రవి'



ప్రజాసాహిత్య పరిషత్తు

తెనాలి - 2

# మా మాటలు

రమేశ్ చౌదరి పూర్తి పేరు ఆరిగపూడి రమేశ్ చౌదరి. ఇంతవరకు పదహారు పుస్తకాలు వెలువరించారు. ఇంకా వెలువరించవలసినవి చాల వున్నవి. వీరి ఆరు పుస్తకాలకు ఉత్తరప్రదేశ్ గవర్నమెంటువారి పురస్కారం లభించింది. హిందీ మాతృభాష కాని వారి కిలాంటి బహుమతి లభించడ మపూర్వం. అందు వీరే ప్రథములు.

వీరి "ధన్యభిక్షు" అనే పుస్తకం మూడు విశ్వవిద్యాలయాల్లో పాఠ్యగ్రంథంగా నిర్ణయించారు. ఇందు రాజస్థాన్ యూనివర్సిటి ఒకటి.

వీరి "భూలే భట్కే"కు అనువాద మీ "అమాయికులు". సామాజిక నియమాలకు, కట్టుబాట్లకు లోనై జీవితాన్ని నాశనం చేసుకొన్న ఒక అభాగ్య జీవి యదార్థ జీవిత గాథ యిది. ఇందు కల్పనకు తావు లేదు. దీనిని అనువదించి పాఠక లోకాని కందిస్తున్నాం. పాఠకలోకం దీని నాదరిస్తుందని ఆశిస్తున్నాము.

— ప్రకాశకులు.

# అమాయికులు

సంక్రాంతి పర్వదినం. పంటలు యింటికి వచ్చి ఆనందోత్సాహాలు వెల్లివిరిసే రోజు. ఇంట్లు చక్కగా అలంకరించి ముంగిళ్ల రంగవల్లికలు తీర్చిదిద్ది విందులూ, వినోదాలతో జనం కాలక్షేపం చేస్తున్నారు. దేవాలయంలో మంగళవాద్యాలాలపిస్తున్నారు.

ఈనాడు కుగ్రామంగా నున్న కొత్తపట్నం ఒకనాడు పెద్ద రేవు పట్నం. ఈ రేవులో సరకులు ఎగుమతి చేసుకొని ఓడలు దేశదేశాలకు వెళ్లేవి. లక్షల వ్యాపారం జరిగేది. జనసమ్మర్దంగూడా ఎక్కువగా ఉండేది. కాని ఇప్పుడు నలభై యాభై యిండ్లకన్న ఎక్కువ లేవు. ఊరంతా పాడుబడినట్లు కనిపిస్తుంది. ఎక్కడ జూచినా శిథిలావశేషాలే. గోడలుతప్ప పైకప్పుల్లేవు. పెద్దపెద్ద పెంకుటిల్లు సైతం గుట్టలుగుట్టలుగా దిక్కూదివాణం లేకుండా పడివున్నవి. నిర్జన ప్రదేశము.

గ్రామానికి కొద్ది దూరములో నున్న పాటిదిబ్బమీద ప్రాచీన దేవాలయ మొకటున్నది. సముద్ర మొకప్పు డీ దేవాలయాన్ని తాకుతుండేదని అక్కడివారు చెపుతారు. కాని యిప్పుడు మాత్రం దేవాలయానికి, సముద్రానికి మధ్య ఒక ఫర్లాంగు దూరం ఇసుక మేట వేసింది. ఉదయంపూట దేవా

లయంలో అభిషేకము, సాయంత్రము దీపారాధన జరుగుతవి. శుక్రవారంనాడు మాత్రం విశేషపూజాపునస్కారాలు జరుగుతవి. అన్యత్రా దానివంక ఎవరూ కన్నెత్తైనా చూడరు. వచ్చే పోయే భక్తులు మాత్రం గుడిలో గంటలు మ్రోగించి ఒక నమస్కారం పెట్టి పోతుంటారు.

కాని పండుగ దినాల్లో యిక్కడ సాధారణంగా ఉత్సవాలు జరుగుతుంటవి. దూరదూరాన్నుండి ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చి పూజలు చేయిస్తారు, మ్రొక్కుబడులు చెల్లిస్తారు, సముద్రంలో స్నానాలు చేస్తారు, దేవునికి కానుకలూ అవీ సమర్పించుకొంటారు. అప్పుడు కొత్తపట్నం స్వాభావికంగా కళకళలాడుతూ నవచైతన్యంతో విరాజిల్లుతుంది.

దేవాలయానికి ఉత్తర భాగంలో చిట్టడవి వున్నది. పడమటివైపున పంటపొలాలు, పంటకాలువ. తూర్పున ఇసుక, ఆవల విశాల సాగరము. దక్షిణాన విశాలమైన బాట. దాని కిరుప్రక్కలా విచిత్రమైన పెంకుటిండ్ల వరుస. పోలీసువాళ్ల బారక్సులా ఇండ్లపై కప్పు అంతా కలిసే వుంటుంది; ముంగిళ్లు మాత్రం వేరువేరుగా వుంటవి. పూర్వం యాభై అరవై కుటుంబాల వారిక్కడ నివసించేవారు. కాని ఇప్పుడు నాలుగైదు కుటుంబాలవారు మాత్రం నివసిస్తున్నారు. మిగిలిన ఇండ్లలో తేళ్లూ, జెఱ్ఱులూ, గబ్బిలాలూ నివసిస్తున్నవి.

ఈనాడా బాటలో జనం గుమిగూడారు. మంచి మంచి వస్త్రాలు ధరించి అటూ ఇటూ తిరుగుతున్నారు. పిల్లలు గూడా ఎంతో ఆనందోత్సాహాలతో ఆడుకొంటున్నారు.

సముద్రపు ఒడ్డున గూడా జనం గుంపులు గుంపులుగా చేరారు. పిల్లలు సముద్రపు అలలతోపాటు పైకెగురుతూ గంతులు వేస్తున్నారు. అలల వెంట లోపలకు పోతున్నారు. మరల అలల వెంట వెలుపలకు వస్తున్నారు. వారు సముద్రపుటలలతో ఊయెల లూగుతున్నారు.

సత్యం సముద్రంలో ఈత కొట్టి కొట్టి అలిసిపోయాడు. ఒడ్డుకు వచ్చి తడి యిసుకలో గీతలు గీస్తున్నాడు. గీకి గీకి ఇసుకంతా ప్రోగుచేశాడు. ఇంతలో ఒక అల వచ్చి ఆ ఇసుక ప్రోగును చదును చేసింది. సత్యం చిరునవ్వు నవ్వి చేతులు దులుపుకొంటూ యింకొక చోటికి వెళ్లాడు.

అతనికి దగ్గరలోనే నళిని యిసుకలో పిచ్చిక గూళ్లు కడుతున్నది. నళిని ప్రక్కింటివారి అమ్మాయి. కాని ఇరువురి మధ్య చెప్పుకోదగినంత సహవాసం లేదు. అసలా అమ్మాయి కొత్తపట్నంలో ఎక్కువగా వుండదు.

"నీ వేమిటి చేస్తున్నావ్ ?" అని సత్యం ఆ అమ్మాయిని మాటవరుసకు పలుకరించాడు.

"దేవాలయం" అని ఆ అమ్మాయి జవాబు చెప్పింది. "ఇదుగో యిటు చూడు. ఇది పూజామంటపం. ఇక్కడ అమ్మవారు. ఇవి నాలుగు గోడలు..."

"అయితే దేవాలయ మిలాగా చేసేది? దీనికి కలశ మేది? గోపురాలేవీ ?" అంటూ సత్యం ప్రక్కనున్న చెట్టునుండి యిన్ని పూలూ పత్రీ కోసుకువచ్చాడు. గడ్డిగాదం గూడా ప్రోగు చేశాడు.

ఇసుకలో కర్రపుల్లలు నాలుగువైపులా గ్రుచ్చి పైన నాలుగువైపులా నాలుగు పుల్లలు పందిరిలా కట్టి సత్యం గడ్డితో

కప్పివేశాడు. ఆపైన మళ్లీ పుల్లలుపెట్టి కట్టి రెండవ అంతస్థు గూడా తయారుచేయబోయాడు. ఇంతలో క్రిందనున్న పుల్లలు విరిగి మొత్తం నేలకొరిగింది. నళిని కడుపుబ్బ నవ్వసాగింది.

"నీవు నవ్వుతున్నావా!" అంటూ సత్యం పడిపోయిన పుల్ల లన్నిటినీ తీసి మళ్లీ సావధానంగా మందిరం నిర్మింప సాగాడు. చూస్తూ చూస్తుండగానే ఒక దేవాలయం తయారు చేసి దాని శిఖరాన గడ్డితో చేసిన కలశం తగిలించాడు.

"ఇప్పుడుచూడు మందిరం. మందిరమంటే యిలా చేయాలి." అన్నాడు సత్యం.

"ఊఁ! అయితే యిందులో మండప మెక్కడుంది.? నా మందిరంలో పెద్ద మండపమున్నది." అన్నది నళిని.

"మరి అది పడిపోయిందిగా?"

"పడిపోతేనేం? చూడు. మళ్లా మండపం చేస్తున్నాను" అంటూ నళిని సత్యాన్ని వెక్కిరించి మండపం తయారు చేయసాగింది.

నళిని వయస్సు ఏడెనిమిది సంవత్సరాలకంటే ఎక్కువ వుండదు. గౌరవర్ణము, పెద్దపెద్ద కండ్లు, పొడవైన జడ, పట్టు లంగా, పట్టుచొక్కా తొడుక్కొని ఎంతో ఆకర్షణీయంగా వుంది.

సత్యం లంగోటీతోనే వున్నాడు. తడిసిన జుట్టుమీద ఇసుక కణాలు సూర్యకాంతికి మెరుస్తున్నాయి. చేతులూ కాళ్లూగూడా ఇసుకతో నిండివున్నాయి. కోలముఖం, నిడుపైన ముక్కు, పలుచని పెదాలు, గౌరవర్ణం, మత్తిల్లిన కన్నులు, బరువైన కనురెప్పలు. వయస్సు పదిసంవత్సరాలుంటుంది.

నళిని ఆకులు క్రిందపెట్టి సత్యం మందిరంపైనున్న పుల్ల లన్నీ వరుసగా పెట్టబోయింది. ఆమెచేయి సోకగానే మందిరం నేలకూలింది. నళిని బిగ్గరగా నవ్వసాగింది.

"నీవు నా మందిరాన్ని పాడుచేశావు." అంటూ సత్యం గుడ్లురిమాడు.

నళిని భయంతో వణుకుతూ వెనుదిరిగి పోసాగింది. కొంతదూరం పోయేవరకు పూరుకొని సత్యం యిసుక తీసుకొని ఆమె పట్టుబట్టల మీదికి విసిరాడు. నళిని ఏడవసాగింది.

"ఉండు మా అమ్మతో చెప్పి నీ వీపు చీరిస్తాను."

కాని సత్యం ఆ మాటలు వినిపించుకోకుండా ఉన్మత్తునిలా సముద్రములో దిగి స్నానము చేయసాగాడు. నళిని తిరిగివచ్చి పడిపోయిన పుల్ల లన్నిటినీ ప్రోగుచేసి మందిరం నిర్మించసాగింది.

౨

బాట ప్రక్కనున్న యిండ్ల చివరిభాగంలో సత్యమూ అతని తండ్రీ నివసిస్తున్నారు. ప్రక్కనే ఒక శిథిల గృహ మున్నది. తరువాత ఒక వేపచెట్టు, రెండు రేగుచెట్లు, ఆ తరువాత నళిని నివసించే చిన్న యిల్లు వున్నది.

నళిని యింటి ముందు రెండు గేదెలు ఒక ఆవు కట్టివేసి ఉన్నవి. ఒక బావిగూడా ఉన్నది. ఆ యింట్లో నివసిస్తున్నవి రెండు ప్రాణులు మాత్రమే. నళిని ఆమె తల్లి.

నళిని మంచి సాంప్రదాయమైన ప్రాచీన వంశంలో జన్మించింది. ఆమె పూర్వీకు లొకప్పుడు మంచి కీర్తి ప్రతిష్టలు

సంపాదించారు. ధనధాన్యాలు సమృద్ధిగా ఉండేవి. పొలమూ పుట్రా చాలినంత ఉండేది. కాని యీనాడు వారిస్థితి కొత్త పట్నపు దేవాలయంలా జీర్ణ, శీర్ణ, శిథిలావస్థలో పడి, అందరి ఉపేక్షలకు, తిరస్కృతులకు కారణభూతమైనది.

నళిని తల్లి కాంచన యౌవనంలో మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించుకొన్నది. దూరమనుకోక ప్రజ లామెను చూడడానికి వచ్చేవారు. వివాహాది శుభకార్యాలప్పుడు బాజాభజంత్రీలతో ఆమెను తమ యిండ్ల కాహ్వానించి వెంట తీసుకపోయేవారు. ముసలివారు ఆమెను గురించి యిప్పుడుగూడా ఎంతో యిదిగా చెపుతారు: ఆమె నర్తకి. ఆమె నీచకులంలో జన్మించింది. ఒక నిషిద్ధ వస్తువులో ఏ ఆకర్షణ ఉంటుందో ఆమెలో అదే ఆకర్షణ ఉన్నది.

ఆమె పూర్వీకులు కొత్తపట్నం దేవాలయంలో దేవదాసీలుగా ఉండేవారు. ఉత్సవాల సమయంలో నాట్యం చేసేవారు. ఇప్పుడుగూడా కాంచన దేవాలయానికి వెడుతుంది. కాని నాట్యం చేయడానికి కాదు; పూలతో భగవానుని పూజించడానికి.

కాంచన వయస్సిప్పుడు నలభై నలభైఅయిదు సంవత్సరాలుంటుంది. యవ్వనం గతించింది. వసంతం హేమంత రూపంగా పరివర్తనం చెందింది. యౌవన తైలంతో జాజ్వల్యమానంగా వెలిగిన ఆమె శరీర సౌందర్య మీనాడు బూడిద బుగ్గిగా నున్నది. బొద్దుగా, మొరటుగా, కూర్చుంటే లేవలేకుండా, బోసినోటిలో మిగిలిన రెండు మూడు పండ్లూ పుగాకు తమ్మ నమలడంతో గారపట్టిన పండ్లూ, నడుము

నొప్పి, ముఖాన తెల్లని మచ్చలతో యౌవన సమాధిలా కన్పిస్తున్నది.

వెలుగు ఆరిపోయింది. కాని యింకా పిలుపు రాలేదు. అప్పు డప్పుడూ యెరిగివున్న వాళ్లు వచ్చి పిచ్చాపాటీ మాట్లాడి పోతుంటారు. కాని కాంచన మాత్రం తమ్మ నమలుతూ, నడుము నవరించుకొంటూ తలుపు నానుకొని గంటల తరబడి అలానే కూర్చుండి వుండేది. అప్పుడప్పు డేదో ఆలోచించేది. గడచిన మధురస్మృతులను నెమరు వేసేది. అప్పుడప్పుడు నళినికి సంగీతమూ, నాట్యమూ నేర్పేది. ఈ విధంగా రోజులు బలవంతంగా యీడ్చుకు పోతున్నది.

రాత్రంతా దీపము వెలుగుతూనే వుంటుంది. కాని వుండి వుండి ఎవరో తలుపు తట్టినట్లై లేచి తలుపు తీసి ఎవరూ కనిపించక ఆశాభంగం చెంది తిరిగివచ్చి నడుం వాల్చేది. ఉద యం ఎనిమిది తొమ్మిది గంటలకు నిద్రలేస్తుంది. అది ఆమెకు మొదటి నుండి వస్తున్న అలవాటు. ఆ అలవాటును పోకుండా అలా పట్టుకొస్తున్నది. తల్లికి ఈ పాడు అలవాటెందు కైనదో నళినికి మాత్రం తెలియదు.

వయస్సు గతించింది. ఉన్న డబ్బు కాస్తా రోగాలకూ, రొప్పాలకూ ఖర్చయి పోయింది. సంపాదించే రోజులలో ఖర్చుగూడా యెక్కువగానే వుంటుంది. దాసదాసీలు, చుట్ట పక్కాలు ఎప్పుడూ యింటినిండా కిటకిటలాడుతూ వుండేవారు. తాత తండ్రులు సంపాదించిన ఆస్థి యేమైనా వుంటే కాంచన చిన్నతనంలోనే కర్పూరంలా హరించుకు పోయింది.

ఇప్పు డామె స్థితి దుర్భరంగా వున్నది. యౌవ్వనం పిట్టలా ఎగిరి పోయింది. వృద్ధాప్య మావరించింది. వేశ్యా

వృత్తికనర్హురాలు. పొట్ట గడవడమే కష్టంగాఉంది. ఆదాయం చాలినంత లేదు. అందుచేత ఆమె పాల వ్యాపారం పెట్టింది. పావలో అర్ధో వస్తే రోజులు గడిచి పోతున్నాయి.

ఎప్పుడైనా డబ్బు కవసరమొస్తే ఆమె నాయుడికి కబురు చేసేది. అడగంగా అడగంగా అయిదో పదో యిచ్చేవాడు. నాయుడొకప్పుడామెమీద రూపాయల వర్షం కురిపించేవాడని లోకులిప్పటికీ చెప్పుకొంటారు. కాంచన నాయుడింట్లో నాలుగైదు సంవత్సరాలున్నది. తరువాత నాయుడు యింట్లోవాళ్ల పోరు పడలేక ఆమెను వేరే యింట్లో కాపురం పెట్టించాడు. నాయుడు వస్తూపోతూ వుండేవాడు. అతనిచ్చే డబ్బుతో యిల్లుగడిచేది. కాస్తోకూస్తో పైసంపాదన గూడా వుండేది.

కాని యిప్పుడు నాయుడుస్థితిగూడా బాగాలేదు. రెండు సంవత్సరాలనుండి మంచంలోపడి తీసుకొంటున్నాడు. అతని పొలమూ, పుట్రాగూడా చేతినుండి జారిపోయింది. కొడుకులు ఏదో సర్కారు ఉద్యోగంచేస్తూ తండ్రికి మందూ మాకులకని నెలనెలా కొంత డబ్బు పంపిస్తున్నారు. అందులో ఏ కొద్దో మిగిల్చి నాయుడు కాంచనకు పంపిస్తున్నాడు.

"అమ్మా! నాన్నవరే?" అని నళిని ఎప్పుడైనా అడిగితే నాయుడుపేరు చెప్పేది కాంచన.

"అయితే ఆయ నెక్కడున్నాడు?"

"ఆయన జబ్బుగావున్నారు. మందు తీసుకొంటున్నారు."

నళిని చదువుకొనే స్కూలు రిజిష్టరులో నాయుడిపేరు సంరక్షకుల జాబితాలోనున్నది. అదిచూచి పిల్లలు ఎగతాళి చేస్తే నళిని యేడ్చేది. అవమానంతో క్రుంగిపోయేది.

ఒకనాడామె స్కూలునుండి యింటికి వస్తున్నది. కొత్తపట్నంలో బడిలేదు. కొత్తపట్నానికి మైలు మైలున్నర దూరములోనున్న కోడూరులోనున్నది. అక్కడే జమీందారు గారు కట్టించిన ఆసుపత్రిగూడా ఉన్నది. జమీందారుగారొక పెద్దమేడలో నివసిస్తున్నారు.

ఆమె చేలగట్లమీదుగా వస్తున్నది. పొలాల్లో మినుము చల్లి వున్నది. ఆమె రెండు మినపమండలు త్రుంచింది. సీతారాం చూచాడు. ఆ చేను సీతారాం పినతండ్రిది. సీతారాంకి కోపమువచ్చింది. "మినపకాడ లెందుకు తుంపావ్? ఈ చేను నీ బాబుదనుకొన్నావా?" అని గద్దించాడు.

"దాని బాబెవడు? అసలున్నాడా? లేడా?" అని పద్మనాభం అందుకొన్నాడు. పద్మనాభం వయస్సులో వాళ్లిద్దరికంటె పెద్దవాడు. ఆలస్యంగా చదువు మొదలెట్టాడు. ఇప్పుడుగూడా అతనితండ్రి అతనిని పొలంపనులకు పంపుతూ వుంటాడు. అతను ఆకతాయి అని పేరుపొందాడు.

"నీ ముఖానికి నన్నెద్దావ చెయ్యొచ్చావా? ఇంటింటికి చేటప్పాలకు తిరుగుతావ్" అన్నది నళిని కోపంగా. పద్మనాభం తండ్రి చాల పేదవాడు. అతనికొక ఎకరం యిసుకపర్ర వున్నది. ఎంతకష్టపడినా అందులో చిట్టెడుగింజలు పండవు. అప్పుడప్పుడు కూలికిగూడ పోతాడు. ఏమీ దొరకనినాడు ఒకనాడు ఒక రింట్లో మరొకనాడు మరో యింట్లో చేటప్పాలు తెచ్చి కాలం వెళ్లబుచ్చుతున్నాడు.

"ఏమన్నావ్? మళ్లీ కుయ్యి ఆకూత?" అంటూ పద్మనాభం పిడికిలి బిగించి పండ్లు పటపట నూరుతూ ఆమె మీదకు పోయాడు.

నళిని భయంతో కంపించిపోయింది. చేతిలో నున్న మినప మండలు రెండూ చేలోకి విసురుతూ "ఎప్పుడూ నా బాబు, ఆడంగి పనులు మాత్రం చేయడు" అన్నది.

పద్మనాభానికి తల్లి లేదు. అతని తండ్రి రెండో వివాహం చేసుకోవాలని యెంతో ప్రయత్నం చేశాడు. కాని పిల్ల నిచ్చే వాళ్లెవరూ కనిపించలేదు. అతనికి చెయ్యికాల్చుకోక తప్పడం లేదు.

ఈ మాట వినేసరికి పద్మనాభం కోపానికి మితిలేక పోయింది. ఆమె జుట్టు పట్టుకొని వంగతీసి పిడికిలితో గ్రుద్ద సాగాడు. నళిని చేతిలో సంచి క్రిందపడవేసి ఏడువసాగింది. ఇంతవరకూ చూస్తూ ఊరుకొన్న సత్యం యిక ఉండబట్టలేక పద్మనాభంమీదకు దూకి ఒక్క చెంపదెబ్బ వేశాడు.

సత్యంకంటే పద్మనాభం బలశాలి. ఇరువురూ చేతులు కలిపారు. క్రిందా పైనా పడుతూ చేనంతా నలగద్రొక్కుతున్నారు. "నా చేనంతా పాడుచేస్తున్నారా" అంటూ సీతారాం గోలపెడుతూనే వాళ్ళను సర్దాడు.

ఇద్దరూ కాసేపు తన్నుకొన్నారు. అలసిపోయారు.

"దానినంటే నీకు పొడుచుకొచ్చిం దెందుకోయ్ ? అది నీ కే మవుతుందేమిటి ?" అన్నాడు పద్మనాభం.

"ఏదో ఒకటవుతుంది. ఆమెను కొట్టడానికి నీ కేమి హక్కున్నది ?" అన్నాడు సత్యం.

"చెపుతా ఏమి హక్కున్నదో" అంటూ పద్మనాభం సీతారాం చేయి విడిపించుకొని ముందుకు దూకాడు. సత్యం గూడా తన పలక తీసుకొని అతనిమీదకు దూకాడు. పద్మ

నాభం అతని చేతిలో పలక లాక్కొని దూరంగా విసరి వేశాడు. సత్యం చెంపమీద అయిదు వ్రేళ్లూ అచ్చులా కని పిస్తున్నాయి.

"ఇప్పుడు తెలిసిందా హక్కేమిటో?" అంటూ పద్మ నాభం మూట ఎత్తుకొని చరచరా వెళ్లిపోయాడు.

"ఇంటికి పద నీ పని చెపుతాను" అంటూ సత్యం గట్టుమీద కూర్చుని యేడుస్తూ చెంప సవరించుకొన్నాడు. అతని పలక అతని కనుల ముందే ముక్కలు ముక్కలై పడి వున్నది. పుస్తకాలన్నీ చిందరవందరగా పడివున్నవి.

నళిని అతని ప్రక్కనే కూర్చుని చిందర వందరగా పడి వున్న అతని పుస్తకాలన్నీ అతని సంచిలో సర్ద సాగింది.

"ఏడవకు అన్నయ్యా! ఇంటికి పోదాంపద" అంటూ నళిని అతని కన్నీరు తుడిచింది.

"ఇంటికి ఎలా వచ్చేది? పలక పగిలి ముక్కలు ముక్కలై పోయింది. పుస్తకాలన్నీ చిరిగాయి. నాన్నగారు కొడతారు. ఇంటికి ఎలా వెళ్లేది?" అంటూ సత్యం ముఖానికి చేతులడ్డం పెట్టుకొని బోరున ఏడవసాగాడు.

"పలక నీవు పగలగొట్టుకొన్నావా? పుస్తకాలు నీవు చించావా? ఆ ఆకతాయి చేశాడీ పని. ఇంటికి పోయి మీ నాన్నతో చెప్పి వాడిపని పట్టిద్దాం. దీనికి తగిన ప్రతీకారం చెయ్యందే వాడిని వదలి పెట్టామా? అన్నయ్యా! లే. వెడ దాం పద" అన్నది నళిని.

సత్యం లేచి యింటి ముఖం పట్టాడు. నళిని అతని వెంబడే అడుగులో అడుగు వేస్తూ వస్తున్నది. నళిని పూర్వీకు

లెంతకాలంనుండి సత్యం యింటిప్రక్క నివసించేవారో నళినికి తెలియదు. కాని యీనాడు ఒకరి నొకరు బాగా అర్థం చేసుకొన్నారు.

## 3

సత్యానిది పెంకుటిల్లు. మూడు గదు లున్నవి. వెనకా ముందూ వసారా లున్నవి. వెనకప్రక్క నున్న పెద్ద వసారా మినహా మిగిలిన యిల్లంతా ఖాళీగానే ఉంటుంది. అది యిల్లులా వుండదు. గుజ్జుపు పాకలా వుంటుంది. వెనుక వసారాలో సత్యమూ అతని తండ్రీ కాపుర ముంటు న్నారు. ముందు వసారాలో పచారీకొట్టు. సుబ్బారావు పచారీ దుకాణం. మధ్యనున్న గదులు ఖాళీ. యాతా యాత జనం వానిని సత్రంగా ఉపయోగించు కొంటున్నారు.

చాల పురాతన యితిహాసం గలిగిన వంశం సత్యానిది. ఏడెనిమిది తరాలకు పూర్వం వీరి పూర్వీకులు కొత్తపట్నం రాజు దర్బారులో పూజారులుగా వుండేవారు. కొత్తపట్నపు దేవాలయాన్ని రాజాగారే కట్టించారని చెపుతారు. దేవాల యం ప్రక్కనే పెద్ద రాజ మహాలుండేదని అంటారు. ఇప్పు డిక్కడ పెద్ద మట్టి దిబ్బ తప్ప మరేమీ లేదు.

సత్యానిది అగ్రజాతికి చెందిన బ్రాహ్మణ వంశం. సత్యం తండ్రి అనంత కృష్ణశర్మ, వంశ పరంపరాను గతంగా వస్తున్న పూజారి వృత్తినే చేపట్టి దేవాలయంలో పూజారిగా వుంటు న్నాడు.

తాత తండ్రుల హయాంలో చాల ఆస్థి వుండేది.

మాన్యా లుండేవి. కాని సరియైన కాలంలో నీరు పెట్టక, కలుపు తీయక, అవన్నీ బీళ్లయి పోయాయి. పంటలు పండేవి కావు. అప్పుడప్పుడూ వేరుశనగమాత్రం కొద్దిగా పండేది. వారు స్వయంగా వ్యవసాయం చేసేవారు కాదు. కవులు కిస్తే కవులుదార్లు ఒక సంవత్సరం యిచ్చి ఒక సంవత్సరం యివ్వక వేధించేవారు. పంటలు సరిగా పండడం లేదని వారి యిష్ట మొచ్చినంత యిచ్చేవారు.

పూజారి వృత్తివలన పరలోకంలో బాగా వుంటుం దేమోగాని యిహలోకంలో మాత్రం భుక్తి గడవడమే కష్టంగా వుంది. సత్యం తండ్రి ఆదాయ మెక్కువ లేకపోయినా ఉన్న దానితోనే సంతృప్తిచెందే జీవి. ఎలాగో కాలం వెళ్లదీస్తు న్నాడు. చుట్టుపట్లగ్రామాల్లో పౌరోహిత్యం గూడా చేస్తుం టాడు. దాన దక్షిణల రూపంలో వస్త్రాలు గూడా దొరికేవి.

అతను విదురుడు. సత్య మీ భూమిపై కండ్లు తెరవ గానే తల్లి శాశ్వతంగా కన్ను మూసింది. ఇది దాదాపు పది సంవత్సరాలనాటి మాట. చాలా కాలంవరకు ఆమె కడుపు పండ లేదు. పండగానే ఆమెకు పుత్రరత్నాన్ని చూచుకొనే యోగ్యత లేకపోయింది.

సత్యం చిన్నతనంలో కోడూరులోనున్న పినతల్లి వద్ద పెరిగాడు. ఇప్పు డా మెగూడా యిహలోకాన్ని విడిచిపెట్టింది. గడచిన మూడు సంవత్సరాలనుండి తండ్రివద్దనే ఉంటున్నాడు. తండ్రే అతని మంచి చెడ్డలు చూస్తున్నాడు. తల్లి లేని కారణంగా అతని నెంతో గారాబంగా, ఏ కష్టమూ కలగకుండా కంటికి రెప్పలా కాపాడుతున్నాడు. లోకులు రెండో పెండ్లి

చేసుకోమని ఎన్నో విధాల చెప్పారు. ఎంతోమంది పిల్లనిస్తామంటూ తిరిగారు. కాని సత్యం తండ్రి పునర్వివాహం చేసుకోవడాని కంగీకరించలేదు. అతను నిష్టాగరిష్టుడు. సాధుజీవి. కర్మిష్టి.

ఉదయాన్నే బ్రహ్మ ముహూర్తకాలంలో నిద్రలేచి కాల్యాలు తీర్చుకొని దేవాలయంలో పూజ చేయడానికి వెడతాడు. తరువాత యింటికి వచ్చి వంటచేసి సత్యానికి భోజనం పెట్టి పాఠశాలకు పంపి తాను భోజనంచేసి మరల దేవాలయానికి వెడతాడు. వేదాధ్యయనం చేస్తాడు. సాయంత్రం దీపారాధనచేసి యింటికివచ్చి సత్యాన్ని కొంచెముసేపు చదివించి భోజనము చేయించి తాను భోజనంచేసి పండుకొంటాడు. ఇది అతని నిత్యకృత్యం. ఏ వొడిదుడుకులు లేని దైనిక కార్యక్రమం.

అతని గృహము సామాన్యంగా ఖాళీగానే వుంటుంది. ఇంట్లో విలువైన వస్తువులు గూడా లేవు. వంటపాత్రలు, రెండు మూడు పక్క చుట్టలు, గుడ్డలు, గోచెలు మాత్ర మున్నవి. ఇంట్లో ఒకమూల సంవత్సరానికి సరిపోయే ధాన్యం గాదెలో నిలవచేస్తాడు. కూరగాయలు మజ్జిగ రైతులిస్తారు.

తండ్రి జీవితం లాగానే సత్యం జీవితంగూడా వొడిదుడుకులు లేకుండా గడిచిపోతున్నది. అతను తండ్రితోపాటు నిద్రలేచి దేవాలయంలోకి వెళ్లి పూజ లవీ చేసేవాడు. చదువు సంధ్యలు యంత్రంలా సాగిపోతున్నవి. ఉత్సవ సమయాలలో తోడి పిల్లలతోపాటు తానూ ఆటలాడుతాడు. కాని అతనికి జతగాళ్లెవరూ లేరు. ఏకాకి.

మునిమాపువేళ దేవాలయంలో కూర్చుని దేవతా విగ్రహాల నకలును చిత్రించేవాడు. ఒక్కొక్కసారి బాగా కుదిరేది. అదిచూచి ఆనందతరంగాల్లో తేలిపోయేవాడు. ఏమీ తోచనప్పుడు సముద్రంవైపుకు షికారు పోయేవాడు.

నళినితో పరిచయమై నప్పటినుండి అతని కార్య క్రమంలో కొద్ది పరివర్తన మొచ్చింది. అతను మెల్లమెల్లగా దేవాలయానికి వెళ్లడం తగ్గించాడు. ఇంటి సమీపములో నున్న మొండిగోడమీద కూర్చునేవాడు. నళినిగూడా వచ్చేది. ఇరువురూ కలిసి అటూ ఇటూ పరుగెత్తేవారు. ఆట లాడేవారు. గంతులువేసేవారు. సత్య మప్పుడప్పుడు నళిని చిత్రాన్ని గీయబోయేవాడు. నళిని దానిని లాగి ఆవల పారేసేది. గప్పాలు కొట్టుతూ కాలం వెళ్ళబుచ్చేవారు.

"నాయనా! నీవు దేవాలయానికి రావడంలేదే?" అని తండ్రి ఒకనాడు సత్యాన్ని అడిగాడు.

"పంతులుగారు హోంవర్కు చాలా యిస్తున్నారు. అందుకని యింటివద్దనే ఉండి లెక్కలవీ చేసుకొంటున్నాను." సత్యం అబద్ధమాడాడు. అబద్ధమాడి అత నెందుకు సిగ్గుపడ లేదో తెలియదు. ఎప్పుడైనా తండ్రి కోపపడితే సత్యం దేవా లయానికి పోయేవాడు. పోయినా దేవాలయంనుంచి కూడ ఇంటివంక చూస్తూవుండేవాడు.

దేవాలయం ఎత్తైన ప్రదేశంలో నున్న కారణంగా అక్కడ నుండి సత్యానికి తన యిల్లు కనిపించేది. నళిని ఒంట రిగా వేపచెట్టుక్రింద కూర్చుని అన్యమనస్కంగా కంకరరాళ్లు అటుయిటూ విసిరేది. సత్యం ఆమెను చూచి ఆమెను

కలుసుకోవట మెలాగా, ఆమెతో ఆడుకోవట మెలాగా అని ఆలోచించేవాడు.

ఆ గ్రామంలో పిల్ల లెక్కువమంది లేరు. ఉన్న నలుగు రైదుగురూ పద్మనాభం జట్టువాళ్లు. సత్యం వాళ్లతో యెప్పుడూ కలవడు. బహుశా నళిని వొక్కతే అతనికి బాగా నచ్చిన, తెలిసిన పిల్ల. ఇద్దరూ పుస్తకాల సంచులు తీసుకొని కలిసి బడికి పోయేవారు. కలిసి వచ్చేవారు. కలిసి శనగలు కొనుక్కొని తినేవారు.

గట్టుమీదుగా పోతూపోతూ నళిని ఏదైనా సినిమా పాట పాడితే అదిచూచి సత్య మేదైనా సంస్కృతశ్లోకం చదివేవాడు. అతనికి శ్లోకాలేవచ్చు. ఎప్పుడైనా చేలకు నీళ్లు పెడితే చుట్టుతిరిగి కాలవకట్టనే బడి చీకటిపడేవేళకు యింటికు చేరుకొనేవారు. నళినితో సహవాసం మొదలెట్టిన తరువాత సత్యం ఆటలాడి, షికార్లుకొట్టి ఆలస్యంగా యింటికి చేరుకోవడం మామూలై పోయింది. నళిని అతనివెంటనే వుండేది. సత్యం తండ్రితో ఏవో కల్లబొల్లిమాటలు చెప్పేవాడు. తండ్రి అవే నిజమని నమ్మేవాడు.

సత్యం తండ్రి ధనవంతుడూ, ఐశ్వర్యవంతుడూ కాక పోయినా గ్రామంలో మంచి పేరుప్రతిష్ట లున్నవాడు. ఆయన నందరూ గౌరవించేవారు. ఎవరియింట్లో ఏమిజరిగినా వారి సలహా లేకుండా జరిగేదిగాదు. వారికి విరోధులుగూడా లేకపోలేదు. చాలమందికి వారే ఉత్తరాలు పత్రాలుగూడా వ్రాసేవారు. అందుకని గ్రామస్థులలో ఎక్కువమంది వారిని గౌరవంగా చూచేవారు.

౪

ఈనాడు స్కూలువార్షికోత్సవం. కోడూరువంటి చిన్న గ్రామంలో యిది పెద్దపండుగ. నెలల తరబడిగా యేర్పాట్లు జరుగుతున్నవి. ఉత్సవములో అనేకమంది అతిథులు, స్కూలు పరిపాలకవర్గంవారు పాల్గొన్నారు. స్కూలు వెలుపల మైదానములో రంగురంగుల జండాలు ఎగురుతున్నవి. జనం చాల మంది వచ్చారు.

ఉదయం కోడూరు జమీందారుగారు విచ్చేసి వివిధ తరగతులలో, ఆటలపోటీల్లో ఉత్తీర్ణులైన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు. సత్యం తన తరగతిలో ప్రథముడుగా వచ్చాడు. అతని ఆనందానికి మేరలేదు. పద్మనాభం యీ సంవత్సరంగూడా స్కూల్లో చదువుతున్నాడు. అతనికి పరుగుపందెంలో బహుమతి వచ్చింది. అందుచేత అతనుగూడా హుషారుగానే ఉన్నాడు.

సాయంత్రం వైజ్ఞానికప్రదర్శనలు జరిగినవి. మైదానంలో పెద్ద రంగస్థలం యేర్పాటుచేశారు. దానిమీద చాందినీ వ్రేలాడగట్టారు. ఎర్రని తెరగట్టారు. ప్రేక్షకులు తమలో తాము గజిబిజిగా మాట్లాడుకొంటున్నారు. కోడూరు జమీందారుగారు సపరివారంగా వచ్చి ముందుసీట్లలో ఆసీనులైనారు. వారి వెనుకవరుసలో ఊరిలోని పెద్దలు, అధ్యాపకులు కూర్చున్నారు. విద్యార్థులు కొంతమంది అక్కడక్కడ వాలంటీర్లుగా పనిచేస్తున్నారు. సత్యం రంగస్థలానికొక ప్రక్క ఉత్సాహంగా, శాంతంగా కూర్చుని వున్నాడు. అతని ప్రక్క పద్మనాభం, అతనిజట్టూ కూర్చునిఉన్నారు.

తెర లేచింది. నాటకం ప్రారంభించారు. విద్య యొక్క ఆవశ్యకతను నాటకం నిరూపిస్తున్నది. నాటకం బాగున్నది. కళాకారులందరూ చిన్న చిన్న పిల్లలు. పిల్లలే ముసలి వాళ్ల వేషాలు వేశారు. ప్రేక్షకులు చాల సేపటి వరకు కరతాళ ధ్వనులు చేశారు.

రెండవసారి యింకా తెర ఎత్తలేదు. నేపథ్యంలో మధురమైన జంత్ర వాద్యాల సంగీతం వినిపిస్తున్నది. మెల్ల మెల్లగా అవనిక లేచింది. రంగస్థలమంతా ఆకుపచ్చని విద్యు ద్దీపాలతో శోభాయమానంగా ఉన్నది. లయాను గుణ్యంగా నృత్యం చేస్తూ మయూరం రంగస్థలం మీద ప్రవేశించింది. ముఖానికి మయూరావరణము. జడలో మయూర పింఛము. ఎక్కడో మేఘం గర్జిస్తున్నట్లు యిక్కడ మయూరం నృత్యం చేస్తున్నది. సత్యం దృష్టి మయూరం మీద పడింది. నృత్యం చేస్తున్నది నళినేనని తెలుసుకొన్నాడు.

నాట్యం చేస్తూ చేస్తూ నళిని రంగస్థలం మధ్యకు రాగానే "అరెరె! ఆడనెమలి పురి విప్పి నాట్యం చేస్తుందే!" అని బిగ్గరగా అరిచాడు పద్మనాభం. అతని సావాసగాళ్లంతా గొల్లున నవ్వారు. ప్రేక్షకుల దృష్టి ఒక్క పర్యాయం అటు తిరిగింది. తిరిగి యథాపూర్వంగా నృత్యంలోని ఆనందాన్ని అనుభవిస్తున్నారు.

"అడే. ఆ పిల్ల ఆడకపోతే మరెవరాడతారురా?" అన్నాడు పద్మనాభం. అతని జట్టు వాళ్లంతా 'వారెవా' అన్నారు.

ఈ మాట వినగానే సత్యానికి కోపం వచ్చి అతని వంక గుర్రురిమి చూచాడు. పోట్లాడు కొన్నప్పటి నుండీ వాళ్లిద్దరి మధ్యా మాటలు లేవు.

ఆ తీక్షణ దృష్టి చూచి పద్మనాభం జట్టులో వాడొ కడు "అరే! జాగ్రత్తరోయ్. శివుడు మూడవ కన్ను తెరి చాడు. భస్మమైపోతాం" అంటూ వికటాట్టహాసం చేశాడు. సత్యం వాళ్లను కన్నులతోనే బెదరిస్తున్నాడు.

"అబ్బే! కాదురా. ఇప్పుడు బ్రాహ్మణులుకూడా కళ్లు తెరవటం ప్రారంభించారురా! చూస్తున్నారు కూడాను." అన్నాడు సీతారాం. ఇతను రైతుబిడ్డ. ఇతని వంశీకులు జస్టీసుపార్టీ వున్న రోజుల్లో దానికి అండగా వుండేవారు. బ్రాహ్మణద్వేషం వీరి నరనరాల్లో ప్రవహిస్తున్నది. అది తాతతండ్రులనుండి సీతారాంకి సంక్రమించింది.

సత్యం ఏకాకిగా వున్నాడు. కోపాన్ని దిగమ్రింగి రంగ స్థలం వంక చూడడానికి ప్రయత్నించాడు. నళిని నృత్యం అంతిమ ఘట్టానికి వచ్చింది. సంగీతం తారస్థాయి నందుకొన్నది. మయూరపింఛము గూడా ధృతగతి నందుకొన్నది. అడుగులు లయ తప్పకుండా పడుతున్నవి. నాట్యం చేస్తూచేస్తూ మెరపు తీవలా మెరిసి రంగస్థలం పైనుండి అదృశ్యమైంది. ప్రేక్షకులు దిక్కులు పెక్కటిల్లేలా కరతాళధ్వనులు చేశారు.

"ఇది ఎవరి పిల్ల?" అని జమీందారుగారు దగ్గర నున్న వారి నడిగాడు. బహుశా నాట్యం ఆయనకు నచ్చి వుండవచ్చు. "కాంచన కూతురండీ!" అని మెల్లగా చెవిలో చెప్పాడాయన. జమీందారుగారు ముఖం జేవురించుకొని

'కాంచన' అంటే ఎవరా? అని గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ వైఖరి చూచి మరొకాయన "జమున పెద్దక్కండీ కాంచన" అన్నాడు.

జమీందారు చిరునవ్వు నవ్వాడు. కరతాళధ్వనులింకా మ్రోగుతూనే ఉన్నవి. వారుగూడా జోరుగా కరతాళ ధ్వనులు చేయసాగారు. కరతాళధ్వను లాగిపోగానే జమీందారుగారిచేయి బుగ్గవుస్త్రీమీదకు పోయింది. జమున ఆయన గారి ఉంపుడుకత్తె.

కాంచన రంగస్థలం ప్రక్కనే ఆనందాతిరేకంతో మైమరచి పోయింది. ఆమె నళినిని అలంకరించి రంగస్థలంపై ప్రవేశపెట్టింది.

తరువాత రెండు మూడు గీతాలు పాడారు. తరువాత పద్మనాభం రంగస్థలంపైకి వచ్చాడు. చేతిలో గుడ్డపీలికలతో ముడివైచిన ఢక్క వున్నది. పొడుగాటి అంఖరకా వేశాడు. ఎఱ్ఱతలపాగా పెట్టాడు. సందులు గొందులు తిరిగే బుడబుక్కలవాని వేషం.

"జరుగుతుంది మారాజులు బాబూ! జరుగుతుంది మా లచ్చిమి తల్లీ!" అంటూ డుబుడుక్కు డుబుడుక్కుమంటూ ఢక్క మ్రోగించాడు.

"ఇరువురి అదృష్టం కలిసివస్తుంది." డమరుక శబ్దము.

"వివాహం జరుగుతుంది!" డమరుక శబ్దం.

"వివాహం ఎవరిది?" అని అతనిప్రక్క వా డడిగాడు.

"నలదమయంతుల వివాహం" అంటూ అతను సత్యం వైపు చూస్తూ ఢక్కా జోరుగా మ్రోగింపసాగాడు. అతని

స్నేహితులు సత్యం వెనకాల కూర్చుని మెల్లగా చొక్కా పట్టుకొని లాగసాగారు.

"వసంతం వస్తుంది వసంతం. మేఘూ లలముకొంటవి. మయూరాలు నృత్యం చేస్తవి." అంటూ జోరుగా ఢక్కా వాయిస్తూ బుడబుక్కల పద్మనాభం నాట్యం చేయసాగాడు. వాడు నళినిని అనుకరిస్తూ నాట్యం చేయసాగాడు. ప్రేక్షకులంతా గొల్లుమన్నారు.

కార్యక్రమం సమాప్తమైనది. అవనిక జారింది. కళాకారులంతా వరుసగా రంగస్థలంమీద నిలబడ్డారు. పద్మనాభం అందరికంటె ముందున్నాడు. అతడు జాతీయగీతం జనగణమన పాడుతున్నాడు. అతని గాత్రంలో గాంభీర్యం, మాధుర్యం, వొద్దిక ఉన్నవి. నళిని అతనివంక ఆశ్చర్యంగా చూస్తున్నది.

ప్రేక్షకులు పలుచబడుతున్నారు. విద్యార్థులు కుర్చీలు, బల్లలు యథాస్థానాల్లోకి చేరవేస్తున్నారు. రంగస్థలపు తెరలు వగైరా అన్ని ఊడదీశారు. సత్యం మెల్లమెల్లగా రంగస్థలం వెనకవైపుకు చేరాడు. పద్మనాభాన్ని చూడగానే పిడికిలి బిగించి లాగి ఒక్క లెంపకాయ కొట్టబోయాడు కాని పద్మనాభ మతని చేయి పట్టుకొని మెలిపెట్టాడు. ఇద్దరూ కలబడ్డారు. ముష్టాముష్టి బాహాబాహి యుద్ధం సాగింది. పద్మనాభం సత్యాన్ని క్రిందపడవైచి యీడ్వసాగాడు. తల నేలకేసి కొట్టాడు. అక్కడే ఒక కంకరరాయి ఉండి సత్యం భుజానికి గ్రుచ్చుకొన్నది. రక్తం ప్రవహింపసాగింది. జనం చుట్టూ ప్రోగయారు. వాళ్లు పద్మనాభాన్ని దబాయించబోయారు కాని పోట్లాటకు కారణం తెలుసుకొని యేమీ అనలేరు పోయారు.

నళినిగూడా పరుగెత్తుకొని వచ్చింది. ఆమె వెంట ఆమె తల్లిగూడా వచ్చింది. సత్యం భుజాన్నుండి రక్తం కారడం చూచి ఆమె నయనా లశ్రుపూరితా లైనవి. కారణం దురూహ్యం.

"ఈ పద్మనాభం ఆనాటి కానాడు ఆకతా యయిపో తున్నాడు. మరి వారసత్వ మెక్కడకుపోతుంది ? తండ్రిని బోలిన కొడుకు" అన్నది కాంచన.

"ఇది నీ వనఖ్ఖర్లే" దన్నది కంపిత స్వరంతో నళిని.

కాంచన సత్యాన్ని తన చెల్లెలు యింటికి తీసుకు పోయింది. అక్కడ ఆమె అతని గాయాన్ని శుభ్రంగా కడిగింది. దెబ్బ అంత పెద్దదికాదు. కొంచెం గీసుకుపోయింది. అంతే, కాని నళిని మాత్రం అతని ఎముక విరిగినట్లు భయ పడుతున్నది.

"ఇక్కడే కదలకుండా పడుకో" అన్నది నళిని.

సత్యం యింటి నాలుగువైపులాచూచాడు. ఇల్లు చాలా పెద్దది. నాలుగువైపులా ఉద్యానవన మున్నది. గది చక్కగా అలంకరించివున్నది. నలుగురైదుగురు నౌకర్లుకూడా వున్నారు. కిటికీలకు పరదాలున్నవి.

"లేదు. లేదు. నేను వెళ్లాలి. లేకుంటే మా నాన్నగారు నేనేమైనానోయని వెతుకుతారు. భోజనంగూడా చేయరు."

"నేను మనిషిని పంపుతాను." అన్నది నళిని.

"వద్దు. వద్దు. నన్ను వెళ్ళనివ్వు."

"సరే! అంత వెళ్లాలనివుంటే వెళ్ళనివ్వమ్మా. ఎందుకు బ్రతిమాలడం." అన్నది కాంచన.

"ఈ రాత్రికివుండు. ఉదయాన్నే మేముగూడా వస్తాం." అన్నది నళిని.

"నీకు తెలియదు నళిని." అంటూ సత్యం రెండడుగులు బయటకు వేశాడు. సత్యంవెంట నళినిగూడా వచ్చింది.

"అసలు నీ వతనితో పోట్లాట పెట్టుకొన్నదెందుకు?" అన్నది నళిని. సత్యం మాట్లాడలేదు. నళిని ఆప్రశ్నే రెండవమారడిగింది? "అతడు నిన్నూ నన్నూ అవమానపరుస్తున్నాడు. నేను సహించలేను?" అంటూ సత్యం భుజం సవరించుకుంటూ నళినివంక తిరిగైనా చూడకుండా వేగంగా వెళ్ళిపోయాడు. ఆమెకు దుఃఖం కంఠదగ్నమైనది.

వెన్నెలరాత్రి. అతను తొందరగానే యిల్లు చేరుకొన్నాడు. తండ్రి అతనికొరకు నిరీక్షిస్తున్నాడు. అతను తండ్రితో యీవిషయాలేమీ చెప్పలేదు. భోజనంచేసి పండుకొన్నాడు. అటూ యిటూ పొర్లిగింతలు పెడుతున్నాడు. కాని నిద్రరావటంలేదు.

అక్కడ నళినిగూడా కన్నీటితో తన తలగడ తడుపుతున్నది.

*

వేపచెట్టుక్రింద కూర్చుని సత్యం బొగ్గుతో రాతిమీద బొమ్మలు గీస్తున్నాడు. ఎత్తైన దిబ్బమీద దేవాలయమును చుట్టూ చెట్లూ చేమలూ చిత్రించాడు. దూరంగా కన్పిస్తున్న కొత్తపట్నం దేవాలయంలా చిత్రించాడు.

సత్యానికి బొమ్మలుగీయడం మహాసరదా. సమయం దొరికినప్పుడు నేలమీద బొగ్గుతో బొమ్మలు గీస్తాడు. బడిలో గూడా పలకమీద బొమ్మలు గీస్తాడు. అతని యీడు కుర్ర వాళ్లల్లో బొమ్మలు గీయడంలో అతనే దిట్ట. ఈ కళలో అతనికి అసాధారణ ప్రతిభ ఉన్నది.

సాయం సమయము. సత్యం తండ్రి దేవాలయములో వున్నాడు. రైతులు పగలంతా పొలాల్లో చాకిరీ చేసి యిండ్లకు తిరిగి వస్తున్నారు. ఇండ్లకు మరలిన పశువుల పాదధూళి ఆకసమంటింది. కొత్తపట్నం రాత్రిపూట విశ్రాంతి తీసుకోవడానికి తయారవుతున్నది.

కొద్దిసేపటి క్రితమే పద్మనాభం తండ్రివచ్చి సత్యం ఇంటి తలుపు తట్టాడు. కాని సత్యం వినిపించుకోనట్లూరకొన్నాడు. అతను సాధారణంగా వీరింటికి తరచుగా రాడు. ఈ రోజెందుకు వచ్చాడో తెలియదు. సత్యం కొంచెము సేపాలోచించాడు. "ఏమో ఎందుకొచ్చాడో? ఆలోచిస్తూ కూర్చున్నందు వలన ప్రయోజ మేమిటి?" అనుకొంటూ అతను బొమ్మలు గీసు కోసాగాడు.

నళిని చీపురు కట్ట తీసుకొని వాకిట్లోకి వచ్చింది. వేప చెట్టు క్రింద సత్యాన్ని చూచి నళిని చీపురు విసరి లోపల పారేసి పెంకుల గుట్ట దగ్గరకు పోయి అతనిని రమ్మని చేతితో సంజ్ఞ చేసింది.

"చదువుకోవడం గూడా లేదు. పగలంతా ఏమి చేస్తుంటావ్?" అన్నాడు సత్యం.

"చదువు సాగినా బాగానే వుండేది. ఈ చాకిరీ అయినా తప్పేది." అంటూ చేతులు నలుపుకొంటూ, అటూ ఇటూ చూడసాగింది. తరువాత కూర్చుని వ్రేళ్లతో నేలపై గీతలు గీయసాగింది. ఆమెవదనంలో ప్రసన్నత లేదు. విచారరేఖలు కన్పిస్తున్నాయి. ఆమె కన్నులలో చాంచల్యము గోచరిస్తున్నది.

వార్షికోత్సవం తరువాత స్కూలుకు కొన్నాళ్లు సెలవలిచ్చారు. వీరిరువురూ పూర్వం లాగా కలుసుకోవడం లేదు. స్కూలు నడుస్తున్న రోజుల్లో యిద్దరూ కలిసి స్కూలుకు వెళ్లేవారు. పాటలు పాడేవారు. ఆనందంగా కాలంగడిపేవారు. ఇరువురూ తలిదండ్రుల చాటు పిల్లలు. వారి యిష్టమొచ్చినట్లు తిరగడానికి వీలులేదు. సత్యంతండ్రి సత్యాన్ని రోజూ దేవాలయానికి తీసుకొనిపోయి మంత్రాలవీ నేర్పుతాడు. నళిని తల్లి నళినికి ఎప్పుడూ ఏదోవొక పని చెపుతుంది. ఒక్క క్షణం తీరిక్కా ఆడుకోవడానికి వీలులేదు. రొప్పుతూ రోజుతూ ఎప్పుడూ వాకిట్లో కావలి కూర్చుంటుంది. బడి వున్న రోజున నళినికే యాటంకమూ లేదు. స్కూలుకు పోననకుండా ఎంతో సంతోషంగా పోతుంది. రోజూ రానూపోనూ నాలుగు మైళ్లు నడచి స్కూలుకు పోవాలన్నా ఆమె కేమీ కష్ట మనిపించేది కాదు. కాళ్లా నొచ్చేవి కావు, కడుపు నొచ్చేది కాదు. కాని బడి లేనప్పుడు తల్లి ఏదైనా పని చెప్పగానే ఆమెకు తలనొప్పో, కడుపు నొప్పో వచ్చేది. మెదలకుండా మంచము మీద పరుండేది.

"అలా నిలబడే వున్నావేం ? కూర్చో" అంటూ సత్యం ఆమె చేయి పట్టుకొన్నాడు.

"సరే! ఆమె బయటకు వచ్చిచూస్తే యిల్లెగిరిపోయేలా అరుస్తుంది."

"వస్తుందీ ? ఎలా వస్తుంది ? నడవడానికి ఏనుగ గూడా నడుస్తుంది. కాని..."అంటూ సత్యం నళిని తల్లిని పరిహాస మాడాడు.

"ఏమిటి ?" నళిని తీక్షణంగా అతనివంక చూచి తరువాత ముఖానికి చేతులడ్డం పెట్టుకొని నవ్వసాగింది.

"నీకు మీ అమ్మ అంటే బలే ప్రేమనుకొంటాను." ఈ మాటకు నళిని పెదవులు తడుపుకొంటూ ఏడుపు ముఖంపెట్టి జవా బివ్వలేక పోయింది. ఆమె ఏదో చెప్పుదామని వచ్చి మరచిపోయిందానిలా యకాయకి లేచి నిలబడింది. కొంచెము సేపాగి "మీకు కోడూరులో ఎవరూ చుట్టాలు లేరా ?" అని అడిగింది.

"లేకుంటే ?" అన్నాడు సత్యం.

"అరె...అరె...!" అంటూ నళిని ఏమో చెప్పబోయి ఆగి-"అయితే సెలవలిక్కడే గడుపుతావా?"అని ప్రశ్నించింది.

"అవును. అయితే?"

"ఏమి చెప్పేది ? వార్షికోత్సవం రోజు నాట్యం చేయక పోయినా బావుండేదని నే ననుకొంటూ వుంటాను. నీవు అనవ సరంగా ఆ ఆకతాయి పద్మనాభంతో పోట్లాట పెట్టుకొన్నావు. ఊరిలో పిల్లలంతా అతని జట్టే. వాడితో పగ తెచ్చుకొని ఊరిలో వుండడం గూడా కష్టమే."

"పోనిలే వాడిమాట ... ఇప్పుడే అతనితండ్రి వచ్చి తలుపు తట్టాడు. ఈ వెధవలతో నా కేం పని... నే నెలా వున్నానో అలానే వుంటాను."

"కాని...కాని..."

"నీ వా రోజు అద్భుతంగా నాట్యం చేశావ్. చూచిన వాళ్లంతా 'వహావ్వా. వహావ్వా' అన్నారు. భగవంతుడు నిన్ను నాట్యం చేయడానికే పుట్టించాడా అని నేనను కొంటాను."

"అందుకనే కష్టాలు వచ్చి పడ్డవి."

"ఏం కష్టాలు?"

"మా పిన్నమ్మ రోజూ కబురు చేస్తున్నది. కోడూరు జమీందారుగారికి నా నాట్యం నచ్చిందట. వారు నాకు నాట్యం సలక్షణంగా నేర్పిస్తారట. అమ్మకు పడుకొన్నా, లేచినా, కూర్చున్నా యివే కలవరింతలు. సెలవలు గదా? ఇంటివద్ద కూర్చుని ఏమి చేస్తా వంటుంది?"

"అయితే నీకు నాట్యమంటే యిష్టంలేదా? నేర్చు కోవాలని లేదా?"

"నాకు సంగీతమంటే యిష్టం. ఒంటరిగా కూర్చుని పాడుకోవచ్చు, కాని నాట్యం ఒంటరిగా నేర్చుకొనడానికి వీలులేదు."

"ఎందుకీ నిరర్థకపుమాటలు? నాట్యం పాపమా? భగవంతునిముందు నాట్యంచేసినప్పుడు మనుష్యులముందు గూడా నాట్యంచేయవచ్చును. మానాన్నగారప్పుడప్పుడు చెప్పు తుంటారు. వారి తాతతండ్రుల హయాంలో దేవాలయ ఉత్సవ సమయాల్లో నాట్యం జరిగేదట. జనం చుట్టుపట్ల గ్రామాల నుండి విపరీతంగా, యిసుకవేస్తే రాలకుండా వచ్చేవారట."

"నన్ను నాట్యం నేర్చుకోమంటావా?"

"అవును. నేర్చుకోమంటాను".

"అయితే మా పినతల్లిఅంటే నాకు బొత్తిగా యిష్టం లేదు. నేను కోడూరు వెళ్లలేను. నీ విక్కడవుంటే నేను..." నళిని చెపుతూచెపుతూ ఆగి సత్యం అర్థనిమీలిత నేత్రాలను చూచి చిరునవ్వునవ్వి "అయితే నీవుగూడా కోడూరువస్తావా?" అని ప్రశ్నించింది.

"నే నెలారాను?"

"నేను మాత్రం ఎలా వెళ్లను? సెలవలు కొద్దిరోజులే యిచ్చారు. ఇప్పుడేదైనా నేర్చుకోవడం మొదలిడితే...?"

"నేనుగూడా మాష్టరుగారిదగ్గర చిత్రలేఖనం నేర్చు కొందా మనుకొంటున్నాను."

"అయితే యింకేం వెళ్లుదాం."

"వారు కోడూరులోలేరు. స్వగ్రామం వెళ్లారు."

"అయితే నేనూ యిక్కడేవుంటాను."

"వద్దు. వద్దు, పిచ్చిదానా!"

సత్యం నిర్లిప్తంగా దేవాలయంవంక చూడసాగాడు. చీకటిపడుతున్నది. దేవాలయంలో దీపారాధనజరిగింది. అతని తండ్రి యింటికివచ్చే వేళైనది.

"మంచిది. ఈమాట చెపడానికేనా ముఖం యింతచేసు కొని వచ్చావు?"

నళిని మాట్లాటలేదు.

"ఎప్పుడు వెడతావు?"

"నీవుగూడా అప్పుడప్పుడు కోడూరు వస్తుంటావా?"

"ప్రయత్నిస్తాను."

"అయితే నీవు గట్టిగా వెళ్లమంటే వెళ్లుతాను."

సత్యం మాట్లాడలేదు.

"వెళ్లక తప్పనట్లున్నది. లేకుంటే అమ్మ, పిన్ని బ్రతక నిచ్చేలా లేరు. కాని నీవు..."

సత్యం దేవాలయంవైపే చూస్తున్నాడు.

"నళినీ! ఎక్కడ మాయమైనావే?" అంటూ నళినితల్లి యింట్లోనుండి కేకవేసింది.

నళిని పరుగెత్తుకొంటూ యింట్లోకి పోయి చీపురు తెచ్చి వాకిలి ఊడవసాగింది. సత్యం అలానే విచారంగా చూస్తూ కూర్చున్నాడు.

౬

రెండు మూడు సంవత్సరా లనంతరం ఒకరోజు సత్యం, నళిని కోడూరు సమీపంలోనున్న కాలువవంతెనమీద నిల బడిఉన్నారు. వంగివంగి క్రింద ప్రవహిస్తున్న నీటిలోకి చూస్తు న్నారు. కాలువ నీరు వేగంగా ప్రవహిస్తున్నది. కాలువగట్టు మీద వరుసగా పెద్దపెద్ద చెట్లున్నవి. వంతెన దగ్గరలో చిన్న చెట్ల పొద వున్నది.

సాయంత్రం నాలుగు గంటల సమయం. నళిని చేతిలో చెంబున్నది. ఆమె భయపడుతున్నట్లు కన్పిస్తున్నది. ఉండిఉండి కోడూరుగ్రామాన్ని, చేలలో యెగురుతున్న పిట్టల్ని చూస్తు న్నది. ఆమె పినతల్లి యింటి నాలుగు గోడలు, అరటిచెట్లు ఆ ఎత్తైన వంతెనమీదకు బాగా కన్పిస్తున్నవి.

పొలాల్లో పంట అల్లుకుంచి మైళ్ళపర్యంతం పచ్చగా కనులపండువుగా నున్నది. పెద్దపెద్ద తాడిచెట్లు కాపలా వాళ్లలా కనుపిస్తున్నవి. చుట్టుపట్ల మనుష్యు లెవ్వరూలేరు. నిర్జన ప్రదేశం. ప్రశాంతంగా ఉన్నది. కాలువలో దూరంగా పడవల తెల్లని తెరచాపలు కన్పిస్తున్నవి.

"నీవెలా వచ్చావు?" అని నళిని ఆశ్చర్యంతో, ఆనం దాతిరేకంతో అడిగింది."

"దీనికిగూడా ఆశ్చర్యపడాలా? నీ వెలావచ్చావు?"

"రావడమైతే వచ్చాను. కాని మా పినతల్లి నన్ను వేయికనులతో కనిపెడుతుందనుకొంటాను. నీవు సౌంజ్ఞచేస్తే రాకుండా ఎలావుండగలను?"

"నేను నీకు సౌంజ్ఞచేశానా?"

"సరే! నీవు పిలువలేదు. నేనే వచ్చాను." అంటూ నళిని కనులుచిట్లించి తల అడ్డంగా వూపుతూ వెళ్ళిపోవడాని కుపక్రమించింది. ఆమె రెండడుగులు ముందుకువేసింది. సత్యా మేమీ మాట్లాడలేదు. సత్యం ఆమెవంక తీక్షణంగా చూచాడు. నళిని యింకొక అడుగువేసింది. సత్యం వెనుకకు రమ్మని చెయ్యివూపాడు. నళిని లక్ష్యపెట్టలేదు. ఆమె అడుగులు ముందుకువేస్తూనే ఉన్నది. 'నళినీ!' అని సత్యం బిగ్గరగా పిలిచాడు. నళిని చిరునవ్వు వెన్నెల లొలకబోస్తూ వెనుదిరిగి వచ్చింది.

"చేయివూపితే ఎందుకు రాలేదు?"

"నీవు యింకెవరినో పిలుస్తున్నావనుకొన్నాను."

ఇరువురూ కిలకిలా నవ్వుకొన్నారు. నళిని చెంబు వంతెనమీాదపెట్టి ఎగిరిసత్యంప్రక్కనే వంతెన పిట్టగోడమీాద కూర్చుంది.

"ఈ చెంబు యెందుకు తెచ్చావు?"

"లేకుంటే యిక్కడకు వచ్చేదెట్లా? పిన్నమ్మ నన్ను ఖైదు చేసింది. రాత్రింబవళ్లు స-రి-గ-మ- ప-ద-ని-స అంటూనో తకధిం, తకధిం అంటూనో గడపాలి. విశ్రాంతి గూడా తీసుకోనివ్వదు. నీవు రావడం చూచి బయటికని వంక బెట్టి చెంబు తీసుకొని వచ్చాను."

"నీకు నాట్యమంటే సరదాయేగా? మళ్లా ఎందుకలా అసహ్యించు కొంటావు?"

"నాట్యమంటే నాకు సరదాయే కాని యిలాయంత్రంలా నాట్యం చేయడం నా కిష్టంలేదు. ఘనాఘనాలు గర్జిస్తే పురి విప్పి స్వేచ్ఛగా నాట్యంచేసే మయూరాలలా నాట్యం చేయాలని నా కోరిక."

"ఒకొక్కప్పుడు యంత్రంలా నాట్యం చేస్తేనే బావుంటుంది."

"సరే, కాని నీ వెలా వచ్చావో చెప్పలేదు."

"తెల్లకాగితాలు కావాలని నాన్నగారితో చెప్పాను. కోడూరునుండి తెచ్చుకోమన్నారు."

నళిని చిరునవ్వు నవ్వి—"మా యింటివద్ద కాగితా లమ్మరే?" అన్నది.

"కాగితా లక్కడ దొరకవు. కాని మంచి బొమ్మ దొరుకుతుంది." అని సత్యం బిగ్గరగా నవ్వసాగాడు. నళిని సిగ్గుతో తలవంచుకొని వోరగా అతనివంక చూడసాగింది.

"నాన్నగారు దేవాలయానికి వెడతారు. ఇంట్లో కూర్చుని, కూర్చుని విసుగుపుడుతుంది. సాయంత్రానికి పిచ్చెత్తినట్లుండి యీ కాలువకట్టకు షికారు వస్తాను. కొత్త పట్నానికి నాలు గైదు మైళ్లదూరంలో యిది సముద్రములో కలుస్తుంది. చాలా సుందరమైన దృశ్యం. ఎప్పుడైనా వెడదామా?"

"నేనెప్పుడైనాతిరిగి కొత్తపట్నంవస్తే నాకు వాకిట్లో, పిల్లులు, కుక్కలు, కోతులు స్వాగతమిస్తాయి, మరి నీవేమో కాలువకట్టలవెంట షికారుకొడుతుంటావు అనిఅనుకొంటాను."

"అంటే?"

"అంటేనా! నీ వింతవరకు వాకిట్లో గోడమీద ఎన్ని కుక్కల, పిల్లుల, కోతుల బొమ్మలు గీశావో అని."

"అవును. నీవు పిల్లివయితే నీ బొమ్మ అక్కడ గీసి చూపిస్తాను."

"పో..." ఆమె కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత "నేనిక్కడ నాట్యం నేర్చుకోవడానికి వస్తే నీ వక్కడ చిత్రకళ అభ్యసిస్తావా? నాకు చిత్రాలంటే బలే యిష్టం."

"యిష్టం లేకపోవచ్చు చిత్రకారుడంటే...?"

"పో..." ఒకరి ముఖా లొకరు చూచుకొన్నారు. బహుశా వారి మనస్సులలో భావాలు బయట పెట్టాలని ప్రయత్నించేవారు. మాట నోటిలో దాకా వచ్చి వెనక్కు-పోయేది. ఇరువురూ మాట్లాడలేక మౌనంగా వున్నారు. సత్యం ముఖాన సిగ్గు దొంతరలు ద్యోతక మవుతున్నవి.

అతడు కొంత సేపు నళిని ముఖం వంక, కొంతసేపు నేలవంక చూస్తున్నాడు. నళిని స్థితిగూడా యిదే విధంగా వున్నది. కాసేపు చెంబు వంక, కాసేపు సత్యం వంక చూస్తూ కూర్చున్నది.

"నేను వెడతా ?"

"వెళ్లుదువు గాని, ఏమంత తొందర ?"

"పిన్నమ్మ మనిషిని పంపుతుంది. అనవసరనంగా గొడవ జరుగుతుంది. ఎందుకు వచ్చిన గొడవ."

"నీవు నాతో కలిసి తిరుగుతున్నావని మీ అమ్మకు తెలుసా ?"

"లేదు. ఆమె కదలడమే నానాటికి కష్టమవౌతున్నది; మరి మీ నాన్నకు తెలుసా ?"

"బహుశా తెలిసుండదు."

నళిని వెళ్లి పోవడానికి సిద్ధమైనది. ఇంతలో పద్మనాభం తండ్రి బాపినీడు నెత్తిన గోనె సంచి కప్పుకొని ఎదురుగా రావడం చూచి నళిని సత్యం ప్రక్కకు తప్పుకున్నది.

బాపినీడు వంతెన మీదకు వచ్చాడు. ఆయన సత్యాన్ని చూచి "ఏం శర్మా! ఇవ్వాళ యిక్కడేం చేస్తున్నావు ? ఇంటికి రావా ? అరె!...ఈ అమ్మాయి...!" అంటూ ఆశ్చర్యంతో యిరువురి వంక చూచాడు. గోనెసంచి పిట్టగోడ మీద పరిచి విశ్రాంతిగా కూర్చున్నాడు.

"ఓహో! స్కూలుకు సెలవలు కాబోలు. నీవు అప్పుడప్పుడు కోడూరు వస్తూ పోతూ వుంటావా ?"

"పని వుంటే వస్తాను...నీకేం"

"నాకేం లేదు. ఊరక అడిగాను...బహుశా ఒంటరి గానే వస్తావనుకొంటాను..." అంటూ నళిని వంక తీక్షణంగా చూచాడు.

ఎవరూ జవాబివ్వ లేదు. కొంతసేపైన తర్వాత బాపి నీడు బీడీ ముట్టించుకొని వెనుదిరిగి చూస్తూ వెళ్లిపోయాడు. నళిని కేమి చేయాలో తోచ లేదు. ఆమెకు తెలుసు. బాపినీడు ఒకటికి రెండు కలిపి చాడీలు చెపుతాడని — "అన్ని ఆడంగి చేష్టలు. ఆడంగి మాటలు."

ఇంతలో తెరచాప ఎత్తిన పడవ వొకటి వంతెన సమీపానికి వచ్చింది. తెరచాప దించుతున్నారు. సీతారాం పడవటాపుమీద కూర్చున్నాడు. పద్మనాభం సెలయేటి అలలను చూస్తూ జోరుగా పాటలు పాడుతున్నాడు. అతని కంఠంలో మాధుర్య మున్నది. నళిని పడవ వంకచూచి వంతెన పిట్టగోడ చాటున నక్కింది.

పడవమీద సీతారాం పద్మనాభానికి వ్రేలుపెట్టి సత్యాన్ని చూపిస్తూ లేచి నిలబడ్డాడు. పడవ వంతెన దాటి కొద్దిదూరము పోయిన తరువాత నళిని గోడచాటునుండి యీవలకు వచ్చింది. పద్మనాభం పడవమీద నిలబడి చేతితో తాళం వేస్తూ తన్మయత్వంలో పాటలు పాడుతున్నాడు. అతను సత్యాన్ని నళినిని చూచాడు.

నళిని చెంబు తీసుకొని వెళ్లిపోయింది. సత్య మామెను ఆపలేదు. అతను పిట్టగోడమీద కూర్చుని నళిని పంట పొలాల్లోగుండా పోవడం చూస్తున్నాడు.

* * *

అతను ఇంటికి చేరుకొనేసరికి బాగా చీకటి పడింది. తండ్రి అతనికొరకు నిరీక్షిస్తున్నాడు.

"కాగితాలు దొరికినవా? చీకటి పడకముందే రాలేక పోయావా? దారి బావుండలేదు."

"తమరు భోజనం చేశారా?"

"లేదు. స్నానం చెయ్యి. భోంచేద్దాం."

సత్యం సంతోషంతో గంతులు వేస్తూ లోపలకు వెళ్లి స్నానం చేయసాగాడు. స్నానంచేసి వేపచెట్టు వద్దకు పోయిచూస్తే తాను బొగ్గుతో రాతిమీద గీసిన నళిని బొమ్మ ఎవరో చెరిపి వేశారు. కొంతసేపు బాపినీడు చెరిపా డనుకొనేవాడు. కొంతసేపు పద్మనాభం పని అయివుంటుందను కొనేవాడు. ఈ ఆలోచనలతో అతని భోజనం ముగిసింది.

భోజనమైన తరువాత తండ్రి కొడుకు లిరువురూ వసారాలో కూర్చున్నారు. తండ్రి తాంబూలం సేవిస్తున్నాడు. సత్యం నళిని ఖాళీ గృహాన్ని చూస్తున్నాడు.

"అబ్బాయ్! నీవు పెద్దవాడవైనావు. బ్రాహ్మణ కులంలో పుట్టావు. నీచకులసంజాతులైన వారితో కలిసి తిరగడం శ్రేయస్కరం కాదు."

సత్యం పెదవులమీద వ్రేళ్లు పెట్టి తండ్రివంక చూడ సాగాడు. జవాబే మివ్వగలడు? అతను మెదలకుండా లోలోపల బాపినీడును తిట్టసాగాడు.

"సరే. వెళ్లిపడుకో. ప్రొద్దుపోయింది."

## ౭

ప్రొద్దున్నే సత్యం దేవాలయం వైపు వెడుతున్నాడు. అది తండ్రి ఆజ్ఞ. సత్యం పద్మనాభం యింటి దగ్గరగా వచ్చే సరికి పద్మనాభం యింట్లోనుండి బయటకువచ్చి చప్పట్లు కొడుతూ "పిల్లి మక్కా యాత్రకు పోయిందీ!" అంటూ బిగ్గరగా గేలిసేయసాగాడు. ఇంతలో పద్మనాభం జట్టు పిల్ల లంతా ప్రోగయ్యారు. సత్యం వెనకచేరి గోల చేయసాగారు. సత్యం తలవంచుకొని తన దారిన తాను పోతున్నాడు. ఇది సత్యానికి క్రొత్త అనుభవం.

పద్మనాభమంటే తనకు సరిపడదు. కాని కొత్తపట్నంలో నున్న పిల్లలంతా తనంటే ఎందుకిలా ఆటలు పట్టిస్తున్నారు. అందరితో కలిసిమెలిసి తిరిగే స్వభావంగూడా సత్యానికిలేదు. ఒంటరితనమే అతని కెక్కువ యిష్టం. అత నెప్పుడూ ఎవరికీ ఎలాటి కష్టమూ కలిగించలేదు. అయితే వీళ్ళంతా ఎందుకిలా గొఱ్ఱెల్లా అరుస్తూ తనవెంట పడుతున్నారో అర్థం కావడం లేదు. పద్మనాభానికి మంచి జట్టున్నది. అతను మాటంటే చాలు వీళ్ళంతా తోటలూ, దొడ్లూ పీకిపెడతారు. ఉత్సవ సమయాల్లో దొంగతనాలు చేస్తారు. మోసంచేస్తారు. దొంగ తనంగా చెరువుల్లో చేపలు పడతారు. కాని ఎవరూ వీరి జోలికిపోరు. ఎవరితో చెప్పినా పట్టించుకోరు. ఇది సత్యాని కొక పెద్ద సమస్యగా తయారైనది.

అతను తల వంచుకొని ముందుకు సాగిపోతూనే ఉన్నాడు. పద్మనాభంజట్టువాళ్లు గోలచేస్తూ వెంట వస్తూనే ఉన్నారు. స్త్రీలు యిండ్లలోనుండి బయటకు వచ్చి యీ

దృశ్యాన్నిచూచి నవ్వుకొని లోపలకు పోతున్నారు. ఎవరైనా పెద్దమనుష్యులు వచ్చినప్పుడు జట్టువాళ్లు భక్తిభావంతో దేవాలయంలోకి పోతున్నట్లు గోల ఆపేవారు.

దేవాలయం సమీపిస్తున్నది. ఈ ఆకతాయిమూక తనతోపాటు దేవాలయంలోనికి రావడం సత్యానికి యిష్టం లేదు. పైగా తండ్రితో లేనిపోని చాడీలు చెప్పవచ్చు. అందుచేత అతడు దేవాలయం ముందున్న మెట్లమీద కూర్చున్నాడు. వెంటవచ్చిన పిల్లలుగూడా అక్కడే కూర్చున్నారు.

"రా దేవాలయంలోకి. చాలా పాపంచేశావు" అన్నాడు సీతారాం.

"బ్రాహ్మడురా, బ్రాహ్మడు. ఇంట్లో ఎవరికీ గుక్కెడు మంచినీళ్లివ్వడు. కలిసి తిరిగేదెవరితోనో తెలుసా!" అన్నాడు పద్మనాభం.

"అరే, బ్రాహ్మడు బ్రాహ్మడేరా! ఎలాగైనా బ్రాహ్మణగౌరవాన్ని నిలబెడుతున్నాడు" అన్నాడు సుబ్బారావు. సుబ్బారావు పద్మనాభం పెదతండ్రి కొడుకు. చదువు చాలించి చాలారోజులైనది. పనీపాటా లేకుండా బడుద్ధాయిలా తిరుగుతాడు. ఎప్పుడూ పద్మనాభం వెంట ఊరికే తిరుగుతాడు.

"నీవుగూడా అలా అంటావేం అన్నయ్యా? ఎవరైనా అందచందాలతో బ్రాహ్మలవుతారా?" అన్నాడు పద్మనాభం.

"అరే! ఒట్టి బ్రాహ్మడేకాదురా. పూజారి ముద్దుల కొడుకుగూడా" అన్నాడు సూర్యనారాయణ. సూర్యనారా

యణ సత్యం సహాపాఠి. ఒకప్పుడు యిరువురూ మంచి స్నేహితులు గూడా. చదువులో మంచి చురుకైనవాడు. అవకాశం దొరికినప్పుడు, ఏమీ తోచనప్పుడు యీ ముఠాలో జేరుతుంటాడు. సత్యం ఒక్కసారి అతనివంక జాలిగా చూచాడు. అతని కన్నులలో నీరుతిరిగింది. కోపంతో అతనిశరీరం కంపించిపోతున్నది.

"అరే, వీడిని విడిచిపెట్టవద్దు" అన్నాడు సుబ్బారావు.

"అరే, వీడు వంతెన చాటున దాక్కొని దానితో మాట్లాడుతున్నాడు. మనం కనిపెట్టలేమనుకొన్నాడురా." అన్నాడు పద్మనాభం.

"ఎవరితోరా మాట్లాడేది ?" అన్నాడు సుబ్బారావు.

"ఇంకెవరితోరా! ఎవరితో మాట్లాడితే ఎవరూరుకొంటారు. ఆ నళినిలేదూ, నళిని..."

సత్యం కనులనుండి రెండశ్రుబిందువులు రాలినవి. ఇక సహించలేకపోయాడు. అతను పండ్లుకొరుకుతూ పద్మనాభంమీదకు దూకాడు. అతను దూకటమే తరువాయి పద్మనాభం పిడికిలి బిగించి అతనిమీద గ్రుద్దుల వర్షం కురిపించసాగాడు. యుద్ధం ఆరంభమైనది. సర్దుదామని సుబ్బారావు యిరువురి మధ్యకూ వచ్చాడు. గోల విని సత్యం తండ్రి దేవాలయంలో నుండి బయటకు వచ్చాడు. సత్యాన్ని చూచి ఆయన వెంటనే మెట్లు దిగి వారి వద్దకు వచ్చాడు. ఆయన్ని చూచి పద్మనాభం ముఠా పారిపోయారు.

"పద్మనాభం ముఠా నిన్నెందుకు కొడుతున్నారు ?" అని తండ్రి ఎన్ని పర్యాయా లడిగినా సత్యం జవాబు చెప్ప

లేదు. తండ్రి గుడ్లురిమాడు. అప్పటికీ చెప్పలేదు. మండప స్తంభానికి చెక్కిన ప్రతిమలా ఆనుకొని కూర్చున్నాడు. ఇక నళినితో మాట్లాడకుండ వుండామా! అనే ఆలోచన అతని మెదడులో పనిచేయసాగింది. ఆమె మూలంగానే తన కిన్ని పాట్లు వచ్చినవి. చెడ్డపేరు వచ్చింది. లోకులు వెలివేశారు. ఈ ఆలోచన లతని మనస్సును కలవరపెట్టసాగినవి.

కొంతసేపైన తరువాత అతను దేవాలయం వెనుక వైపుకు వెళ్లి సముద్రంవంక చూస్తూ కూర్చున్నాడు. సూర్యాస్తమయమైనది. వెన్నెల కాంతులు సముద్రపు టలలపై వెండిలా మెరుస్తున్నాయి. అతను వంటరిగా అలా చూస్తూ చాలసేపు కూర్చున్నాడు. ఒకటి రెండుసారులు ఇాతి మీద బొమ్మలు గీయ ప్రయత్నించాడు. కాని గీయలేక పోయాడు. ఊయి శుభ్రంచేసి అతను అటూ ఇటూ చూసేవాడు.

అతని ఆలోచనలు ఆవలిప్రక్కకు పోర్లినవి. "నన్ను ఎగతాళిచేసి ఏడిపించడానికి వీళ్ల కేమి హక్కున్నది? వీళ్లు ఎగతాళి చేయదలచుకొంటే నన్ను చేయాలి. ఇందులో నళిని దోషమేమిటి? ఆమె వేశ్యాకులంలో పుట్టింది. అయినా ఆమె దోషమేమిటి? వేశ్యాకులంలో పుట్టడం దోషమా? నేను బ్రాహ్మణ వంశంలోనే పుట్టాను. నేనామెతో స్నేహం చేయడం, మాట్లాడడం తప్పా? నళినితో మాట్లాడకపోతే యీ వెధవలతో మాట్లాడాలా? ఆమె నేనంటే ప్రాణా లర్పిస్తుంది."

అత నక్కడనుండి లేచి దేవాలయంలోకి వెళ్లాడు. అతని తండ్రి యింటికివెళ్లే ప్రయత్నంలో నున్నాడు. సత్యాన్ని

చూచి ఆయ నేమీ మాట్లాడలేదు. ఆయ నేదో ఆలోచ నలో మునిగినట్లు కనిపిస్తున్నాడు.

తొందరగా భోజనం ముగించుకొని సత్యం తండ్రి ఆదినారాయణను కలుసుకోడానికి వెళ్లాడు. సత్యం యింట్లోనే పండుకొని ఉన్నాడు. గోడవంక చూచి చిరునవ్వు నవ్వు తున్నాడు. పండ్లు కొరుకుతున్నాడు. "చూచారా వీళ్లెలా ఎగతాళి చేస్తున్నారో? నే నసలు వినిపించుకోను. అస లెవ రీ వెధవలు." అనే ఆలోచనలతో సత్యానికి ఎప్పటికో నిద్ర పట్టింది.

ఉదయం నాలుగు గంటలకే నిద్రలేచి సంచి భుజాన వేసుకొని బయటకు వెళ్లాడు. వాకిట్లో కాలు పెట్టగానే అతని తండ్రి వచ్చాడు.

"ఎక్కడకురా వెడుతున్నావు?"

"కోడూరు."

"ఎందుకు?"

"కూరగాయలు తేవడానికి."

"అక్కర లేదులే. ఇంట్లోకి పద." అంటూ సత్యం తండ్రి లోపలకు వెళ్లాడు. సత్యం గూడా లోపలకు వెళ్లాడు. సత్యం నిరాశ చెందాడు. మారాంచేసి తండ్రిని కష్టపెట్టడ మతనికి యిష్టం లేదు. ఆయన ఆజ్ఞ లేకుండా అతను కోడూరు వెళ్ల లేదు.

కొంతసేపైన తరువాత పద్మనాభం తండ్రి వచ్చి అనంతకృష్ణశర్మవద్ద తన దుఃఖగాథను వినిపింపసాగాడు. సత్యం తలుపు చాటున నక్కి చెవులు నిక్కించి వారి మాటలు వింటున్నాడు.

"తమరు నామీాద దయవుంచి కాస్త నా యిల్లూ వాకిలి నిలపమని ఆదినారాయణతో చెప్పండి. ఈ సాయం మీారు చేసి పెట్టాలి!" అంటూ పద్మనాభం తండ్రి వంక దణ్ణాలు పెడుతున్నాడు.

"అయితే నీవు మీా పద్మనాభాన్ని అదుపులో ఎందుకు పెట్టవు?"

"ఏమి చేయమంటారు శర్మగారూ! తల్లి లేని వాడు, పెద్దవాడైనాడు. పూర్తిగా చెడిపోయాడు..." అతని కంఠం రుద్ధమైనది—

"ఇక చూడండి. ఈ రోజునుండి ఏమైనా చేస్తే అప్పు డడగండి. ఇంట్లో కట్టిపడవేస్తా."

"సరే మంచిది. ఆదినారాయణకు నేను సర్ది చెపుతా."

ఆదినారాయణ కొత్తపట్నంలో పెద్ద రైతు. నూరు నూటయాభై ఎకరాల భూమి ఉన్నది. పేరుప్రతిష్టలున్న వాడు. గ్రామానికి ముఖ్యుడు. అతని దగ్గరే పద్మనాభం తండ్రి పాలంపని చేస్తున్నాడు. ఆదినారాయణ, అనంతకృష్ణశర్మలు ప్రాణస్నేహితులు. కలిసి చదువుకొన్నారు. పూర్వంనుండి యీ రెండు కుటుంబాలమధ్య మైత్రి వృద్ధిచెందుతూవస్తున్నది.

అనంతకృష్ణశర్మ పద్మనాభం మూరా తన కొడుకును కొట్టారని ఆదినారాయణతో చెప్పాడు. ఆదినారాయణ పద్మ నాభం తండ్రిని పిలిపించి చీవాట్లు పెట్టాడు. వాడిని సరియైన దారిలో పెట్టకపోతే యిద్దరినీ ఊరినుండి బయటకు గెంటించుతా నన్నాడు. దొర తలచుకొంటే దెబ్బలకు కొదువా? పద్మ నాభం తండ్రి యిరకాటంలో పడ్డాడు.

సత్యం వరండాలో పక్క సర్దుతూ అలా చూచేసరికి రోడ్డుమీద సీతారాం, అతని స్నేహితులు మాట్లాడుకుంటూ పోతున్నారు. "అరె, పద్మనాభానికి బాగా మరమ్మతు జరుగుతుంది. అతని తండ్రి అతణ్ణి బాగా దంచుతున్నాడు."

సత్యం క్షణకాలం నిశ్చేష్టుడైనాడు.

౮

"చూడు. ఇటూ - అటూ తిరుగకు" అని రోజూ అనంతకృష్ణశర్మ దేవాలయానికి వెడుతూ సత్యాన్ని హెచ్చరించేవాడు. ఇంకా తూరుపు రేఖలు తెల్లవారలేదు. అనంతకృష్ణశర్మ రోజుకంటే యివాళ పెందలకడ లేచాడు. బహుశా రాత్రి సరిగా నిద్రపట్టివుండదు.

ఆయన దిగులుగా వుంటున్నాడు. రోజూ ఎరిగినవారెవరో ఒకరు సత్యాన్ని గురించి ఫిర్యాదులు చేస్తూనే వున్నారు. ఒకనాడు ఆదినారాయణగూడా అడిగాడు "సత్యానికి కళ్లెంవేసి అదుపులో పెట్టలేవా?" అని. ఇందుకు జవాబు చెప్పలేకపోయాడు అనంతకృష్ణశర్మ. రాత్రింబవళ్లు ఒకటే దిగులు. సత్యాన్నిగూడా ఏమీ అనలేకపోతున్నాడు. ఒక్కగా నొక్క కొడుకు. తల్లిగూడా లేదు. పెరుగుతున్న వయస్సు. ఏమన్నా అంటే ఇల్లు విడిచి పారిపోతాడేమోనని భయం. లేక 'ఒక బ్రాహ్మణ బాలుడు బ్రాహ్మణ బాలికతోనే మాట్లాడాలా? ఇతర పిల్లలతో మాట్లాడగూడదా?' అని అంటే తనేమి జవాబు చెప్పగలడు.

సత్యం జీవితంలోని ఒక విచిత్రావస్థలో ప్రవేశించాడు. అతని బుద్ధి తీక్షణమైనది. ప్రతి పనిలోను శ్రద్ధ తగ్గి విద్రోహ భావన ఎక్కువగుచున్నది. ఇదంతా వయస్సుతోపాటు పెరిగే మనోవైజ్ఞానిక పరివర్తన. ఈ విషయం అనంతకృష్ణ శర్మకుగూడా తెలుసు. బహుశా ఆయనకుగూడా యిది అనుభవమే. పది పదహారేండ్ల వయస్సులో బుద్ధి అపరి పక్వంగా నున్నప్పుడాయన గూడా యిలానే తిరిగేవాడు. భార్య చనిపోగానే ఒక్కసారిగా ఆయనకు వైరాగ్య మబ్బింది.

కాని ప్రాణ ముండగా సత్యాన్ని తప్పుదారి నెలా పోనిస్తాడు. ఆయన సత్యాన్ని కొట్ట లేదు. తిట్ట లేదు. బేవార్సుగా తిరగవద్దని శాసించాడు. తానే స్వయంగా సత్యానికి పుస్తకాలూ, పెన్సిళ్లూ, అవీ తెచ్చేవాడు. సత్యం చదువు ధ్యాసలో పడితే నళినిని మరచిపోతాడని ఆయన ఆశ.

సత్యం చాలరోజుల వరకు నళినిని కలుసుకోలేదు. అతనిని కోడూరు గూడా వెళ్లనివ్వడం లేదు. అత నెన్నో ఉపాయా లాలోచించాడు. కాని తండ్రి కన్నుగప్పి పోవడ మతనికి కష్టసాధ్యమై పోయింది.

ప్రేమలతను విచ్ఛేదం చేయాలని ప్రయత్నిస్తే అది యింకా ధృఢంగా అల్లుకొంటుందంటారు. స్నేహం కొరకు ప్రాణా లర్పింప వలసివస్తే స్నేహం గూడా సోదరత్వమే అవుతుంది.

నళిని గూడా సత్యాన్ని చాలరోజుల నుండి చూడ లేదు. వ్యాకులంగా నున్నది. "ఏదో కఠిన నిర్బంధం పెట్టి వుంటారు. లేకుంటే వచ్చేవాడే" అనుకొన్నది. చివర కామె

కొక ఉపాయం తోచింది. అనంతకృష్ణశర్మతో 'సత్యాన్ని డ్రాయింగు మాష్టారు పిలుస్తున్నారని చెప్పు' మని తన పినతల్లి దాసీని పంపుదా మనుకొన్నది. ఇది నిజం. సత్యాన్ని అప్పు డప్పుడూ వాళ్ళ డ్రాయింగుమాష్టరు పిలుస్తుంటాడు. అనంత కృష్ణశర్మ యీమాట వెంటనే నమ్మతాడు. బహుశా నమ్మ డేమో? ఇందుకోసమే నీవు యిల్లు కదలి ఎక్కడకూ పోవద్దని శాసించాడేమో?' ఏమైతేనేం నళిని నౌకరుని పంపింది.

నౌకరు సత్యాన్ని వంతెన వద్దనే కలుసుకొన్నాడు. విషయమంతా సత్యానికి చెప్పాడు. "నేను ముందు డ్రాయింగు మాష్టారుని కలుసుకొని తరువాత నళినిని కలుసుకొంటా" నని చెప్పాడు. అతని భయమేమిటంటే అనంతకృష్ణశర్మ "ఏమండీ మాష్టరుగారూ! మావాడు మీవద్దకు వచ్చాడా?" అంటే, 'రాలేదని' ఆయన చెపితే తంటా వస్తుందేమోనని.

అతను నళిని యింటి దగ్గరకు రాగానే నళిని రెండవ అంతస్తులో నిలబడి అతనిరాక కెదురు చూస్తున్నది. పెద్ద భవంతి. సత్యం తిన్నగా సింహద్వారం వద్దకుపోయి ఏమను కొన్నాడో ఏమో ప్రక్కనేవున్న కిళ్ళీకొట్లో కూర్చున్నాడు.

నళిని పిట్టగోడ నానుకొని అతని వంకే చూస్తున్నది. ఒకరి నొకరు సౌంజ్ఞలు చేసుకొన్నారు. చిరునవ్వులు నవ్వు కొన్నారు. వారి కన్నులు ఏదో మూగ భాషలో మాట్లాడు కొన్నవి. నళిని క్రిందకు దిగివద్దామనుకొన్నది. కాని బాపినీడు అటు రావడం చూచి ఆగిపోయింది. సత్యంగూడా ముఖ మటు త్రిప్పుకొన్నాడు. బాపినీడు చేతిలో సంచివున్నది. అత నా యింటిలోకే పోయి ఒక నిముషంలో తిరిగి వచ్చి

రోద్దునపడి వెళ్లిపోయాడు. నళిని ఆనందంతో "అమ్మయ్య" అంటూ నిట్టూర్పు విడిచింది.

అతను వెళ్ళిపోగానే నళిని మేడమీదనుండి దిగి సత్యం వద్దకు వచ్చి "ఇన్ని రోజులేమి చేస్తున్నావు? పూజలు చేస్తున్నావా?" అన్నది.

"ఎవరి పూజ?" సత్యం కనులు విప్పారినవి. నళిని కనులు సిగ్గుతో అరమోడ్పులైనవి.

కొంతసేపైన తర్వాత "మరిరావడంలేదేం?" అన్నది.

"నాన్నగారు నా చుట్టూ పహరా పెట్టారు".

"నాకు తెలుసు" అంటూ ఆమె కొంత సేపాగి "తండ్రిచేత తన్నులు పడలేక పద్మనాభం యింట్లోనుండి పారిపోయాడట! నీకు తెలిసిందా?"

"ఎందుకు తన్నడు? వాడు రంగనాయకుని పండిన శనగచేనుకు నిప్పుపెట్టాడు. అసలే రంగనాయకునికి బాపి నీడుకి పడదు. ఊరివారు పద్మనాభాన్ని పట్టుకొని శిక్షించారు. బాపినీడు కాళ్లా వేళ్లా పడ్డా వినకుండా ఆదినారాయణ అతణ్ణి ఊరిలో నుండి వెళ్లగొట్టాడు. మళ్లా యిక్కడి కెందుకు వచ్చాడబ్బా?"

"జమీందారుగారి నౌకరు. కోళ్లను పెంచుతున్నాడు. గుడ్లూ గిడ్లూ పట్టుకొస్తుంటాడు."

కిళ్ళీకొట్టువాడు గూడా వాళ్ల వంక చూడసాగాడు. వారు ఒక ప్రక్కకు తప్పుకొన్నారు. ఇంతలో ఒక నౌకరు వచ్చి నళినిని లోపలకు రమ్మని పిలిచాడు. "ఇంటికి వెళ్లే టప్పుడు యిటు వచ్చిపో" అన్నది నళిని. సరేనంటూ తలఊపి నిషాలో ఉన్నవాడిలా అడుగులు వేస్తూ ముందుకు సాగాడు.

కాసేపు అటూ ఇటూ తిరిగి మళ్లీ కిళ్లీకొట్టు వద్దకు వచ్చి కూర్చున్నాడు. కాని నళిని యిందాక నిలబడినచోట లేదు. ఆమె కేమి తెలుసు యితగాడు పది పదిహేను నిముషాలలోనే తిరిగివస్తాడని.

సత్యం అక్కడనుండి వెళ్ళి తమ స్కూలువద్ద పచారు చేయసాగాడు. అతని కేమీ ఉపాయం తోచడంలేదు. అతని తోడి విద్యార్థులు చాలమంది కోడూరులో ఉన్నారు. కాని అతను ఎవరి వద్దకు వెళ్ల లేదు. తిరిగి తిరిగి ఒక హోటల్లోకి దూరాడు.

సాయంకాలానికి మరల కిళ్లీకొట్టువద్దకు చేరాడు. నళిని పినతల్లి యింటిముందు గుఱ్ఱపుబండి వున్నది. ద్వారానికి యిరువైపులా యిద్దరు జవాన్లు పహరా యిస్తున్నారు. సత్యం వెళ్లిపోదా మనుకొన్నాడు. కాని కుతూహలంతో ఏమి జరుగుతుందో చూద్దామని అక్కడే నిలబడిపోయాడు.

నళిని మెట్లప్రక్కనే నిలచి సత్యాన్ని చూచింది. ఆగమని చేయి ఊపింది. కొంచెం సేపట్లో నళిని పినతల్లి చక్కగా అలంకరించుకొని బయలు దేరింది. వెంట నళిని గూడా వున్నది. నళిని పినతల్లి బండిలో ఎక్కి ఎక్కడకో వెళ్లింది. దాస దాసీలు లోపలకు వెళ్లారు.

నళిని, సత్యం బయట నిలబడి ఉన్నారు. నళిని లంగా నుండి రెండు పెన్సిళ్లుతీసి సత్యాని కిచ్చింది. అతడు తలవంచుకొని ఉన్నాడు. బహుశ అతడు పెన్సిళ్లు తీసికొందామా, వద్దా, అని ఆలోచిస్తూ వుండవచ్చు. వెంటనే అతడు యేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

౯

పెద్దలకు గాని, పిన్నలకు గాని, చిన్నది కాని, పెద్దది కాని సమస్య సమస్యే. నళిని ముందీ సమస్య వున్నది. ఆమె కొన్ని దినాలనుండి విచారంగా నున్నది.

నళిని కోడూరులో ఉండి నాట్యం నేర్చుకోవాలని ఆమె తల్లి కోరిక. ఆమె కోరిక ఎవరివద్దా దాచేది కాదు. "చదువుకొని ఏం చేస్తుంది? తన పని తాను సంబాళించుకో లేదు. నౌకరీ అంతకంటే చేయలేదు." ఒకవేళ నళిని ఏమైనా అంటే ఆమె కోపం తెచ్చుకొని "పో. పిచ్చిదానా! నాట్యమూ, సంగీతము గూడా విద్యేనే. కళేనే. పుస్తకాలు వల్లె వేయడమే కళను కొన్నావా? ఈ కళ మన తరతరాల నుండి అభ్యసిస్తున్నాము." అని అనేది.

నళిని మారు పలుకదు. ఆమెకు కొత్తపట్నం విడిచి పెట్టాలని లేదు. చదువుకు గూడా స్వస్తి చెప్పాలని లేదు. ఆమె సత్యంతో ఆనందంగా చేలగట్లమీద గడిపిన ఆ క్షణాలే ఆమె జీవితములో మధురక్షణాలుగా కన్పిస్తున్నవి. ఆ జీవితమే ఆనందమయ జీవితము. అతనితో కలిసి స్కూలుకు వెళ్లడం తిరిగి రావడము బహుశా ఆమె జీవితములో ముఖ్యాంశమై పోయినది. ఈ ఆనందాన్నుండి వంచితురాలు కావడ మామెకు యిష్టం లేదు.

ఆమె తన గదిలో కూర్చుని ఉన్నది. ప్రక్క గదిలో తన తల్లి, పినతల్లి మాట్లాడు కొంటున్నారు.

"జమీందారుగారు నళినికి బాగా నాట్యం నేర్పించాలను కొంటున్నారు. నళిని నాట్యం ఆయనగారి కింతగా మెందుకు నచ్చిందో తెలియదు!" పినతల్లి చెప్తుతూ చెప్తుతూ ఆగి అక్క వంక తేరి పారచూచి "అంత చక్కగా అది నాట్యం చేస్తే ఎవరికైనా ఎందుకు నచ్చదు" అన్నది.

"అవును. నేను గూడా అదే అనుకొంటున్నాను, నళిని కిక్కడే బాగానాట్యంనేర్పించాలని. తాత తండ్రులనాటిమాట వదిలేయి. కొత్తపట్నమిప్పుడు బాగా చెడిపోయింది. ఆ రోజుల్లో నాట్యమూ, సంగీతము నేర్చుకోవాలంటే కొత్తపట్నం మెచ్చేవాళ్లు. ఇప్పుడు పరిస్థితులు మారిపోయినవి. ఇప్పుడు కొత్తపట్నంలో నేర్పేవాళ్లూ లేరు. నేర్చుకొనేవాళ్లూ లేరు. మనవాళ్ళు గూడా వివాహాలు చేసుకొని కాపురాలు చేస్తున్నారు. అబ్బో! కాలం ఎంతలో మారిపోయిందే?" అన్నది కాంచన.

"కాని... కాని...?" అంటూ పినతల్లి వాకిట్లోకి పోయింది. ఆమె ఏదో చెప్పాలనుకొంటున్నది. కాని ఎలా చెప్పాలో తెలియక 'కాని...కాని' అని గుటకలు మ్రింగుతున్నది. ఇది విని నళిని మరొక విధంగా అర్థం చేసుకున్నది. "బహుశా పిన్నమ్మకు నేను చదువు మానుకోవడం యిష్టం లేదేమో?" ఆమె తల్లికి కనిపించకుండా వేరే వాకిలిగుండా బయటకు వచ్చింది. ఆమె పిన్నమ్మ అన్యమనస్కంగా నిలబడి వున్నది. నళిని పిన్నమ్మ భుజంమీద చెయివేసి "పిన్నీ! ఇవాళ కొత్తపట్నం దేవాలయంలో భజన చేస్తారు. అక్కడకు వెళ్లి గూడా చాలా రోజులైనది" అన్నది.

"నీవు చదువుకోవాలనుకోవడంలేదూ?"

"అవును పిన్నీ! నీవు నా చదువు మాన్పించవద్దని అమ్మతో చెప్పవూ? చెప్పతావా పిన్నీ! నాకు బడి మానుకోవాలని లేదు పిన్నీ..."

"అయితే నీకు నాట్యంసంగీతం నేర్చుకోవాలని లేదూ?"

"అందుకోసమని చదువు మానుకోవలసిన అవసరం లేదు."

"నీవు కొత్తపట్నం మెలా వెళ్లగలవు?"

"రాముణ్ణి వెంటతీసుకుపోతాను."

"వెళ్ళు."

నళిని ఆనందంతో గంతులేస్తూ తన గదిలోకి వెళ్లింది. క్షణంలో బట్టలు మార్చుకొన్నది. ఆమె లేత మనస్సు పినతల్లి మోసాన్ని గ్రహించలేక పోయింది.

ఆమె పినతల్లి యవ్వనం జారిపోయింది. ముసలి ఛాయలు తొంగి చూస్తున్నాయి. ఆమె చిన్నప్పుడు చాలా దీపా లార్పింది. ఆఖరికి జమీందారుగారి దృష్టిలో పడింది. రెండు మూడు సంవత్సరాలనుండి జమీందారుగారి పోషణలోనే ఉంటున్నది. చాలా డబ్బు సంపాదించింది. కాని యింకా సంపాదించ వలెననే దురాశ మాత్రం ఆమెను విడిచి పెట్టలేదు. సారాయి నిషా అన్నా తగ్గుతుంది కాని యీ నిషా తగ్గదు. ఆమె అటూ ఇటూ గూడా సంపాదిస్తున్నది. ఆమెకు దేనికీ లోటులేదు.

కాని యిప్పుడు జమీందారుగారి దృష్టి నళినిమీద వున్నది. రెండు మూడు సంవత్సరాలలో నళిని బహుశా పెద్దదవుతుంది. అప్పుడు జమీందారామెను కోరవచ్చు.

ఈ భయ మామె మనస్సును పీడిస్తున్నది. వేశ్యా కులమంటే అందరికీ లోకువే. వేటగాడు వేటకుపోయి తాను వేటాడు తున్న మృగం చిన్నదా లేక పెద్దదా అని ఆలోచిస్తాడా? కామవాసనలకు వివేచనాశక్తి వుండదు.

బహుశా ఈ ఉద్దేశంతోనే నళిని, ఆమె తల్లి కాంచన కోడూరులోవుండకుండావుంటే బాగుండుననుకొంటుందిజమున. నళినిని చేరదీసి జమీందారుగారు తనని కన్నెత్తి చూడ రేమోనని భయ మామె కున్నది. బహుశ జమీందారు గారు నళినికి నాట్యం నేర్పించే ఏర్పాటుచేయక పోతే తాను నళినిని కోడూరులో తనయింటికి రప్పించేదికాదు. ఈ సమస్య ఆమె ముందున్నది.

జమున లోపలకు వెళ్లి తన అక్కవద్ద కూర్చున్నది. ఇంతలో నళిని గూడా బట్టలు మార్చుకొని అక్కడకు వచ్చింది. "ఎక్కడికే ప్రయాణ మైనావు?" అని తల్లి అడిగింది.

"కొత్తపట్నం పోతున్నది. ఈ రోజు శుక్రవారంకదూ? దేవాలయంలో భజన, పూజ చేస్తారట. అక్కడకుపోయి చాలారోజులు కూడా అయినది." అని జమున జవాబిచ్చింది.

"కాని...కాని..." అని కాంచన గుటకలు మ్రింగింది.

"నేనే వెళ్లమన్నాను. రాముడు వెంట వెడతాడు."

బయట గుఱ్ఱపుబండి నిలబడి వున్నది. నళిని ఎక్కగానే బండివాడు గుఱ్ఱాన్ని అదలించాడు. నళిని తల్లి కేమీ చెప్ప లేదు. పినతల్లి తల్లితో యిలా అనడం నళినికి వినిపించింది. "దానికి చదువుకోవాలని లేదు."

"అవును. చదువుకొంటే ఏమి వస్తుందే. కాలమంతా వృథా." అన్నది కాంచన.

"నాట్యం నేర్చుకోకపోతేమరి ఏమి నేర్చుకొంటుందో! బలవంతం చేస్తే లాభ మేమిటే?"

"బలవంత మేమిటే? జమీందారుగారు గూడా దానికి నాట్యం నేర్పించ మంటుంటే!"

జమున క్షణకాలం మాట్లాడలేదు. ఏదో కుట్ర, మోసం జరుగుతున్నట్లు అక్క వంక చూడసాగింది.

"సెలవల్లో నాట్యం నేర్చుకొంటుంది. స్కూలు ఉన్నప్పుడు స్కూలుకుపోయి చదువుకొంటుంది. ఈ విధంగా రెండూ నేర్చుకోవచ్చు" అన్నది జమున.

"నీ అభిప్రాయంగూడా యిదేనా?"

"అవును."

కాంచన మాట్లాడలేదు. ఆమెకు ఎప్పుడు మాట్లాడాలో ఎప్పుడు మాట్లాడగూడదో బాగా తెలుసు. ఆమెకు ఊరికే వాగడ మలవాటు. అయినా మౌనంగా మనసు బిగబట్టి మాట్లాడకుండా కూర్చొనటంకూడా నేర్చుకొన్నది.

*     *     *     *

దేవాలయంలో పూజ జరుగుతున్నది. అనంతకృష్ణశర్మ పూజ చేస్తున్నాడు. అయిదారుగురు స్త్రీలు కూర్చుని ఉన్నారు. ఎవరో పరాయి ఊరి మనిషిగూడా ఒక డున్నాడు. కళ్యాణమంటపం ఖాళీగా ఉన్నది.

నళిని క్రింది మెట్లమీద నున్నది. రాముడు దేవాలయంలోకి పోయి సత్యాన్ని క్రిందకు పిలుచుకొని వచ్చాడు. అతని తండ్రి పూజపఠనంలో మునిగి ఉన్నాడు.

"నళినీ! ఏమిటి సంగతి? ఏం జరిగిందేమిటి?" అని సత్యం హడావుడిగా ప్రశ్నించాడు, నళిని మాట్లాడడానికే అవకాశ మివ్వకుండా.

"నేను నాట్యం నేర్చుకోను" అన్నది నళిని ఉపోద్ఘాతం లేకుండా.

'నాట్య మొక కళ. నీవు దానిని విడిచిపెట్టగూడదు."

'అమ్మ బడికిపోవద్దని పట్టుపడుతున్నది."

"చదువు మానుకోగూడదు. మరి ఉపాయమేమైనా ఆలోచించావా? భయపడబోకు. సరే నేను వెడతాను. లేకుంటే నాన్నగారు వెదుకుతూ యిటు రాగలరు. తరువాత కలుద్దాం?" అంటూ అతను దేవాలయంలోకి వెళ్ళిపోయాడు.

రాముడు పోరు పెడితే కొంతసేపైన తరువాత ఆమె గూడా రామునితో కలిసి దేవాలయంలోనికి వెళ్ళింది. అనంతకృష్ణశర్మ పూజ ముగించి పురుష సూక్తం చదువుతూ కనువిప్పి ఒక మారు నళిని వంక ఒకమారు సత్యం వంక చూచాడు. వారు శిరస్సులు వంచుకొని ఉండడంచూచి యింకా ఉత్సాహంగా మంత్రం చదువసాగాడు. సత్యం తల మెత్తి ఒక్క పర్యాయంగూడా నళినివంక చూడలేదు.

పూజయిపోయినది. అందరూ వెళ్ళిపోయారు. నళిని రాముడుగూడా వెళ్లిపోయారు. అనంతకృష్ణశర్మ యిన్ని రోజులకు సత్యాన్ని చూచి చిరునవ్వు నవ్వుకొన్నాడు. ఆయన దృష్టిలో తన కుమారుడు, 'పితృవాక్య పరిపాలకుడు' అనే బిరుదుకు తగినవాడులా గోచరించాడు.

## ౧౦

కొత్తపట్నంలో ఆకతాయిమూక పద్మనాభం లేని కారణంగా కొంత బాగుపడినట్లు కన్పిస్తున్నది. సీతారామిప్పుడు వాళ్ల నాయకుడు. అతడు పద్మనాభం సహవాసంతో చెడిపోయాడు. గొప్ప కుటుంబములో పుట్టాడు, కాని చదువు సంధ్యలు లేవు. సత్యమంటే సీతారాముకి కూడా గిట్టదు. దీనికి రెండు కారణా లున్నవి. ఒకటి సత్యం మూలంగానే పద్మనాభం తన్నులుతిని ఊరు విడిచి పోయాడని, రెండోది సత్యం బ్రాహ్మణుడు కావడం.

సీతారాం తలిదండ్రులు బ్రాహ్మణులంటే సమాజానికి పట్టిన చీడపురుగులని భావిస్తారు. వారి దృష్టిలో బ్రాహ్మణులు వంచకులు, మోసగాళ్ళు, నీచులు. సీతారాం యిలాంటి విద్రోహమయ వాతావరణంలో పుట్టి పెరిగాడు.

గ్రామంలోని ఆకతాయి ముఠా చేలగట్ల మీదుగా పోతున్నది. చేలల్లో పైరు పంటలులేవు. సీతారాం చేతిలో లాటీ, భుజాన కంబళి వున్నవి. వాడు పోతూపోతూ ఏదో చెట్టువంక వేలుపెట్టి చూపిస్తూ అటూ యిటూ ఎవరైనా వస్తున్నారేమోనని చూస్తూ ముందు నడుస్తున్నాడు. వాడికి తెలుసు ఊరి చుట్టుపట్ల ఎక్కడో ఒకచోట తేనెతుట్టెలు దొరుకుతవని. కోడూరురోడ్డు ప్రక్కనున్న చెట్లకు నాలుగైదు తుట్టెలున్నవి. వారు తేనెతుట్టెలు దులిపే ప్రయత్నములో నున్నారు.

"సత్యం స్కూలు మానేశాడటగా?" అన్నాడు ముఠాలోని మెంబరొకడు.

"ఎందుకు మానేశాడు?" అని సీతారాం వెనుదిరిగి ప్రశ్నించారు.

వారికి ఒకటి రెండు ఫర్లాంగుల దూరంలో గట్టు మీదుగా వస్తున్న సత్యం కనిపించాడు. "చూడండి! వాడు వస్తున్నాడు." ఆ అయిదారుగురు ఒక్క పర్యాయం వెను దిరిగి సత్యాన్ని చూచారు.

సీతారాం నడక వేగాన్ని తగ్గించాడు. వాడి ముఠా గూడా మెల్ల మెల్లగా నడవసాగారు. ఇంతలో అతని కేమి తోచిందో ఏమో సీతారాం తన మిత్రులతో "తొందరగా నడవండి స్కూల్లో కలుద్దాం" అన్నాడు. అతడు నెమ్మదిగానే నడుస్తున్నాడు. కొంతసేపటికి సత్యం వచ్చి అతనిని కలుసు కొన్నాడు.

"ఏం సత్యం! యిలా వస్తున్నావేం? కాలవకట్టనవస్తే ఎవరూ వుండేవారు కారుగా" అన్నాడు సీతారాం వ్యంగ్యంగా.

"నా యిష్టం. ఎటు వెళ్ళాలనివుంటే అటు వెళ్తా."

"అరే కోప్పడతావేమిరా?" అంటూ సీతారాం అతని దారి కడ్డుగా నిలబడ్డాడు.

"నన్ను పోనివ్వు."

"వెళ్ళు వెళ్ళు. తొందరగా వెళ్ళు. నళిని నీకొరకు నిరీ క్షిస్తుంటదికాబోలు." అంటూ సీతారాం ప్రక్కకుతొలిగాడు.

"నేను నీతో మాట్లాడనప్పుడు నీవు నాతో ఎందుకు మాట్లాడాలి?"

"మమ్ముల నెందుకు దబాయిస్తావ్! ఆమె వంతెన మీద లేదూ? ఈ విషయం కోడూరంతా మారుమ్రోగి పోతున్నదిలే."

"తెలిస్తే తెలిసింది. ఇందులో నా తప్పేమిటి ?"

"బ్రాహ్మణుల యింట పుట్టావు! చేసే పను లివా ?"

సత్యం రెండడుగులు ముందుకువేసి యీ మాట వినగానే వెనుదిరిగి సీతారాం వంక తీక్షణంగా చూడసాగాడు.

"ఈ చూపు మరొకరిమీద ప్రసరింపజేస్తూ వెళ్లు." అంటూ సీతారాం లాటి కంబలి సర్దుకొని దగ్గఱలోవున్న చెట్టువద్దకు వెళ్లాడు. సత్యం తలవంచుకొని తన దారిన తాను స్కూలుకు టైం అయినదని పోతున్నాడు.

సీతారాం కొంచెంసేపు చెట్టుక్రిందే నిలబడ్డాడు. చెట్టు కొమ్మన తేనెతుట్టె వ్రేలాడుతున్నది. కోడూరు వైపునుండి కాంచన వస్తున్నది. ఆమెవెంట ఒక నౌకరుగూడా వున్నాడు. సీతారాం వాళ్ళు రావడం చూచి చకితుడైనాడు. తన కంబళి, లాటి తీసుకొని చెట్టుచాటుగా అడ్డదారినే కోడూరు వైపు సాగాడు. కాంచన చాలాదూరం వెళ్లిపోయింది. సత్యంగూడా కోడూరు వంతెనదగ్గరకు వచ్చాడు. సీతారాం అంతకుముందే వంతెన దగ్గర కాలువ కట్టమీదనున్న చింతచెట్టుపైకి ఎవరికీ కనిపించకుండా యెక్కి కంబళి కప్పుకొన్నాడు. ఆ చెట్టు మీద గూడా ఒక తేనెతుట్టె వున్నది. వాడు సత్యం వంతెన మీదకు ఎప్పుడు వస్తాడా అని నిరీక్షిస్తున్నాడు. ఎందుకంటే సత్యం వంతెనమీదకు రాగానే కఱ్ఱతో తేనెతుట్టె రేపుదామని. ఈగలు పైకి లేచి వంతెనమీద పోతున్న సత్యాన్ని కుడతవని అతని ఆశయం.

సీతారాం కంబళి నిండా ముసుగు పెట్టుకొని కూర్చున్నాడు. పాపం సత్యం స్థితి దుర్భరం. ఈగ లతని ముఖం

మీాదా, కండ్లమీాదా కుట్టినవి. ముఖమూా, కండ్లూ వాచినవి. బాధతో మూలగసాగాడు.

సత్యం 'వెనుదిరిగిపోదామా' అనుకొన్నాడు. అతని కీ స్థితిలో స్కూలుకు వెళ్ళాలని లేదు. అతను ముఖానికి చేతు లడ్డుపెట్టుకొని, ఈగలను తోలుతూ, పిట్టగోడ మీాదకు వంగాడు. ఈగలు కొంతసేపటికి వెళ్ళిపోయినవి. అత నేమను కొన్నాడో యేమో కోడూరువైపుకే బయలుదేరాడు.

అతను స్కూలులో ప్రవేశించగానే పిల్ల లతనిని చూచి నవ్వసాగారు. అదేదో 'బూచిలా' అందరూ అతని వంకే చూడసాగారు.

"అరే! వీడు వంతెనమీాద నిలబడి నళినితో మాట్లాడు తున్నాడు. నళిని గూడా తేనెటీగ లాంటిదే! అందుచే తేనె టీగలకు కోపం వచ్చి వీడి ముఖమంతా రక్కి వుంటాయి." అన్నాడు రాజు వికటాట్టహాసం చేస్తూ. సత్యానికి రాజుకు క్లాసులో ఎప్పుడూ పోటీగానే వుంటుంది. క్లాసులో యిద్దరూ తెలివిగల వాళ్ళే.

సత్యం కోపపడితే పిల్లలు మరికాస్త అల్లరిచేసి ఏడి పిస్తారు. పిచ్చివానిక్రింద జమకడతారు. ఈ సంగతి సత్యానికి తెలుసు. అందుకని మెదలకుండా వూరుకొన్నాడు. ఈ గోలంతా చూస్తుంటే అతని హృదయం అగ్ని పర్వతములా బ్రద్దలగుతున్నది. ఇంకా మాష్టరుగారు రాలేదు.

"ఈ విషయం కోడూరులో అందరికీ తెలిసిపోయిందే. ఒకనాడు పిచ్చివాడిలా కిళ్ళీకొట్లో కూర్చున్నాడు." అన్నాడు సూర్యనారాయణ. ఇతను కోడూరులోనే ఉంటున్నాడు,

ఈ సంగతి యదార్థం కూడాను. సత్యం దానికేమీ జవాబు చెప్పలేదు.

ఎప్పుడైతే మాష్టరుగారు క్లాసులో అడుగు పెట్టాడో ఆతని వెంట సీతారాం గూడా వున్నాడు. అతనేమీ ఎరగని పిల్లిలా వున్నాడు. పిల్లలింకా సత్యాన్ని చూచి నవ్వుతూనే వున్నారు.

"ఏమి జరిగిందిరా సత్యం?" అన్నాడు మాష్టరు. పిల్లలు యింకా నవ్వుతూనే ఉన్నారు. 'సైలెన్సు'. అన్నాడు మాష్టరు గారు బిగ్గరగా.

సత్యం మాట్లాడకుండా నిలబడ్డాడు.

"చెప్పు. ఏమిజరిగిందో?" పంతులుగారు మరల అడిగారు.

"నేను స్కూలుకు వస్తున్నాను. వంతెనమీదకు రాగానే తేనెటీగలు కుట్టినవి." పిల్లలు నవ్వు ఆపుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

"బాగా నొప్పి పుడుతున్నదా? ఇంటికి వెళ్లాలంటే వెళ్లు." అన్నాడు పంతులుగారు.

సత్యం సంచి తీసుకొని బయలు దేరాడు. క్రింది తరగతిలో నళిని వున్నదేమోనని వెతికాడు. అతనికి నళిని కనిపించలేదు.

అతను హతాశుడై స్కూలులోనుండి బయటకు రాగానే రోడ్డుమీద నళిని కనిపించింది. అత నక్కడే కొంచెం సేపు నిలబడ్డాడు. సత్యాన్ని చూడగానే నళిని నౌకరును వెళ్లి

పొమ్మని చెప్పింది. ఆమె సత్యంవద్దకు వచ్చి నిలబడింది. స్కూలు వరండాలో యింకా కొంతమంది పిల్ల లున్నారు.

"ఏమిటే ముఖమంతా అలా వున్నది?" అన్నది నళిని.

"తేనెటీగలు కుట్టినవి. ఇంటికి పోతున్నాను."

"పద, నేను గూడా వస్తాను." ఇరువురూ బయలు దేరారు. పిల్లలు చప్పట్లు కొడుతూ గేలిచేయసాగారు. వారు ఒక్క పర్యాయం గూడా వెనుదిరిగి చూడలేదు. ఎక్కడి నుండి వచ్చిందో వారి కా సాహసం. వారు సిగ్గు పడడం లేదు. వా రా దశను గడిచి పోయారు. సిగ్గుపడడం పిరికితన మనే స్థితికి వచ్చారు.

వారు కాలవకట్టనే పడి కొత్తపట్నంవైపు పోతున్నారు. ఒక ఫర్లాంగో అర ఫర్లాంగో వెళ్లి అరగంటసేపు కూర్చుంటూ పోతున్నారు. నళిని ఎంతో ఉత్సాహంతో స్కూలుకు వచ్చింది. ఆమెకు చదువుకోవాలనే కోర్కె మెండుగా వున్నది. ఆమె ఏమి కావాలను కొన్నదో అదే జరిగింది. వాళ్ల అమ్మ చదువు కోవడాని కనుమతించింది. 'ఆమె సాయంకాల మెప్పుడౌతుందా, ఎప్పుడు సత్యంతో కలిసి యింటికి పోదామా?' అనుకొంటు న్నది. ఆమె తల్లి ముందే ఇంటికి వెళ్లిపోయింది.

ఇప్పు డామె సత్యం ప్రక్కనే కూర్చుని కాలవలోని చల్లని నీళ్లలో కొంగు తడిపి సత్యం ముఖమంతా తుడుస్తు న్నది. ఆమె ముఖవైఖరిచూస్తే తేనెటీగ లామెనే కుట్టినవా అన్నట్లున్నది.

సత్యం యింటికి చేరగానే కాంచనను గూడా తేనె టీగలు కుట్టినవని తెలిసింది. ఆమె బాధతో మూలుగు తున్నది.

౧౧

సంఖశాంతులు చిన్నచిన్న పర్వతశృంగాలైతే కష్టాలు పెద్దపెద్ద పర్వతాల్లా గుంటాయి. జీవితం ఎగుడు దిగుడులుగా నున్న పర్వతం లాంటిది. అప్పుడప్పుడు విశ్రాంతి తీసుకోవ డానికి లోయల్లో కొంచెం నీడ దొరుకుతుంది.

బాల్యం నిమ్నోన్నతాలతో కూడుకొన్న లోయ లాంటిది. పర్వతారోహకులకు లోయ దాటడానికి యెంత కాలం పడుతుంది...?

సత్యం, నళిని బాల్యమనే లోయ దాటుతున్నారు యౌవన......జీవితోత్తుంగ శిఖరం ఎదురుగా కనిపిస్తున్నది. చెట్టపట్టాలు పట్టుకొని ఆనందోత్సాహాలలో, ఆటపాటలతో బాల్యం గడుపుతూ క్లాసు తరువాత క్లాసు చదువుతున్నారు.

కాలం సమదృష్టితో వ్యవహరిస్తుంది. వర్షం కురిస్తే పిల్లల కెంతో పెద్దవాళ్లకూ అంతే. ముసలివారికి వెంట్రుకలు పండబారితే యువకులకు మీసాలు మొలుస్తవి. సత్యం మూతిమీద నూనూగు మీసం కన్పిస్తున్నది.

నళిని గూడా పుష్పంలా రేకులు విచ్చి వికసించింది. యవ్వనం పల్లవించింది. ముఖంలో స్నిగ్ధత, కాంతి, నూతన సౌందర్యం వచ్చింది. వక్షస్థలం పైకి ఉబుకుతున్నది. నిర్భయంగా కొత్తపట్నం రేవులో చిందులువేసే అమ్మాయి ఇప్పుడు యిల్లు కదలడంలేదు. యవ్వనం సిగ్గు అనే అవగుంఠ నాన్ని వేసుకొన్నది.

ఇరువురు చదువుకు స్వస్తి చెప్పారు. సత్యం స్కూలు ఫైనలు వరకు చదివాడు. ఇప్పుడతడు దీర్ఘకాయుడు.

నాజూకైన భావుకతగల నవయువకుడు. వయస్సు పదునెనిమిది సంవత్సరాలుంటుంది. ముఖంలో ఎప్పుడూ శాంతి వెల్లివిరుస్తుంది. బహుశా చిన్నతనంలో పడిన సిరామరక కారణామై వుంటుంది.

తండ్రి సత్యాన్ని దేవాలయంలో పూజారిగా నియమించాడు. తాతతండ్రులనుండి వస్తున్న వృత్తి యిది. సత్యం రెండు మూడు నెలలు దేవాలయానికి వెళ్లాడు గూడా. కాని పూజాదికాలలో అతని మనస్సు లగ్నం కావడం లేదు. అతను చిత్రకళ అభ్యసించాలను కొంటున్నాడు. ఉదయాన్నుండి సాయంత్రం వరకూ ఏవో బొమ్మలు గీస్తుండేవాడు. చిన్నతనంలో గీచిన పిచ్చి పిచ్చి గీతల్లా కాకుండా యిప్పుడు గీచే గీతల్లో నాజూకు, రూపురేఖలు స్పష్టంగా గోచరిస్తున్నవి. అతను అవలీలగా బొమ్మగీయగలడు. చిత్రకళలో ప్రావీణ్యాం సంపాదించాడు. అతని చిత్రాల్లో వాస్తవికత గోచరిస్తుంది. అతనిదొక విశిష్టమైన శైలి.

భుజాన సంచివేసుకొని సముద్రపుటొడ్డున షికారు చేస్తూ ఒకప్పుడు చేపలుపట్టే జాలరివాళ్ల గుడిసెలు చిత్రీకరించేవాడు. మరొకప్పుడు ఉదయభానుని కిరణరశ్మికి, సముద్రపు ఉత్తుంగ తరంగ పంక్తులకు రంగురంగుల వోణీ కప్పుతుండేవాడు. ఒకప్పుడు గోధూళివేళను చిత్రిస్తే, మరొకప్పుడు ఎత్తైన దిబ్బమీదనున్న ప్రాచీన దేవాలయాన్ని చిత్రించేవాడు. మేఘంపట్టి వర్షంకురుస్తుంటే యింట్లో కూర్చుని నళిని చిత్రాన్ని చిత్రీకరించేవాడు. అతని చెయ్యి విశ్రాంతి నెరుగదు.

కోడూరు జమీందారుగారు అతనిచిత్ర మొకటి కొన్నారు. దానితో సత్యానికి బ్రతుకు తెరువుగూడా గోచ

రించింది. మొదట్లో చిత్రపటాన్ని అమ్ముతున్నప్పుడు అతని కనుల వెంట అప్రయత్నంగా నీరుతిరిగింది. కారణం తెలియదు.

"నేను దేవాలయంలో పూజ చేయలేను." అని తండ్రితో సవినయంగా చెప్పాడు. భయపెట్టి గుడికి పంపడానికతనేమీ చిన్నపిల్లవాడు కాడు. యవ్వనంలో నున్నవాడికి నచ్చ జెప్పడం చాల కష్టం. యవ్వనోన్మాదానికి తోడు కళాతృష్ణగూడా వుంటే అతనికి నచ్చజెప్పడ మసంభవం. "పైతృకవృత్తి పోతున్నది." అని అనంతకృష్ణశర్మ అనేక పర్యాయాలు చెప్పాడు. ఇతరులతో చెప్పించాడు. కాని సత్యం వినలేదు.

ఈడొచ్చిన పిల్ల తన యింట్లో వుండడం నళిని పినతల్లి కిష్టంలేదు. ఈ విషయంలో తల్లి, పినతల్లి మధ్య పోట్లాట గూడా అయింది. నళిని తల్లి పట్టుదలగల మనిషి. ఏడిచి మొత్తుకొని నాయుడి దగ్గరినుండి కొంత డబ్బు తెచ్చుకొని నళినికి తన యింట్లోనే నాట్యం నేర్పింపసాగింది. నాట్యాచార్యులు రోజూ కోడూరు నుండి వస్తాడు.

సత్యం, నళిని వయస్సుతోపాటు ఎన్ని మార్పులు చెందినా కొత్తపట్నంలో ముఖ్యమైన మార్పులేమీ రాలేదు. పద్మనాభం ఊరి వదలిపారిపోయాడు. ఒకటి రెండు కుటుంబాలవారు పొట్టగడవక కూలినాలి ఎక్కడ దొరుకుతుందా అని వెతుక్కొంటూ వెళ్లారు. దేవాలయం బీటలువారింది. మరమ్మతు చేయించాలని ఎంత ప్రయత్నించి చందాలకు తిరిగినా లాభంలేకపోయింది. సముద్రం సమీపానికి వస్తున్నది. ఎన్నో సంవత్సరాలనుండి కొత్తపట్నం జీవిత మలానే ఉన్నది.

అయితే ఒకటి మాత్రం జరిగింది ... ఈ విషయమే ఊరంతా చెప్పుకొంటున్నారు. ఈపాడు పడిన గ్రామంలో ఆదినారాయణ రెండంతస్థుల మేడ కట్టిస్తున్నాడు. అతనింకా భూమిగూడా కొన్నాడు. అతను మొదటే భూస్వామి. ఇప్పుడింకా లక్షాధికారయినాడు. చుట్టుపట్ల గ్రామాల్లో వడ్డీ వ్యాపారం చేస్తున్నాడు. ఖాళీగా వున్నప్పుడు అనంతకృష్ణశర్మ వారి యింటికి వెడతాడు. బలవంతాన తిరిగి యింటికి భోజనానికి వస్తాడు. సత్యం ఒంటరిగానే ఉంటున్నాడు.

౧౨

సత్యం వేపచెట్టుక్రింద కూర్చున్నాడు. నళిని అతనికి దగ్గరలో వేపచెట్టుకు మోచేయి ఆనించి నిలబడి ఉన్నది. సాయంత్రం నాల్గైదు గంటల సమయం. ఈరోజు నళినికి నాట్యం నేర్పే మాష్టరు రాలేదు. సత్యానికిగూడా ఏమీ తొందర పనిలేదు. తండ్రి యింట్లోలేడు. ఆయన తనను ఎవరూ పిలువకుండానే పోయే యిల్లు ఆ ఊరిలోనే లేదు.

సత్యం ఏకాంత ప్రియుడు. అతని స్వభావమే అంత. కాని యీనాడతను బహిష్కరింపబడిన వానిలా గున్నాడు. తండ్రి గూడా అతనితో సరిగా మాట్లాడడం లేదు. గ్రామంలోని చిన్నలూ పెద్దలూ అతనిని చూచి మూతి ముడుచుకొంటున్నారు. అతని కులం వాళ్లంతా అతనిని చూడగానే అంటరాని వానినిగా భావించి తప్పుకు తిరుగుతున్నారు. అంత దాకా ఎందుకు ఎంతో ఆప్యాయనంగా మాట్లాడించే రాఘవ

రావు గూడా, సత్యం పలకరించినా పలకకుండా ముఖం ప్రక్కకు త్రిప్పు కొంటున్నాడు.

రాఘవరావు యిల్లు ఊరి వెలుపల నున్నది. అతడు తన పొలంలోనే ఒక గుడిసె వేసుకొని కాపుర ముంటున్నాడు. సత్య మప్పుడప్పుడు అతని యింటికి పోతుండేవాడు. రాఘవ రావు గూడా బ్రాహ్మణుడే. అతని కిద్దరు భార్య లున్నారు. ఒకరు బ్రాహ్మణి, రెండవది వేశ్య. అతని వయస్సు నలభై, నలభై అయిదు సంవత్సరా లుంటుంది. అతను గూడా చిత్ర కళంటే పడిచస్తాడు.

కనుక సత్యం ఎప్పుడూ యింట్లోనే ఉంటున్నాడు. అతను నళినిని కలుసుకోవడానికి సిగ్గు పడడం లేదు. అతని కొక విధమైన ధైర్యం వచ్చింది. పెద్దలు, చిన్నలు, స్నేహి తులు, చుట్టాలు ఎంతోమంది చెప్పారు. వాళ్లు చెప్పినకొద్దీ సత్యం యింకా బిగుసుకోసాగాడు. అతని మేనమామ పెండ్లి విషయమై హెచ్చరించాడు. సత్యం దానికిగూడా జవాబు చెప్ప లేదు.

"చూచావా! ఇప్పుడు సీతారాం ఏమి చేస్తున్నాడో!" అన్నది నళిని.

"తెలియదే!"

"రైల్వేలో నౌకరీ సంపాదించాడట. మంచిఉద్యోగం. రైలెక్కి ఎక్కడకు పడితే అక్కడకు పోవచ్చు."

"..."

"ఆఁ. ఇప్పు డతని ముఠాలో ఎవరూ ఇక్కడ లేరు. అందరూ అటూ ఇటూ పోయారు. కొందరు రైల్వే పనిలో

చేరారు. కొందరుబడిపంతు ళ్లైనారు. కొందరుఉద్యోగంకోసమని చెప్పులు అరిగేలా తిరుగుతున్నారు.”

“...”

“మరి...”

“ఏమిటి? నేనుగూడా ఎక్కడకైనా పోయి నౌకరి చేయాలని నీ ఉద్దేశమా? నేనుగూడా ఉద్యోగస్తుణ్ణి కావాలని నీ కోరికా?”

“లేదు. లేదు. అలాగని నే నెప్పు డన్నాను?”

“నే నెవరికీ గులామును కాదలచ లేదు. నేను చిత్రకళ అభ్యసించా లనుకొంటున్నాను. ఇక్కడ గూడా చిత్రాలు గీయగలను. నాకు వచ్చిన కళ చూపించాలని లేదు. రెండు రోజుల జీవితం. నా యిష్టం వచ్చినట్లు కాలక్షేప మెందుకు చేయగూడదు. చెప్పే వాళ్ల కేం చెపుతారు. కాని నేను సర్వసంగ పరిత్యాగిమైన యోగిలా వుంటాను.”

“వద్దు వద్దు. అలాంటి తప్పుడుపని యెప్పుడూ చేయ వద్దు. విశ్వామిత్రునిలా అల్లరిచేస్తావా?”

“ఎదురుగా మేనకవుంటే అల్లరిచేయడంలోనే మజా వున్నది.” ఇరువురూ బిగ్గరగా నవ్వుకొన్నారు.

“ఇవాళ నేనొక మంచి బొమ్మ గీశాను. ఇప్పుడే తెస్తాను.” అంటూ సత్యం యింట్లోకి వెళ్లాడు. నళిని పడిపోయిన గోడమీద కూర్చుని నిమ్మతొనలు చప్పరిస్తున్నది.

వెంకటస్వామి రోడ్డుమీదుగా గేదెలను తోలుకు పోతున్నాడు. అతని ఒక భుజంమీద గడ్డిమూట, రెండవ భుజంమీద కఱ్ఱ వున్నవి. పాతికసంవత్సరాల నవయువకుడు. మదోన్మత్తునిలాగున్నాడు. మంచి రసికుడని ఊరిలో పేరు

మ్రోగాడు. ప్రతిరోజు సాయంత్రంపూట అతని యింటిలో సభ జరుగుతుంది. గానాబజానా జరుగుతుంది. అతను స్వయంగా తబలా వాయిస్తాడు.

నళిని ఒంటరిగావుండటం చూచి అతనామెవంక వోర చూపులు చూచాడు. మెల్లగా ఈలవేశాడు, కఱ్ఱ సవరించు కొని నిలబడి కుచ్చెళ్ల చెంగులు క్రిందకు జారవిడిచాడు. నెత్తి మీద తలగుడ్డ సవరించుకొన్నాడు. నళిని యీ చేష్టలన్నీ గమనించకుడా ఎటో చూస్తున్నది.

వెంకటస్వామి కొంతసేపలా వెకిలిచేష్టలు చేసి కాండ్రించి ఉమ్మివేస్తూ ముందుకుసాగాడు. అతని వెనకే నారాయణబాబా వస్తున్నాడు. తెల్లని మీసాలు, ముడుతలువడిన శరీరము, బట్టతల, చేతిలో కఱ్ఱ. ఆయనను చూడగానే వెంకటస్వామి గేదెలను తొందరగా అదలించుకొని వెళ్లిపోయాడు.

నారాయణబాబా వయసులో మోటారుడ్రైవరు. ఆరోజుల్లో క్రొత్తక్రొత్త రకాల మోటార్లు వచ్చినవి. కారు నడపటం గొప్పగా భావించేవారు. నారాయణబాబాకు కొద్దిగా భూమీపుట్రాగూడా వున్నవి. యవ్వనంలో ఒక వేశ్య వలలో తగుల్కొనేసరికి అదికాస్తా కర్పూరంలా హారించుకు పోయింది. ఇప్పుడుగూడా కొత్తపట్నంలో అతను వేశ్య యింట్లోనే ఉంటున్నాడు. భార్య బ్రతికేవున్నది. కాని నారాయణబాబా ఆమెవంక కన్నెత్తిగూడా చూడడు. ఆమె కూడా అంతే. ఊరిలో చిన్నాపెద్దా అంతా అతనిని బాబా అని పిలుస్తారు.

"ఏం నళినీ? ఒంటరిగా కూర్చుని ఏంచేస్తున్నావ్ ?"

నళిని విననట్లూరకొన్నది.

"మాట్లాడవేం?"

నళిని చిరునవ్వునవ్వి అతనివంక చూచింది. నారాయణ బాబా కన్నుగీటాడు. ఈ కళలో అతనారితేరిన ఘటం. జీవితం నాశనమైపోయింది. ఇప్పటికీ కుక్కతోకలా అతని స్వభావం మారలేదు. నళిని అతని వైపుకు తిరిగి అతని వంక కోపంగా చూచేసరికి "అమ్మ యింట్లో వున్నదా? లేదా?" అని మృదు మధురంగా అడిగాడు.

నళిని మారు మాట్లాడలేదు. అతడు తనదారిన తాను మౌనంగా వెళ్లాడు.

'నళిని' అనే గులాబి పూవు ఎప్పుడైతే వికసించిందో ఊరిలో నున్న పిన్న లేమి, పెద్ద లేమి, మంచి వారేమి, చెడ్డ వారేమి, రసికులేమి, అరసికులేమి అంతా వాసన చూడవలె ననే కోరిక కలవారే. ఏదో విధంగా ఆమెతో మాట్లాడాలని ప్రయత్నించేవారే. ఊరిలో ఎంతమంది యువతులు లేరు. కాని వారి వంకెవరూ కన్నెత్తి చూచేవారు కారు.

'ఇదేదో అమ్ముకొనే వస్తువు!' అన్నట్లుగా నళిని తల్లి గూడా కనపడ్డ వాళ్లందరితోనూ మాట్లాడేది. నళిని నాట్యాన్ని ప్రశంసించేది. యువకులను ఇంటికి పిలుచుకు వచ్చేది. కాని నళిని కివన్నీ నచ్చేవికావు.

సత్యం చిత్రాన్ని తీసుకొచ్చాడు. చిత్రంలో వెన్నెల విరిసింది. పూలు పుష్పించాయి. కాని నలుగు రైదుగురు మనుష్యులు నిశ్చేష్టులయి కండ్లు మూసికొని ముఖానికి చేతు లడ్డు పెట్టుకొని నిలబడినట్లు చిత్రించాడు.

"అర్థమైనదా!" సత్యం ప్రశ్నించాడు.

"లేదు."

"ప్రపంచ మిలాగున్నది. వెన్నెల విరిసింది. కాని మనుష్యులు ముఖానికి చేతులు అడ్డుపెట్టుకొని గబ్బిలాయిల్లా అంధకారంలో పడి కొట్టుమిట్టాడుతున్నారు. వీరు నిరర్థకంగా శీలమని, అశ్లీలమని, స్వాతంత్రమనీ, అస్వాతంత్రమనీ పారిభాషిక పదాల్లోపడి కొట్టుకొంటున్నారు. వీళ్లకిదే ఆనందం."

"మరి నీవు?"

"నేనలాంటివారిలో చేరను. కళ్లుమూసుకొంటే వెన్నెల కాయకుండా ఉంటుందా? నేను కండ్లు తెరచి వెన్నెల చూస్తాను. వెన్నెల్లో ఉన్న చల్లదనాన్ని, అందాన్ని అనుభవిస్తాను. నా ఉద్దేశ మేమిటో నీ కర్థమైనదా?"

"నా కేమీ అర్థం కాలేదు."

"కళ్లు తెరిస్తే అర్థమవుతుంది." అని సత్యం నవ్వాడు.

వారు కొంచెంసేపు ఒకరి నొకరు చూస్తూ అలా కూర్చుండిపోయారు. చీకటి పడుతున్నది. చుట్టుపట్ల ఇండ్లలో దీపాలు వెలిగించారు. ఇంటి పైకప్పులలో నుండి పొగ వస్తున్నది. సందడిగాగూడా వున్నది. రైతులు పొలాలనుండి యిండ్లకు తిరిగి వస్తున్నారు.

"అమ్మాయ్! ఇంట్లో దీపము వెలిగించవేమే?" అంటూ కాంచన యింట్లోనుండి వాకిట్లోకి వచ్చింది. నళిని తొందర తొందరగా లోపలకు వెళ్లింది. కాని నళిని సత్యంతో మాట్లాడడం కాంచన చూచింది.

"వాడితో మాట్లాడవద్దని నీ కెన్ని పర్యాయాలు చెప్పానే. వాడెందుకు పనికి వస్తాడు? తండ్రి పూజారి,

పొలమూ పుట్రా ఏమీ లేదు. నిరుద్యోగి. వాడిని పట్టుకు వ్రేలాడుతావేమే! నీవు నన్ను సర్వనాశనం చేసిగాని విడిచి పెట్టనట్లున్నావు? నన్ను ఏడిపించబోకే." అంటూ తల్లి నళినిని చీవాట్లు పెడుతూ మంచంలో కూలబడి, ఇంకా ఏదో గొణుగుతూనే వున్నది.

నళిని మాట్లాడలేదు. నళినికి ఆమె తల్లితో మాట్లాడడ మన్నా ఆమె చెప్పేది వినడమన్నా సుతరామూ యిష్టంలేదు. నళిని మనస్సుకు శాంతి లేదు.

## ౧౩

దసరా పండుగ రోజులు. పాడు పడినట్లున్న కొత్త పట్నానికి కూడా నూతన కళ వచ్చింది. పడిపోయిన యిళ్లకు కొద్దిదూరములోనున్న యిల్లు చక్కగా అలంకరించారు. ఆదినారాయణ యిల్లు పూర్తి గానప్పటికీ దసరా శుభసమయంలో గృహప్రవేశం చేయాలని అతని కోరిక. ఇంటి ముందు పెద్ద పందిరి వేయించాడు. కూలీలు హడావుడిగా పని చేస్తున్నారు. సాయంత్ర మక్కడ నళిని నాట్యమున్నది. కోడూరు జమీందారుగారు కూడా వస్తున్నారు. ఊరిలో యిలాంటి సందడి యింకెప్పుడొస్తుంది?

తొమ్మిది రోజులూ దేవాలయంలో విశేష పూజలు జరుగుతున్నవి. రాత్రిళ్లు ఎవరో ఒక హరిదాసు హరికథ చెపుతున్నాడు. ఆదినారాయణ చెప్పగానే ఊరిలో వారంతా యీ శుభకార్యం కొరకు చందాలు వసూలు చేశారు. వెనక సత్యంతో కలిసి చదువుకొన్న సహాధ్యాయులు చాలమంది

వచ్చారు. కాని శత్రువు కంటబడకుండా తప్పించుకు తిరిగినట్లు వారు సత్యం కంటబడకుండా తప్పించుకు తిరిగేవారు. ఇతని అపకీర్తి చాలదూరం వ్యాపించింది.

సత్యానికి యిల్లు విడిచి బయటకు పోవాలని లేదు. కాని యీ ఉత్సవసమయంలో ఒంటరిగా యింట్లో కూర్చోవాలంటే కష్టమనిపించింది. నళినిని పిలిచినా ఆమె రాలేదు. వాళ్లింటికి నాయుడు వచ్చాడు. అతని కన్ను గప్పడం అసాధ్యం.

సత్యం ఒంటరిగా పొలాలవైపు వెళ్లాడు. పచ్చపచ్చని పంటచేలు కనులపండువుగా వున్నవి. ఒకచోట ధాన్యం, ఒక చోటమిరపతోట, ఇంకొకచేలోపసుపుతోట, జీడిమామిడితోట, నారింజతోట నయనానందకరంగా వున్నవి. సత్యం చేలగట్ల మీదుగా పోతున్నాడు. రాఘవరావు యింట్లో గూడా దసరా ఉత్సవాలు జరుగుతున్నవి. రాఘవరావు ఉంచుకొన్న వేశ్యకు క్రిందటి రోజునే కొడుకు పుట్టాడు. దాని చుట్టాలు చాలమంది వచ్చారు.

ఇంటి వెనుకప్రక్కనుండి సత్యం సముద్రపు ఒడ్డుకు వెళ్లాడు. సముద్రపు హోరు, సరివిచెట్ల మర్మరధ్వని తప్ప అక్కడెవరూ లేరు. అంతా ప్రశాంతంగా నున్నది. ఇసుకమీద కూర్చుని దూరంగా కన్పిస్తున్న నీలి క్షితిజాన్ని చూస్తున్నాడు. అతని కన్ను లెప్పుడు మూత వడినవో తెలియదు. అతను నిద్రాదేవి వొడిలో మునిగి పోయాడు.

అతను కనులు తెరిచేసరికి సాయంత్రం నాలుగు గంటలైనది. అతడు కొంతసే పచ్చటనే ఉద్విగ్నంగా ఉదాసీనంగా

కూర్చున్నాడు. ఆకలి వేస్తుంటే యింటిముఖ మైనాడు. ఒంటరివాడు నిద్రమత్తు యింకా వదలలేదు.

అతడు యిసుకదిబ్బ దాటగానే జీడిమామిడిచెట్ల చాటు నుండి మాటలు వినిపించసాగినవి. అతనుఉలిక్కిపడ్డాడు. ఏదో వస్తువు కదులుతున్నట్లున్నది. అతను రెండడుగులు ముందుకు వేశాడు. దగ్గరలోనున్న యిసుకదిబ్బమీదకు ఎక్కాడు. చిరునవ్వు నవ్వి దిబ్బమీదనుండి దిగివచ్చాడు.

వేణుగోపాలరావు రాఘవరావు సంబంధీకు లెవరితోనో ప్రక్కనే కూర్చుని మాట్లాడుతున్నాడు. వేణుగోపాల రావు ప్రక్కనున్నది ఆడపిల్ల. ఆమె రాఘవరావు వుంచు కొన్న వేశ్య చెల్లెలులా గున్నది. ఇరుప్రరిపోలికలు ఒకటిగానే వున్నవి. వేణుగోపాలరావు ఊరిలో పెద్దమనుషులలో జమే. ఇంట్లో రోజూ పూజచేస్తాడు. లోకులు ధర్మాత్ముడంటారు. నుదుట విభూతి లేకుండా బయటకు రాడు. ఎప్పుడూ రామ నామం జపిస్తుంటాడు. సత్యాన్ని అపకీర్తిపాలు చేయటంలో అతని వాటా ఎక్కువగానే యున్నది.

సత్యానికి ఒక ఆలోచన తట్టింది. "తిరిగి చిన్నపిల్ల వాడినై పద్మనాభం ముఠాలో చేరితే ఎంత బాగుండేది! ఈ ధర్మాత్ముడి సంగతి బయట పెట్టే పని.... ఇప్పుడైనా యితని గుట్టు ఎందుకు బయట పెట్ట కూడదు!"

అతను పోతునే ఆలోచిస్తున్నాడు. 'అపకీర్తిపాలయిన నా మాట ఎవరు వినిపించు కొంటారు. అయినా అతనికి అపఖ్యాతి తెస్తే నాకేం వొరుగుతుంది?' సత్యం బ్రాహ్మ ణుడు. బ్రాహ్మణులచేతనే బహిష్కరింపబడ్డాడు గూడా. అయినా అతని హృదయంలో ఏదో ఒక మూల బ్రాహ్మణు

లంటే అభిమాన మున్నది. పైగా బ్రాహ్మణేతరులను తమతో సమానమైనవారుగా అంగీకరించడు. ఒకవంక యీ కుల మత తత్వాలు పోవాలంటూనే రెండవవంక వాటిని పట్టుకు వ్రేలాడుతాడు. అపరిపక్వదశ.

ఈ ఆలోచనలతో అతను యింటికిచేరాడు. ఇంట్లో ఎవరూలేరు. సాయంత్రం ఆదినారాయణగారియింట్లో విందు జరుగుతుంది. చీకటిపడుతున్నది. నళినియింటికి తాళంవేసి వున్నది. ఆమె ఆదినారాయణయింటికి వెళ్లింది.

పందిట్లో రంగస్థలం ఏర్పాటుచేశారు. రంగస్థలానికి దిగువన వెంకటస్వామి కూర్చునివున్నాడు. అతనిముందు తబలావున్నది. అతనిప్రక్క కోడూరుగ్రామవాసులిద్దరున్నారు. ఒకరు దిల్‌రుబా, ఇంకొకరు హార్మోనియంముందు కూర్చు న్నారు. మొదటివరుసలో కోడూరు జమీందారుగారు ఆయన పరివారము, నళిని పినతల్లి వగైరాలు కూర్చున్నారు.

సత్యం రంగ స్థలానికి దూరంగా నిలబడ్డాడు. బహుశా అతనికి పద్మనాభం, అతని ముఠా గుప్తికి వచ్చి ఉంటారు. ఆ సంఘటన జరిగి చాలా సంవత్సరాలైనది. కాని అతని కనులకు యిప్పుడు జరిగినట్లే కనిపిస్తున్నది. జీవితంలో జరిగిన చిన్న చిన్న సంఘటనలన్నీ మాలగా గుది గ్రుచ్చి నట్లున్నది. ప్రతి చిన్న సంఘటన గూడా అతని విషయంలో విశేష మహత్తు గలదే. అతను త్రాగుబోతులా పందిరి చుట్టూ తిరగసాగాడు.

గంటా గంటన్నర సేపు నళిని రంగస్థలంమీద నాట్యం చేసింది. సత్యం కొంతసేపు "వహ్వా వహ్వా" అంటూ ఆనం

దాబిలో వోలలాడుతున్న ప్రేక్షకుల వంక, కొంతసేపు విద్యుత్తరంగాల్లా తళుక్కుని మెరిసి మాయమయ్యే నళిని పాదాలవంకా చూడసాగాడు. కొంతసేపు కనులు మూసుకొని ఝణక్, ఝణక్ మని మ్రోగుతున్న కాలి గజ్జెల మ్రోత విన సాగాడు.

నాట్యం సమాప్త మవగానే కోడూరు జమీందారు గారు నళినికి విలువైన జరీ పట్టువస్త్రాన్ని బహూకరించాడు. పీనాసి అనుకొనే ఆదినారాయణగూడా తెంపు పుట్టి నూట పదార్లు చదివించాడు. ప్రేక్షకులంతా నళిని నాట్యాని ప్రశం సిస్తున్నారు. ఇది చూచి కాంచన మనస్సు ఆనందోత్సా హాలతో గాలిపడగలా తేలిపోతుంటే పినతల్లి ముఖం కప్పె వేసింది. తన యింట్లో ఎవరో చనిపోయినట్లు దిగాలుపడి కూర్చున్నది.

నాట్యమైన తరువాత అందరూ భోజనాలకు లోపలకు వెళ్లారు. సత్యం, నళిని రంగస్థలంమీద దేదీప్యమానంగా వెలుగుతున్న లైట్ల వెలుతురులో మాట్లాడుకొంటున్నారు. వారికి ప్రపంచమంటే భయంపోయింది. అపకీర్తి వారిని నిర్భీ తులనుగా చేసింది. సత్యం ఎందుకో మధ్యలో మూతిముడుచు కొని కొంతసేపలా నిలబడ్డాడు.

"అలా మూతి ముడుచుకొన్నావేం?"

"ఊం!" సత్యం కోపాన్ని ఆడంబరంగా ప్రదర్శించాడు.

"ఇంతమంది ఎదుట నాట్యం చేశానని కోపం వచ్చింది కాబోలు."

"ఊం."

"మరి వద్దని ఎందుకు చెప్పలేదు."

"నీకీమాత్రంగూడా తెలియదా? ఎవరైనా నాముఖం చూచి, నీనాట్యం చూచి నేను గూడా ఆనందిస్తున్నానని అనుకోకుండా ఉండడానికే నేనిలా ముఖం ముడుచుకొని వున్నాను" అంటూ సత్యం పక్కున నవ్వాడు. "ఇందులో చెడేమున్నది. నృత్యకళలో ఉన్న విశేషమే అది. ఎవరో మూర్ఖులు కండ్లు మూసుకొన్నంత మాత్రాన వారి ఆనందానికే లోపంకాని కళకు కాదు. ఇది సామాజిక కళ."

"మరి చిత్రకళ?"

"వైయక్తిక మరి బహుశా..."

"బహుశా గిహుశా వదిలేయి. భోజనమైందా?"

"వీరితో కలిసి మనలను భోజనం చేయనిస్తారా మనము బహిష్కృతులము."

"ఎందుకు భోజనం చెయ్యనివ్వరు? మనంకూడా అహూతులమే!"

ఇరువురూ కలిసి లోపలకు వెళ్లేసరికి చాలమంది భోజనాలు ముగించుకొన్నారు. శ్రీ వేణుగోపాలరావు కోడూరు జమీందారుగారి ఎదుట తన్మయత్వం చెందిన పరమభక్తుని లాగా పురాణ పఠనం గావిస్తున్నాడు. అతనిని చూడగానే సత్యానికి కడుపుబ్బ నవ్వు వచ్చింది.

౧౪

ఇన్ని దినాలనుండి ఖాళీగావున్న పద్మనాభం యిల్లు గూడా యీనాడు కిటకిటలాడుతున్నది. గడపలకు పసుపు పూసారు. వాకిళ్లకు తోరణాలు కట్టారు. ఏ పండగ, పబ్బాలు జరుపని ఆ యింట్లో నేడు దసరా మహోత్సవం జరుపుతున్నారు.

అతని స్నేహితులు సుబ్బారావు, వెంకటస్వామి మొదలైన వారంతా యింటిని అంటిపెట్టుకొని తిరుగుతున్నారు. సీతారాంకి సెలవు దొరకలేదు. ఉదయాన్నుండి పాటకచ్చేరీ జరుగుతున్నది. వినేవాళ్లుగూడా క్రిక్కిరిసి వున్నారు. బాపినీడు గూడా మంచి మంచి బట్టలు ధరించి అటూ ఇటూ అచ్చుబోసి విడిచిన ఆబోతులా తిరుగుతున్నాడు.

కోడూరు జమీందారుగారివద్ద బాపినీడు నౌకరీ వదలుకొన్నాడని అందరూ గుసగుస లాడుతున్నారు. తండ్రి రాత్రింబవళ్లు ఇతరులదగ్గర పనిచేయడం పద్మనాభానికి నచ్చలేదు. ఇది అతనికి అవమానంగా తోచింది.

పద్మనాభం చెప్పినమీదట బాపినీడు మిగిలిన పొలం, యిల్లూ అమ్మడం మానుకొన్నాడు. ఇంతకుముందు ఎన్ని పర్యాయములు ప్రయత్నించినా, యిల్లూ, పొలం అమ్మలేక పోయాడు. ఇల్లు కొనేవాళ్లెవరూ కనిపించలేదు. పొలానికి సరియైన ధర రావడం లేదు.

అతని కుమారుడు అతని భవిష్యత్తుని పూర్తిగా మార్చివేశాడు. ఇన్ని రోజులనుండి పత్తా లేకుండా మాయమైన వాడు యివ్వాళ ఎక్కడనుండో ఊడిపడి కొత్తపట్నంలో

నూతనోత్సాహాన్ని రేకెత్తించాడు. బాపినీడుకూడా కొడుకు వెంట మద్రాసు వెడతాడని చుట్టుపట్లవాళ్లు అనుకోసాగారు.

*  *  *  *

కొత్తపట్నాన్నుంచి మద్రాసు వెళ్ళి కాపురం పెట్టడం పరిపాటి. కొత్తపట్నానుండి వెళ్లిన చాలమంది వ్యాపారస్తులు మద్రాసులో వ్యాపారం నడుపుతున్నారు. మద్రాసులో కొత్తపట్నంవాళ్లంతా ఐకమత్యంతో, సోదరభావంతో వుంటారు. అందులో లక్షాధికారులున్నారు, గుమస్తాలున్నారు, బజార్ల వెంట తిరిగి సరుకులమ్ముకొనేవాళ్లున్నారు, పెద్దమనుషులున్నారు, రౌడీలున్నారు. బాపినీడు మద్రాసు వెడతాడన్న మాట ఎవరికీ ఆశ్చర్యాన్ని కలిగించలేదు.

ఇన్నాళ్లు బేవార్సుగా ఊరంతా తిరిగిన పద్మనాభం మద్రాసు వెళ్లి ఒక్క పర్యాయం సంగీతదర్శకుడైనాడంటే అందరికీ ఆశ్చర్యంవేసి ముక్కుమీద వ్రేలువేసుకొంటున్నారు. బాగా సంపాదిస్తున్నాడు. అతనికి మద్రాసులో మంచి పేరు ప్రతిష్టలు, పెద్దబంగళా, నౌకర్లు, చిన్నకారు వున్నవని వినికిడి.

పద్మనాభం అయిదారుచిత్రాలకు సంగీతదర్శకత్వం వహించాడు. మద్రాసు వెళ్లి తనపేరు మార్చుకొన్నాడు. పద్మనాభమల్లా పి. నాభ్ అయినాడు. ఈ కారణంగా కొత్తపట్నంవాళ్లంతా అతని సినిమాలు చూచి ఆనందించినా అతనిపేరుమాత్రం గుర్తించేవారుకారు. ఇంత ఉచ్ఛదశలో వున్నా ఎందుచేతనోగాని పద్మనాభం తనవిషయం తండ్రికి తెలియనివ్వలేదు.

పద్మనాభంవెంట చాలాసామానులుగూడా పట్టుకు వచ్చాడు. కుర్చీలు, బల్లలు, మేజాలు ఏవేవో తెచ్చాడు.

అతను కొంతకాలం కొత్తపట్నంలో విశ్రాంతి తీసుకోదల చాడు. అతని బాల్యమూ కొత్తపట్నంలో గడిచింది. అందుచే తన బాల్యాన్ని, కొత్తపట్నాన్ని మరచిపోలేదు. కొత్తపట్నా నికి అతను ఎంతదూరంపోయినా కొత్తపట్నం అతనికి సమీపం లోనే వుంటుంది. కొత్తపట్నంలోని ప్రతి యిసుకదిబ్బా, కాలువ, సముద్రం, దేవాలయం అన్నీ అతనిని పిలుస్తున్న ట్లుంటుంది.

కొత్తపట్నం రాగానే అతనక్కడి ప్రాచీన దేవాలయం లోకి పోయి చేతులు జోడించి కనులుమూసుకొని ఒక భజన గీతం పాడాడు. ఒక్కపర్యాయంగా మారిపోయిన భక్తునిలా కనిపించాడు. అతనినిచూస్తే ఆశ్చర్యమేస్తుంది. నిజంగా అతను మారిపోయాడు.

ప్రతి రోజూ సాయంత్రంపూట సత్యాన్ని కలుసుకో టానికి వచ్చేవాడు. గప్పాలు కొట్టేవాడు. సత్యం వేసిన చిత్రాలు చూచేవాడు. ఇరువురూ చిన్నతనంలో ఎంత దూర దూరంగా ఉండేవారో యిప్పుడంత సన్నిహితులైనారు. ఇరువురకు ప్రగాఢ మైత్రి యేర్పడింది.

పద్మనాభం బాగా పొడుగు పెరిగాడు. వంకెలు తిరిగిన వెంట్రుకలు, విశాలమైన నుదురు, ఆకర్షణీయంగా కనిపిస్తు న్నాడు. శ్రావణమాసంలో పండ్రెండు మాసాలున్నట్లు సంపన్నులలో యౌవనవసంత మెప్పుడూ తొంగిచూస్తుంది.

పద్మనాభానికి అన్ని విషయాలు తెలిసినవి. కాని కొత్తపట్నంలో సత్యాన్ని ఎందుకు బహిష్కరించారో మాత్రం తెలియదు. సత్యంతో పద్మనాభం మాట్లాడు తున్నట్లుడు చూచిగూడా ఆదినారాయణ పద్మనాభానికి

ఏమీ చెప్పలేదు. ఆదినారాయణవలె పద్మనాభంగూడా పేరు ప్రతిష్టలు, భోగభాగ్యాలు సంపాదించాడు. ఆదినారా ఎప్పుడూ పద్మనాభంతో కలిసి తిరగాలని, అతనితో మాట్లా డాలనీ ఉవ్విళ్ళూరుతుంటాడు. బహుశా ఇరువురు ధనవంతులు సూదంటురాళ్ళలా ఒకరి నొకరు ఆకర్షిస్తారు కాబోలు. మద్రాసులోనే ఉంటున్న ఆదినారాయణ కొడుకు పద్మనా భాన్ని గురించి తండ్రికి ఉత్తరం వ్రాశాడుగూడా.

"భగవంతుడు నీకు కళను ప్రసాదించాడు. ఇక్కడ కూర్చుని దానిని నిరర్థకంగా ఎందుకు పాడుచేస్తావు? నీకళను గుర్తించేవారుగాని చూచేవారుగాని యిక్కడ లేరు. నాతో మద్రాసు రా. లోకులు చూస్తారు. ప్రశంసిస్తారు. సంపాదన గూడా బాగా వృద్ధిజెందుతుంది." అన్నాడు పద్మనాభం సత్యానితో.

"నన్నిక్కడే వుండనివ్వు."

"కళరా నాన్నా. ఇది కళ. అడవిలో పూచి అడవి లోనే రాలిపోయే పూవుకాదు. ఉద్యానవనంలో ప్రాణ పదంగా పెంచుకొనే విలువైన మొక్క. పూలుపూచి వాస నలు దశదిశలకు విరజిమ్మాలి. తేనె సోనలు కురిపించాలి. తేనెటీగల నాకర్షించాలి. తెలిసిందా?"

"అక్కడ ఆమహాపట్నంలో లక్షలమంది చిత్రకారు లుంటారు. నా ముఖం చూచే దెవ రక్కడ?"

"ఈ ప్రపంచంలో అందరికీ చోటున్నదిరా నాయనా! వేలమంది చిత్రకారులుంటే దానిని గుర్తించేవారు గూడా లక్షలమంది వుంటారు. ఈసంగతి నీవు మరచిపోయావా?"

"కాని..."సత్యం సంకోచించాడు.

"నీ వేమీ భయపడవద్దు. అన్ని ఏర్పాట్లు నేను చేస్తాను."

"సరే చూద్దాం!" అన్నాడు సత్యం. ఇరువురూ మాట్లాడుకొంటూ కాలవలో నావ షికారుకు బయలు దేరారు. పద్మనాభం తన మృదుమధుర కంఠస్వరంతో ఎన్నో జానపదగీతాలు పాడాడు. అతను బాల్యాన్ని గుర్తుకు తెస్తున్నాడు.

సాయంకాలం వారిరువురూ యింటికి చేరేసరికి నళిని తల్లి వరండాలో కూర్చుని వీరిరాక కెదురు చూస్తున్నది. పద్మనాభం మద్రాసులో పేరు పొందిన సంగీత దర్శకుడైనా డని ఆమెకు గూడా తెలిసింది. నళిని నాట్యాన్ని పద్మనాభా నికి చూపించాలని ఆమె కోరిక.

ఆమె పద్మనాభాన్ని తన యింటికి తీసుకుపోయింది. నళిని పద్మనాభాన్ని బస్తీ వేషంలో చూచి ఉక్కిరిబిక్కిరి... 

నళిని పద్మనాభాన్ని బస్తీ వేషంలో చూచి ఆశ్చర్యపడింది. వెం టనే ప్రక్కనున్న సత్యాన్ని చూచి చిరునవ్వు నవ్వింది. తల్లి చెప్పగా చెప్పగా నళిని నాట్యం చేయసాగింది. పద్మనాభం ఆమె నాట్యాని కనుగుణంగా వేణువు ఊది తరువాత కొంత సేపు రాగాలాపన చేసాడు. అతను రెప్ప వేయకుండా నళిని వంక చూస్తున్నాడు. నళిని చకిత నయనాలతో అతని వంక చూస్తున్నది.

"నీ నాట్యం బాగానే వున్నది. కానీ యింతకంటే బాగా చేయాలంటే బస్తీలో ఎవరైనా మంచి నాట్యా చార్యునివద్ద నాట్యం అభ్యసించాలి. భగవంతు డిచ్చిన

ప్రతిభను యిక్కడ వుండి వృథాగా మట్టిపాలు చేస్తున్నావు.”
అన్నాడు పద్మనాభం.

కాంచన పద్మనాభం రెండు చేతులూ పట్టుకొని “ఈ సాయం చేశావంటే నీ మేలు జీవితాంతం మరచిపోను నాయనా! దానినేదో ఒకబడ్డు పట్టించు” అంటూ బ్రతిమాల సాగింది.

“మరి నీవు సంగీత మెక్కడ నేర్చుకొన్నావు?” అని నళిని ప్రశ్నించింది.

“ఏమి చెప్పేది! ఎంత శ్రమ పడ్డానో, ఎంతమంది గురువుల కాళ్లు పట్టుకొన్నానో, ఎన్ని ఊళ్లు తిరిగానో నీకేం తెలుస్తుంది. ఏడు సంవత్సరాలు తంజావూరులో వుండి సంగీతం నేర్చుకొన్నాను. ఇప్పుడు గూడా నేర్చుకొంటూనే వున్నాను. సముద్రానికి చెలియలికట్ట వున్నది గాని సంగీతానికి లేదు.”

“నీ విలా సంగీత విద్వాంసుడ వవుతావని నే నెప్పుడూ ఊహించనైనా లేదు? అన్నది నళిని.

“అయితే యింతకూ పెండ్లి అయిందా నాయనా!” అంటూ కాంచన అడిగింది.

“ముందు నళిని పెండ్లి కానియ్యి.” అన్నాడు పద్మనాభం నవ్వుతూ. కాంచన తన బోసినోరు చప్పరిస్తూ కూర్చున్నది.

“మీ రిరువురూ బలే జంట. ఒకరు చిత్రకారులు, ఒకరు నర్తకి; అదృష్టవంతులు.” అన్నాడు పద్మనాభం సత్యంతో.

ఆట పాట లయేసరికి అర్ధరాత్రి అయింది. కాని ఆరాత్రి ముగ్గురిలో ఎవరికీ సరిగా నిద్ర పట్టలేదు. గాలిమేడలు కడుతున్నారు.

౧౩

తెల్లవారకముందే కోడూరు జమీందారుగారి జవాను వచ్చి కాంచన తలుపు తట్టాడు. నళిని తల్లి తలుపు తెరిచింది. జవాను నళిని తల్లి చెవిలో ఏదో చెప్పి వెళ్ళిపోయాడు. ఆమె చిరునవ్వునవ్వుకొంటూ సంతోషంతో లోపలకు వచ్చింది.

నళిని యింకా నిద్రపోతూనే ఉన్నది. ఆమెకు ప్రొద్దెక్కిన దాకా పండుకొనే అలవాటున్నది. కాంచన నళినిని రోజూ ప్రొద్దెక్కిన దాకా పండుకొంటుందని విసుక్కొంటూ, గొణుక్కొంటూ, తిడుతూ లేపేది. కాని ఈ రోజు ఎంతో ఆప్యాయసంగా "అమ్మా, లే. చాలా ప్రొద్దెక్కినది." అంటూ లేపసాగింది. నళిని ప్రక్కకు ఒత్తిగిలింది. "లే. అమ్మా ! లే. నీవు చాల మంచిదానవు." అన్నది కాంచన. నళిని రెండవ ప్రక్కకు ఒత్తిగిలి ముసుగు నిండా బిగించింది.

"తొందరగా లేస్తే నిన్ను కోడూరు తీసుకుపోతాను" అంటూ కాంచన నళిని ప్రక్కనే కూర్చుని ఆమె తల నిమురసాగింది. నళిని వెంటనే లేచి కూర్చున్నది.

"ఇప్పుడు వెడదామా ? పిన్ని రమ్మని కబురు చేసిందా?" అన్నది ఉత్కంఠతతో.

"లేదు. జమీందారుగారి నౌకరు వచ్చి వెళ్లాడు. నీవు చాలా అదృష్టవంతురాలవమ్మా".

"జమీందారుగారి వద్దనుంచా!" అంటూ నళిని ముఖం చిట్లించుకొని కండ్లు నులుముకొంటూ లేచి తిన్నగా కూర్చున్నది. ఈ మాటలను సులభంగా అర్థము చేసుకోగల యీడు వచ్చిన దామెకు. ఆమెకు కులవృత్తి నచ్చదు. తల్లి

కూడా వృత్తిని గురించి బాధించేదికాదు. కాని జమీందారు గారు కబురుచేయగానే కాంచనకు మతి పోయినంత పనైనది. ఎలాగైనా నళినిని ఒప్పించాలని ఆమె తాపత్రయం. "అమ్మా మన వృత్తే యిది. నేను చేశాను. మా అమ్మ చేసింది. మా అమ్మమ్మ చేసింది. కులవృత్తి చేస్తే తప్పేమిటమ్మా. మేమంతా నీకుమల్లే ముక్కుమూసుకు కూర్చున్నామా ?" అన్నది కాంచన. కులవృత్తి మూలంగా తనకు చిన్నతనంలో జరిగిన అవమానం, ఆ గాయం యిప్పటికీ కొత్తదిగానే ఉన్నది నళినికి.

ఆమె నోటిలో ముఖంపుల్ల పెట్టుకొని దొడ్లో పడి పోయిన గోడవద్ద కూర్చుని సత్యం యింటివంక చూచింది. కాని సత్య మక్కడ లేడు. అతను దేవాలయానికి వెళ్లాడు. నళిని సాధారణంగా రెండు మూడు నిముషాలలో ముఖం కడుక్కోవడం పూర్తిచేస్తుంది. కాని యీ రోజు నోట్లోవున్న పుల్ల నములుతూ చాలసేపు అలానే కూర్చుండి పోయింది.

"స్నానం చేసి బట్టలు మార్చుకోవూ ?" అన్నది తల్లి.

"నా వొంట్లో బావుండలేదు. నేను కోడూరు రాదల చుకోలేదు. నా కేమీ వద్దు."

"ఒంట్లో బావుండక పోవడమేమిటే! ఇంతలోనే ఏమి వచ్చి పడింది? ఊరంతా తిరిగిరావడాని కే రోగమూ లేదు. ఈ కాలపు పిల్లలేమిటో మరీ హద్దుమీరి పోతున్నారు." అంటూ తల్లి గొణగ సాగింది. "సిరిరా మోకాలడ్డే మూర్ఖులెవరైనా ఉన్నారంటే ... ఏదో భగవంతు డిస్తానంటుంటే చేయి చాచి అందుకోనంటావేమే పిచ్చిదొయ్యా!"

నళిని మాట్లాడలేదు. తల్లి మాటలు వినిపించుకోన ట్లూరకొన్నది.

"సరే. మంచిది. ఇప్పటికయినా సమయం మించి పోలేదు. తరువాత నీవే పశ్చాత్తాప పడతావు. అదృష్ట శాలినికి తప్ప జమీందారుగారి దృష్టి అందరిమీదా పడు తుందటే! ఈ బ్రాహ్మల పిల్లవాడు నీకేం మాయ మంత్రం పెట్టాడే?"

"చాలు. ఇక నోరు మూసుకో." అన్నది నళిని ముఖం చిట్లించుకొంటూ.

"నోరెందుకు మూసుకోవాలే? నీవేమైనా పెట్టి పోషి స్తున్నావా?" నళిని ఏదో ఆలోచిస్తూ అలా నిలబడిపోయింది.

గత కొద్ది రోజులనుండి తల్లి వ్యవహారం మారుపుగా కనిపిస్తున్నది. ఇదివరకు ప్రతి మాటకు విసుక్కొని, తిట్టేది. ఇప్పుడు నోరును అదుపులో పెట్టుకొని ఎంతో ఆప్యాయనంగా మాట్లాడుతున్నది. ఇప్పుడు తిట్లు లేవు. సణగడం లేదు. కారణం? నళినిలో తొంగిచూస్తున్న యవ్వన వసంతానికి విలువ కట్టడమే.

నళిని దుప్పటినిండా ముసుకుతన్ని మంచముమీద పడుకొన్నది. ఆమె తల్లి వాకిట్లోకి వెళ్ళింది. ఎక్కడ సత్యం కనిపిస్తాడో తన తల్లి అతనిమీద ఎక్కడ మండి పడు తుందో నని నళిని దొంగచాటుగా చూడసాగింది. సత్య మక్కడకురాలేదు. నళిని సంతోషంతో 'అమ్మయ్య' అంటూ నిట్టూర్పు విడిచింది.

ఏ డెనిమిది గంటల సమయం. నళిని యింటిలో మెదల కుండా వున్నది. ఆమె తల్లితో మాట్లాడడం లేదు. తల్లి

ఆమెతో మాట్లాడడం లేదు. ఇంటిముందు గుఱ్ఱపుబండి వచ్చి ఆగింది. ఆ బండిలో నళిని పినతల్లి వచ్చింది. రాత్రంతా నిద్రలేనట్లు ఆమె కండ్లు చింత నిప్పుల్లా ఎర్రగా వున్నాయి. ఆమె ఎన్నడూ నగలూ నట్రా శృంగారించుకోకుండా బయటకు రాదు. కాని యివ్వాళ నిద్రమంచంమీదనుండి లేవగానే ప్రయాణమై వచ్చిందా అన్నట్లు కనిపిస్తున్నది. తలంతా రేగివున్నది. ముఖం పౌడరు గుర్తులుగూడా లేవు. ముఖం వికృతంగా కనిపిస్తున్నది. ఇంట్లో కాలుపెడుతూనే "బావున్నావా?" అని ప్రశ్నించింది.

నళిని తలవూపింది.

"నా ఆరోగ్యం బాగాలేదు." అని నళిని జవాబు చెపితే జమున సంతోషించేది. అసలలాంటి జవాబు వస్తుందనే ఉద్దేశంతోనే జమున ఆ ప్రశ్న వేసింది.

"ఏదో ఉన్నాను" అన్నది నళిని. జమున తన అక్క కూర్చుని ఉన్న గదిలోకి వెళ్ళింది. జమున మాటలలో మంచి నేర్పరి. ఈర్ష్యాక్రోధాలు పైకి కనిపించకుండా అణచిపెట్టడం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య.

అక్క చెల్లెళ్లిరువురు చాలసేపటి వరకు ఆ మాటా ఈ మాటా మాట్లాడుకొన్నారు. కాంచనగూడా కాచి వడ పోసిన మనిషి. జమున ఎంత డొంక తిరుగుడుగా మాట్లాడినా ఆమె వచ్చిన దెందుకోసమో పసికట్టింది.

"జమీందారుగారి నౌకరు వచ్చాడా?" అని అడిగింది జమున.

"రావడం వచ్చాడు." అన్నది కాంచన.

"మన నళిని..." అంటూ ప్రక్కగదిలో నున్న నళిని ఎక్కడ వింటుందోనని మెలమెల్లగా "ఇప్పుడు పెద్దమనిషి అయింది. ఈ జమీందారుగారుగూడా విలక్షణమైన మనిషి. పైకి పటారం లోన లొటారం. మోసగాడు. డబ్బూ దస్కం గూడా ఏమీ లేదు." కాంచన యీ మాటలన్నింటికి తలపూపుతున్నది. కాని ఆమె వ్రేళ్లు లెక్కపెడుతున్నది. జమున చెప్పుకుపోతూనే ఉన్నది. "పువ్వులాంటి పిల్లను ఆ పాడు జమీందారు చేతుల్లో ఎందుకు పెడతావే? దానిని నలిపి నలిపి ఆవలపారేస్తాడు. పైగా దాని ఆరోగ్యం బాగులేదట. మన పిల్ల గనక చెప్పిపోదామని ప్రొద్దున్నే ముఖమైనా కడుక్కోకుండా వచ్చాను."

కాంచన యితర విషయాల్లో తెలివి తక్కువదే కావచ్చు కాని యీ విషయాల్లో మాత్రం గుండెలు తీసిన బంటు. సువ్వంటే చాలు రోకటి పోటని గ్రహిస్తుంది. నోట్లో నుండి మాటరావటమే తరువాయి పసిగడుతుంది. కాని ఆమె మాట్లాడలేదు.

"నళిని యిప్పుడు బాగా నాట్యం నేర్చుకొన్నది. మద్రాసు తీసుకుపోయి ఏ ఫిల్ము కంపెనీలోనైనా ఎందుకు చేర్చగూడదు?" అన్నది జమున.

"చూద్దాం. ఈ కాలపు పిల్లలు తల్లుల మాటవింటారా—చేస్తారా?" అన్నది కాంచన.

జమున పగలంతా అక్కడే గడిపింది. భోజన మక్కడే చేసింది. నళినితో గప్పాలు కొట్టింది. సాయంత్రం చీకటి పడకముందే కోడూరు వెళ్లిపోయింది. పోతూపోతూ అక్కతో

యిలా అన్నది. "అక్కా! భయపడబోకు. నేను జమీందారు గారితో చెపుతాను. నళిని జబ్బుగా వున్నదని."

"నీ యిష్టం వచ్చినట్లు చెప్పు." అన్నది కాంచన. నళిని ఏదో మాట్లాడాలనుకొన్నది. కాని చిరునవ్వు నవ్వుతూ నిలబడింది.

తల్లి కూతుళ్లిరువురూ మాట్లాడుకోలేదు. కాంచన తిట్టుకొంటూ తిమ్ముకొంటూ నిద్రపోయింది.

## ౧౬

బాపినీడు కొత్తపట్నం విడిచిపెట్టిపోవడానికి కారణం ఆదినారాయణే అయినప్పటికీ యీనాడు పద్మనాభానికి ఆతిథ్య మివ్వడానికి అతనిదే ముందడుగు. ఆనాడు పద్మనాభాన్ని తన్నించి ఊరిలో నుండి వెడలగొట్టించిన ఆదినారాయణే యీనాడు పద్మనాభానికి విందు చేయడం గౌరవంగా భావిస్తున్నాడు. ధన ప్రభావం బహుశా ధనవంతులమీదే ఎక్కువగా వుంటుంది.

పద్మనాభం సన్మానానికి పది పన్నెండుమంది పెద్దల నాహ్వానించాడు. కాని చాలమంది వచ్చారు. ఒక మనోరంజన కార్యక్రమముగూడ ఏర్పాటు చేశారు. ఆదినారాయణ కుమారుడు వెంకటేశ్వర్లు యీ కార్యక్రమంలో ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నాడు. వెంకటేశ్వర్లు వయస్సు యిరవై లేక యిరవై రెండు సంవత్సరాలుంటుంది. ఇంటర్మీడియేట్ చదువుతూ నాటకాలలో పడి చదువుకు స్వస్తి చెప్పాడు. ఏదో నాటక కంపెనీలో చేరి ఊరూరూ తిరిగాడు. కాని

నాటకకళలో ప్రావీణ్యాన్ని సంపాదించలేకపోయాడు. ఇతనిలా నాటకాలలో పడి ఊరూరూ తిరగడం తల్లి దండ్రుల కెంతమాత్రం యిష్టంలేదు. కాని యీడువచ్చిన కుఱ్ఱ వాడు. వీరెంత మొత్తుకొన్నా వీరిమాట చెవినిబెట్టేవాడు కాడు. తల్లిదండ్రులు డబ్బుయివ్వడం మానేయగానే చేసేది లేక చెప్పకుండా మద్రాసు పారిపోయాడు. ఫిలింకంపెనీల చుట్టూ కాలుకాలిన పిల్లిలా తిరిగాడు. కాని ఎక్కడా దారి కనిపించలేదు. పూటగడవడమే కష్టమైపోయింది.

తుట్టతుదకు ఆదినారాయణకు దయకలిగింది. ఆయన కొడుకు కోర్కె నెరవేర్చడానికి ప్రయత్నాలు సాగించాడు.

పద్మనాభం సిఫార్సుమీద దస్యఫిలిం నిర్మాత ఒకరిని తన ఫిలింలోకి తీసుకొంటాడని ఎవరో చెప్పగా విన్నాడు. ఆదినారాయణ అందుకే యీనాడు పద్మనాభానికీ సన్మానం చేస్తున్నాడు. దస్యఫిలిం నిర్మాతవద్ద పద్మనాభానికి మంచి పలుకుబడి వున్నదనిగూడా విన్నాడు.

వెంకటేశ్వర్లు నాలుగైదు నాటకాలలో వేషాలువేశాడు. అతని రూపురేఖలు సరిగావుంటే అతని అదృష్టం మరోలా వుండేది. తారులాంటి శరీరచ్ఛాయ, చప్పిడిముక్కు, దట్టమైన కనుబొమ్మలు, చిన్న చిన్న కళ్లు, మొరటైన పెదవులు, ముందుకు పొడుచుకొనివచ్చి బయటకు కనిపిస్తున్న పలువరుస. అయినా "సినీ కళాకారుణ్ణి కావా"లనే ఆకాశన్నంటుతున్న కోర్కె. అదితప్ప మరొకటి కావాలనే కోర్కె అతనికిలేదు.

నళినిని తీసుకొని వెంటనే రావలసినదిగా కాంచనకు కబురుపంపించా డాదినారాయణ. కాంచన ఆదినారాయణ

యిస్తానన్న మాటపదహారురూపాయల బహుమతి యింతవరకు వసూలుచేయలేకపోయింది. ఈమాట వినగానే తిరిగి ఆశ పుట్టింది. పరిస్థితుల ప్రాబల్యానికి లోనై మనిషి ఏపనిచేయడానికైనా సిద్ధపడతాడు. తిరిగి నళిని తల్లి నళినితల్లి అయింది. ఆమె నళినిని వెంటబెట్టుకొని ఆదినారాయణయింటికి వెళ్లింది.

పద్మనాభం అంతకుముందే సత్యాన్ని వెంటబెట్టుకొని వచ్చాడు. సత్యం తండ్రిగూడా ఆహ్వానితులలో వొకడు. సత్యమిప్పుడు తన స్వభావానికి విరుద్ధంగా ఏదో ఉదాసీనంగా సంచరిస్తున్నాడు. తండ్రి చెప్పిచెప్పి విసిగిపోయాడు.

వెంకటస్వామి తన తబలాతో సిద్ధమైనాడు. పద్మనాభం చేతిలో వేణు వున్నది. ఊరిలోని ఉత్సాహవంతులు ఒకరు మృదంగం, మరొకరు పిల్లనగ్రోవి తెచ్చారు. ఆ పాడుబడిన గ్రామంలో సంగీత రసతరంగిణి ఉప్పొంగి ఉరకలు వెట్టింది.

పద్మనాభం ఫ్లూట్ మీద రాగాలాపన చేసి కీర్తన ఎత్తుకొన్నాడు. నళిని లయానుగుణ్యంగా నాట్యం చేస్తున్నది. సత్యం తన్మయత్వంతో ఆమె భావభంగిమలను తిలకించాలని ఉవ్విళ్లూరుతున్నాడు. కాని దర్శకుడు అప్పుడప్పుడూ అరిచేవాడు. 'కట్' అని ఈలవేసేవాడు. సత్యం అతనివంక కోపావేశంతో చూచి అంతలో తలవంచుకొని కూర్చునేవాడు.

ఇలా చాలసేపు నడిచింది. పద్మనాభాన్ని ప్రశంసించారు. పద్మనాభానికి సంగీతంలో ఎంతవరకు ప్రవేశమున్నదో ఎవరికీ తెలియదు. కాని అతని కంఠంలో మాధుర్యమున్నదనడానికి సందేహం లేదు. చాల గంభీరంగా, మధు

రంగా, స్పష్టంగా, స్వాభావికంగా వుంటుంది. "నిరస్తపాద ప్రదేశే హేరండేపి ద్రుమాయతే- ఏవీ లేనిచోట ఆముదపు చెట్టే కల్పవృక్షం"

ప్రేక్షకులంతా అతనిని 'వహ్వా, వహ్వా' అని మెచ్చుకొన్నారు. ఆదినారాయణ అతని మెడలో పెద్ద పూలమాల వేశాడు. వెంకటేశ్వర్లు సాష్టాంగ దండప్రణామంచేసి శిష్యుడు కావలెననే కోర్కెను వెల్లడించాను. ఈ సన్మానోత్సవంలో పడి నళిని నెవరూ గమనించలేదు. అయినా ఆమె స్థానీయురాలు, పైగా వేశ్య.

ఆదినారాయణ పరిచితుల చెవిలో మెల్లగా యిలా అన్నాడు. "ఈ యిరువురకు యీడూ జోడూ బాగా కుదిరింది. ఒకరు గాయకులు, ఇంకొకరు నర్తకి" అని. ఈ మాట కాంచన విన్నది. "మీరు చెప్పేది బాగానే వున్నది. కాని నా మాట యిది వింటేనా?"

"నళిని నాట్య మెలా గున్న" దని ఆదినారాయణ పద్మనాభా న్నడిగాడు.

"సీతాకోక చిలుకలా నాట్యం చేసింది." అంటూ దూరంగా జరిగి సత్యం వద్దకుపోయి సత్యంతో "సీతాకోక చిలుక! కాని ప్రతి పూవుమీదా వాలదు. దానికి నీ వొక పుష్పానివి." అన్నాడు. ఇరువురూ నవ్వుకొన్నారు. సత్యం నవ్వులో కృత్రిమత గోచరించింది. "అరే బ్రదర్! ఇక్కడ వృథాగా కాలం ఎందుకు పాడుచేసుకొంటావు? మద్రాసు తీసుకురా?" అన్నాడు పద్మనాభం.

"అవును, నిజమే! కాని నీవు మా వెంకటేశ్వర్లుకుకూడా కాస్త సహాయ పడాలని నా కోరిక. అతను నాట్యమన్నా, సినిమాలన్నా, సంగీతమన్నా పడిచస్తాడు. ఏ సినిమాలోనైనా కాస్త వాడిని యిరికించు." అన్నాడు ఆదినారాయణ.

"మీరుగూడా యిలా అంటారని నేననుకోలేదు. మీకు భగవంతుడు కావలసినంత భోగభాగ్యాలిచ్చాడు. మీరు స్వయంగా ఒక ఫిల్ము కంపెనీ పెట్టవచ్చు. లక్షకు రెండు లక్షలు ఖర్చు పెట్టగలరు. మీ వెంకటేశ్వర్లు మీ కంపెనీలోనే పనిచేయవచ్చు." అంటూ పద్మనాభం సలహా అయితే యిచ్చాడు. కాని వెంకటేశ్వర్లుని చూచి లోలోపల నవ్వుకొన్నాడు.

ఆదినారాయణ పద్మనాభాన్ని భోజనాని కాహ్వానించాడు. సత్యమూ, నళిని యిరువురూ, మౌనంగా, విచారంగా, విహ్వలచిత్తులై అలా తిరిగివద్దామని దేవాలయం వైపు వెళ్లారు.

## ౧౭

**ఆ**దినారాయణ పద్మనాభాన్ని రైలుస్టేషనుకు పంపించడానికై తన స్వంత రెండెడ్ల బండి కట్టించాడు. తాను స్వయంగా యింకొక బండిలో ఎక్కాడు. అతని వెంట అతని కుమారుడు వెంకటేశ్వర్లు గూడా వున్నాడు. ఇంకా యిద్దరు ముగ్గురు గ్రామస్థులు గూడా వున్నారు. వెంకటస్వామిగూడా తన లాటీ భుజాన పెట్టి బండ్ల వెనుకే నడిచి వస్తున్నాడు. సుబ్బారావు తప్ప అతని వెంట పాతముఠావాళ్లెవరూ లేరు.

బాపినీడు తాను స్వయంగా బండి తోలాలనుకొన్నాడు. కాని కొడుకు ఆయనను విశ్రాంతిగా కూర్చోమని చెప్పాడు. కాని అతను ఆదినారాయణతో పాటు ఒకే బండిలో కూర్చోవడానికి సాహసించలేకపోయాడు. అందుచే వెంకటస్వామితో పాటు నడచి రాసాగాడు.

సత్యాన్ని పద్మనాభం తీసుకొని వచ్చాడు. ఎవరైతే ఆతనిని చిన్నతనంలో పిల్లి, కుక్క అని ఆటలు పట్టించారో వారే నేడు అతనిని ఆశ్చర్యంగా చూస్తున్నారు. పద్మనాభానికి బస్తీ నాగరికత ఒంట బట్టింది. అతని మాటలలో ఒక విధమైన నాజూకు వున్నది. ఇప్పుడతను వాగుడుకాయ కాదు. ప్రతి మాటా తూచినట్లు మాట్లాడుతాడు. మంచి ప్రవీణుడైన కళాకారునిలా పోజులు పెడతాడు.

పద్మనాభం ఎంతో ఆత్మీయంగా మాట్లాడినప్పటికీ సత్యంలో పరివర్తనరాలేదు. మొదట్లో ఎలా వున్నాడో అలానే వున్నాడు. వచ్చిన మార్పేమిటంటే సత్యం నేడు పద్మనాభంతో మాట్లాడుతున్నాడు. అంతే. లేకుంటే అతను యింట్లోనే కూర్చునేవాడు. పద్మనాభమే అతనిని అన్ని చోట్లకు ఈడ్చుకుపోతున్నాడు. సత్యం కాదనలేక పోతున్నాడు.

కోడూరు స్టేషను వద్ద పద్మనాభాన్ని చూడడానికి జనం గుమిగూడారు. కొంతమంది అతని పాత స్నేహితులు, కొంతమంది సినిమా పిచ్చివున్నవాళ్లు, కొంతమంది గుంపును చూచి యిక్కడేదో తమాషా జరుగుతున్నదని ప్రోగయిన వారు. రైలురావడాని కింకా ఆలస్యమున్నది. పద్మనాభం సత్యాన్ని వేరుగా తీసుకొనిపోయి యిలా అన్నాడు. "అరే భాయీ! నేడు నా బాల్య స్నేహితుడివి నీవే మిగిలావు.

చిన్నతనంలో కొట్టుకొనే వాళ్లం. తిట్టుకొనే వాళ్లం. అవన్నీ ఇప్పుడు మరచిపో. అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూవుండు. ఏం? వ్రాస్తావా లేదా?"

సత్యం మాట్లాడలేదు. అతడు అన్యమనస్కంగా ఏదో ఆలోచిస్తున్నాడు.

"అరే! ఏమిటి ఆలోచిస్తున్నావు? వ్రాస్తావా? మిగిలిన వాళ్ళంతా గుమాస్తాలుగా, నౌకర్లుగా ఏడుస్తున్నారు. నీ వొక్కడవే మిగిలావు. నీ కోరికగూడా నెరవేరుతుంది."

సత్యం అతనివంక చూచి చిరునవ్వునవ్వాడు.

"ఈ రెణ్ణాళ్ళ జీవితమూ ఆఫీసులలో కుర్చీలు విరగ గొట్టడానికి, తెల్ల కాగితాలమీద కూడికలు, తీసివేతలు అనే చిలిపి ముగ్గులు పెట్టడానికి కాదురా బాబూ! పుట్టుకతోనే ప్రతి మనిషికి ప్రతిభ అంటూ పెడతాడు భగవంతుడు. ఆ ప్రతిభను పూర్తిగా వినియోగంలోకి తెచ్చుకోవడమే జీవిత లక్ష్యం."

"బాల్యంలో నీ వే సభలోనూ ప్రేక్షకునిగా గూడా కూర్చోలేదనుకొంటాను. కాని యిప్పుడు నీవు మంచివక్త వయినట్లుగా కనిపిస్తున్నావు." అన్నాడు సత్యం.

ఒకరి చేతు లొకరు పట్టుకొని యిరువురూ నవ్వ సాగారు. నవ్వుతూ, నవ్వుతూ పద్మనాభం యిలా అన్నాడు. "ఉపదేశ ప్రభావం అధికంగా..." చెపుతూ చెపుతూ ఏదో తప్పుచేస్తున్న వానిలా పద్మనాభం ఆగాడు. "కాని నేను చెపుతున్నది ఉపదేశంకాదు. నిజం."

సత్యం మాట్లాడలేదు.

"ఏ వృత్తితో మన జీవనం గడుస్తుందో అదే మంచిది. నీకు చిత్రలేఖనమంటే సరదా. మరి ఆ సరదా నీ జీవితాన్ని గూడా పోషించాలి. కూపస్థమండూకంలా ఈ గ్రామంలోనే వుంటే విశాల ప్రపంచాన్ని చూడలేవు. ప్రపంచం నిన్ను చూడలేదు. ఇప్పటికైనా యీ ప్రాచీన శిథిలాలను విడిచి పెట్టు. ప్రాచీన శిథిలాలలో ఎవరుంటారో తెలుసా? గుడ్లగూబలు, గబ్బిలాలు". పద్మనాభం నవ్వసాగాడు. "వెళ్లగానే ఉత్తరం వ్రాస్తాను; మద్రాసు వచ్చేయి. రైలు వచ్చే వేళయినది." అతను మిగతావారితో లాంచనంగా మాట్లాడ సాగాడు.

రైలుబండి వెళ్ళిపోగానే ఆదినారాయణ ఒంటరిగానే తన బండిలో కొత్తపట్నం వెళ్లుతున్నాడు. అతని కుమారుడు పద్మనాభం వెంట వెళ్లాడు. రెండవ బండి ఖాళీగానే వస్తున్నది. కాని సత్యాన్ని తనతోపాటు బండిలో రమ్మని పిలవనుగూడా లేదు.

అడుగులు తడబడుతూ తడబడుతూ అటు తిరిగి ఇటు తిరిగి సత్యం సాయంకాలానికి యింటికి చేరాడు. కోడూరులో అతను కాగితాలు, రంగులు వగైరాలు కొన్నాడు. అతను తిరిగి తన పనిలో నిమగ్నమవాలనుకొన్నాడు. అతని చేతిలో పని వున్నంతవరకు ఎవరైనా తనతో మాట్లాడుతారా? మాట్లాడరా? అనే విషయాన్ని గమనించడు.

అతను వేపచెట్టు క్రిందకు వెళ్లాడు. కాని నళిని యింటి ముందెవరూ కనిపించలేదు. గోడదూకి పడిపోయిన యిటుక రాళ్ళ గుట్టమీద నిలిచి అటూ ఇటూ చూచాడు. అక్కడా

ఎవరూ కనిపించలేదు. ఇంటిలో ఎవరూ పాచి ఊడ్చిన పాపానగూడా పోలేదు. కుండపెంకులు చెల్లాచెదరుగా పడి వున్నవి. కోళ్లు కాళ్ళతో చిమ్ముతూ అందులోని మెతుకులు ఏరుకు తింటున్నవి. అతను నళిని యింటిగోడ వద్దకు వెళ్లాడు. ఇంటి వెనుక వాకిలి మూసియున్నది. అతని మెదడుకి దెబ్బ తగిలింది.

అతను రోడ్డుమీదకు వెళ్లాడు. నళిని యింటికి తాళము వేసివున్నది. వాకిళ్లు, కిటికీలు అన్నీ మూసివున్నవి. బయట గూడా ఎవరూ కూర్చుని లేరు. సత్యాని కేమీ అర్థంకాలేదు. 'ఉదయం తాను కోడూరు వెళ్ళినప్పు డంతా సరిగానే ఉన్నది. ఇంతలో ఏమి జరిగింది?'

ఈ ఆలోచనలతో అతను తనయింటివరండాలో కూర్చు న్నాడు. కొంతసేపైన తరువాత నారాయణబాబా చుట్ట కాలుస్తూ అటువచ్చాడు. సత్యం విచారంగా వుండడంచూచి పరిహాసమాడాలని ప్రయత్నించాడు నారాయణబాబా. "పాపం నళినికొరకు కనులు కాయలుకాచేలా ఎదురుచూస్తున్నావులా వుంది. నాలుగైదురోజులు విరహంతో బాధపడాలి, తప్పదు. నాయుడు చనిపోయాడు అందుకని కాంచన నళినిని తీసుకొని ఆగ్రామంవెళ్లింది" అంటూ నారాయణబాబా వెళ్లిపోయాడు.

అయిదారు నిముషాల్లో సత్యంబుఱ్ఱలోకి ఎన్ని ఊహాలు వచ్చినవో చెప్పలేం ... అతనిఊహల్లో ఒకదానిలో అతను నళిని కోడూరు ఆస్పత్రిలో వున్నట్లు ఊహించాడు. చిరునవ్వు నవ్వి వెనుకవైపున్న వేపచెట్టుక్రింద బైఠాయించాడు.

౧౮

సత్యానికేమీ తోచడంలేదు. నళిని ఊరిలోవుండి అతనికంటికి కనిపించకపోయినా తనపని తాను చేసుకోగలడు. ఆమె లేనికారణంగా అతనిమనసు దేనిమీదా లగ్నంకావడం లేదు. కనులు మూసినా, తెరచినా ఆమెమూర్తే కంటికి కనిపిస్తున్నది.

అతను షికారుకి బయలుదేరాడు. దిబ్బమీదనున్న జీడిమామిడి చెట్టుక్రింద పెద్దగుంపు చేరి గప్పాలు కొడుతున్నారు. నారాయణబాబా గొంతు అన్నిటికంటె పెద్దదిగా వినిపిస్తున్నది. అతను కోతలు కోస్తున్నాడు. "వయసులో వున్నప్పుడు దేశమంతాతిరిగాను. ఎవరిమూటలో ఏమున్నదో నాకు తెలుసు".

సత్యంగూడా దూరంగా ఒక దిబ్బమీద కూర్చున్నాడు. అతనివదనంలో ఉదాసీనతా, ఖిన్నతా గోచరిస్తున్నాయి. నారాయణబాబా యింకా చెప్పుకు పోతూనే వున్నాడు. "నాయుడు చచ్చాడని విన్నాను. పాపం కాంచన యిప్పుడేమి చేస్తుంది."

"నీవుంటే దానికి తక్కువేమిటి నారాయణా!" అన్నాడు రామయ్య నవ్వుతూ. నారాయణబాబాగూడా చుట్ట చుట్టుకొంటూ ముఖం పైకి పెట్టి కిలకిలా నవ్వాడు. "అరే నాయనా! మా రోజులు గడిచిపోయాయ్. పళ్ళుగూడా ఊడి పోయినవి. దవడలవెంట చొంగగూడా కారుతున్నది." అంటూ బిగ్గరగా నవ్వాడు.

"ఆ మెకు నాయుడువల్ల మాత్రం లాభ మేమిటి?" అన్నాడు రామయ్య.

"అది యిప్పటిమాట. ఇదివరకు ఉన్నదంతా దానికి దోచిపెట్టి గుణ్ణమయ్యాడుపాపం. యవ్వనంలో కాంచన ఎంత నాటకమాడేదో నీకు తెలుసా? పాపం నాయుడు రూపాయల వర్షం కురిపించేవాడు. అయినా ఏదో వంకపెట్టి అతనివద్ద ఇంకా డబ్బు గుంజుతుండేది. ఆపాపపుడబ్బు దీనిదగ్గర మాత్రం నిలిచి యేడ్చిందా? కాని యిప్పుడుమాత్రం దానికేం?" అంటూ బాబా చుట్ట ముట్టించి—"వేశ్య అరటిచెట్టులాంటిది. పెద్ద చెట్టు చావకముందే పిలక వేస్తుంది." అంటూ బాబా సత్యం వంక చూచాడు. ఈ మాటలకు సత్యానికి కోపం వచ్చింది. బాబా చెప్పుకు పోతూనే వున్నాడు. "ఏం? కూతు రున్నది నళిని. విరిసిన పూవు. అద్భుతంగా నాట్యం చేస్తుంది. నళిని ఉన్నంతవరకు కాంచనకు కూటికి కొదవలేదు." సత్యం నారాయణబాబా వంక తీక్షణంగా చూడసాగాడు. అతను వయస్సులో పెద్దవాడు. అతనితో పోట్లాట పెంచుకోవడం గూడా సత్యాని కిష్టం లేదు. నారాయణ బాబా చెప్పుకు పోతూనే వున్నాడు. "నళిని తత్వం ఫిరాయించింది. ఒక బ్రాహ్మణ యువకుణ్ణి ప్రేమించింది. అతనంటే ప్రాణా లర్పిస్తుంది. ఎప్పుడైతే కూటికి కరువౌస్తుందో అప్పు డన్ని పూవులమీద వ్రాలి మకరందాన్ని సేకరించడం నేర్చుకొంటుంది." సత్యం అక్కడనుండి లేచి వెళ్లాలనుకొన్నాడు. చేతుల మట్టిగూడా దులుపు కొన్నాడు. కాని యింతలో ఏమి తోచిందో అత నక్కడే కూర్చున్నాడు.

"కోడూరు వేశ్యలకు నివాస స్థానము. సందుగొందుల్లో ఎక్కడ చూచినా వారు వాకిట్లో కూర్చుని కనిపిస్తారు. కాని యిప్పుడా రోజులు పోయాయి. ఇది వెనుకటి రోజుల మాట. వీరిలో చాలమంది మద్రాసు వెళ్లిపోయారు. మిగిలిన వారి వంక చూచేవారే లేరు." అన్నాడు నారాయణబాబా చుట్ట పొగ వొదులుతూ. అతను చుట్ట ఆరిపోకుండా చూచుకొంటూ మాట్లాడుతూనే వున్నాడు. వినేవాళ్లకు అతని నెవరో బాణంతో పొడుస్తుంటే గోండ్రు పెడుతున్నట్లుగా వున్నది. ఇందుకే అతనికి చాలమంది శత్రువులూ వున్నారు, మిత్రులూ వున్నారు. బ్రాహ్మణులంటే అతనికి అసహ్యం.

"అరే విన్నారా? ఇప్పుడీ మాటకు గూడా రెక్కలొచ్చాయి. వేణుగోపాల్ ముండలముఠా కోరైనాడట. నెలలో పదిహేను రోజులు కోడూరులోనే వుంటున్నాడట. ఈ దొంగ భక్తులు కొంపలు తీసేవారిలా తయారవుతారు. రామనామం జపిస్తూనే గొంతులు కోస్తుంటారు. ఆడపిల్లలతో తిరగకుండా ఎవరాటంక పెట్టారు? ఈ కపటనాటకాన్ని అరికట్టిన దెవరు? అంటరానివారిని చూచి అల్లంతదూరంగా తొలగి పోతారు. వారి గాలి సోకినా మైలబడి పోతామంటారు. మరి ఆ మహనీయులు చేసే పనే యిది. ఎవరైనా అడిగితే 'కృష్ణభగవానునికి గూడా పదహారు వేలమంది గోపికలున్నా'రని జవాబిస్తారు. కాని కృష్ణుడు కపటి కాడు." సత్యం గూడా లోలోపల నవ్వుకొన్నాడు.

"వేణుగోపాలానికి వయసు ముదర లేదనుకొంటాను?" అన్నాడు రామయ్య.

"నీవు గూడా పాలుత్రాగే పాపాయివే! నూనె లేక ఆరిపోబోయేముందు దీపం టపటప లాడుతుంది. నూనె నిండా వుంటే జ్యోతి నిశ్చలంగా, కాంతిగా వెలుగుతుంది. తెలిసిందా ?" అన్నాడు నారాయణబాబా.

రామయ్యకు ముప్పయి, ముప్పయిరెండు సంవత్సరాలుంటాయి. ఐదెకరాల పొలమున్నది. పనిపాట లున్నప్పుడు పనిపాటలు చేస్తాడు. ఖాళీగా వున్నప్పుడు బడాయిలు కొడతాడు. అల్పసంతోషి. బాబాతో గాఢమైన స్నేహమున్నది. బాబాయే కాకుండా అతని స్నేహితులింకా యిద్దరక్కడున్నారు.

"ఆ ఆదినారాయణ యీ కుజ్జవానినైతే (సత్యంవంక వ్రేలుపెట్టి చూపింమతూ) బహిష్కరించాడు. మరి ఆ వేణుగోపాలరావును ఏం చేస్తాడో ?"

"ఏమి చేస్తాడు ? తోకపట్టుకు ఊరేగుతాడు. ఈ మనిషి గూడా దిట్టంగావున్నాడు." నారాయణ బాబాకు ఆదినారాయణంటే సరిపడదు. ఆదినారాయణ బ్రాహ్మణ పక్షపాతి. గుడిలో పూజా పునస్కారాలు గూడా యితని సహాయం వల్లనే జరుగుతవి. ఆదినారాయణ దేవాలయ ధర్మకర్త గూడా. "ఇప్పుడు పద్మనాభాన్ని గూడా వలలో వేసుకొన్నాడనుకొంటా. ఒకప్పుడతని తండ్రినితిట్టి గ్రామంలో నుండి వెళ్ళగొట్టాడు. ఇప్పుడు కొడుకుని పూజిస్తున్నాడు. ఎందుచేతనంటే పద్మనాభం సూటూ బూటూ వేసి బస్తీ కుజ్జవాడైనాడు. చిన్నతనంలో ఊళ్ళోవాళ్ళను మంచినీళ్ళు త్రాగనిచ్చాడా ? ప్రాణాలు తీశాడు."

"మనిషి మారుతుంటాడు బాబా!" అన్నాడు రామయ్య.

"అరే కులం మారుతుందా? మారదు. కాసేపు వెచ్చగా, కాసేపు చల్లగా వుండచ్చు. కాని క్షణక్షణానికి నీటి స్వభావం మారుతుందా? సరే, చాల ప్రొద్దెక్కినది. పదండి భోజనాలకు వెడదాం." అన్నాడు బాబా.

"బాబా! ఆదినారాయణ ఏదో మిషను తెస్తున్నాడు. నీకు తెలుసా? అది గంటలో యిరవై ఎకరాలు దున్నుతుం దట. ఎడ్లూ, నాగలీ ఏవీ అక్కర లేదట" అన్నాడు రామయ్య.

"తేకేం, తెస్తాడు. ఏది తెచ్చినా అతని మేలుకే. గోమాతను అనాదరణ చేసిన పాపం అనుభవిస్తాడు. మనకేం? చూస్తూవుందాం ఏమిజరుగుతుందో!" అంటూ బా బాముతాతో పాటు యిండ్లకు వెళ్లారు.

సత్యం విచారంగా అక్కడే కూర్చుని వున్నాడు.

## ౧౯

రోజులు గడిచాయి. నళిని, ఆమె తల్లి తిరిగి యింటికి వచ్చారు. నాలుగైదు రోజులు కాంచన చీదేస్తూవున్నది. తరువాత యథాపూర్వకంగా తన పనులు తాను చేసుకో సాగింది. కాంచన యింటికి వచ్చే పోయేవారి సంఖ్య పెరిగింది. వెనుకటికీ యిప్పటికీ వున్న తేడాయిదే. ఆదినారాయణ గూడా అనేక పర్యాయాలు వచ్చాడు. ఒక పర్యాయం పాతిక రూపాయ లిచ్చాడు. రెండవ పర్యాయం యాభై. ఆయన యిస్తానన్న నూట పదహార్లు 'వాయిదాలమీద చెల్లిస్తున్నాను.' అని చెపుతున్నాడు.

"పాపం! ఇప్పుడు నాయుడుగూడా లేడు కాబోలు. డబ్బు కేమైనా అవసర మొస్తే అడిగి తీసుకో. కబురు పంపితే చాలు కావలసిన డబ్బు పంపుతాను" అని ఆదినారాయణ కాంచనతో అంటూ దృష్టి నళినిమీద నిలిపాడు. ఈ మాటలు సత్యం చెవిన పడినవి.

నళిని కిదంతా యిష్టంలేదు. ఎప్పుడైతే పినతల్లి వచ్చి నిప్పులు చెరిగిందో నళిని కండ్లు తెరిచింది. "నేను మీ జమీందారుని సరిగా చూడనైనా లేదు" అన్నది. నళిని యవ్వనం నానాటికి భయపడిన జెర్రిలా పరుగులు తీస్తున్నది. అది చూచి ఈర్ష్య, అసూయ చెందేవారి సంఖ్యగూడా పెరుగుతున్నది.

రాత్రింబవళ్ళు కాంచన నళినిని సతాయిస్తున్నది. అన్నంలేని పూటల్లా నళినిని తిడుతున్నది. అదనీ, యిదనీ, ఏవేవో మాటలంటుంది. ఎవరైనా యింటికి వస్తే పాటపాడమనీ, నాట్యం చేయమనీ వేధిస్తుంది. నళిని యివన్నీ పెడచెవిని పెట్టేది. ఆగంతుకులు నిరాశతో వెళ్ళిపోవలసి వచ్చేది. జమీందారుగారిదృష్టి నళినిమీద పడాలని కాంచన కోరిక.

తల్లిపోరు పడలేక నళిని సత్యంతో మామూలుగా మాట్లాడుతుండేది. సత్యంగూడా యిప్పుడు ప్రశాంతంగా వుంటున్నాడు. అతను గీసినవి రెండు మూడు చిత్రాలు ప్రసిద్ధ పత్రికలలో ప్రచురింపబడినవి. అందుచే అతని ఉత్సాహం ఉరకలు వేయసాగింది. ఉదయం బొమ్మలు గీచేవాడు, సాయంత్రం నళినితో కాలంగడిపేవాడు,

ఒక రోజు నళిని తల్లితో పోట్లాడుతున్నది. వారు పోట్లాడుకోవడం చూచి షికారుకు బయలుదేరాడు సత్యం. నళినిని గురించి అతని కెప్పుడూ విచారమే...ప్రేమ...చిర సంగిని ... ఈర్ష్య గంతులు వేయసాగింది. కళ అనే పరదా అరిగి అరిగి పలుచబడసాగింది. అతడు చాల సేపటివరకు బీచి వొడ్డున షికారుకొడుతూ గడిపాడు. చీకటి పడింది. ఆకాశంలో నక్షత్రాలు ప్రకాశిస్తున్నవి. అతడు చంద్రోదయాన్ని చూస్తూ రాత్రి ఎనిమిది తొమ్మిది గంటలవరకు గడిపాడు.

సత్యం యింటికి చేరగానే నళిని వాకిటిముందు కారాగి వుండడం చూచాడు. నళిని యింటిలోనుండి ఝుక్, ఝుక్ మనే కాలిగజ్జెలమ్రోత తకధిం తకధిం అనే మద్దెల మ్రోత వినిపిస్తున్నాయి. ఎవరో పాడుతున్నారు గూడా. సత్యం ఆ కారుని చూడకుండావుంటే యీ విషయాన్ని గూర్చి బహుశా ఆలోచించేవాడే కాడు. ఆ గజ్జెలమ్రోత కతడు నిర్జీవ ప్రతిమలా అలా నిలబడిపోయాడు.

కొంతసేపటికి సత్యం తన యింట్లోకిపోయి కిటికీ తలుపు తెరిచాడు. నళిని యింటి కిటికీ గూడా తెరిచే వున్నది. కోమూరు జమీందారుగారు, నలుగు రైదుగురు పరివారము, ఆదినారాయణ సభ తీరి వున్నారు. ఇంట్లో సెంటు వాసనలు గుభాళిస్తున్నవి. ఆ వాసనలు గాలి వాలున సత్యానికి గూడా తగులు తున్నవి. ఈ దృశ్యాన్ని చూడలేకపోయాడు సత్యం. కిటికీ మూశాడు. తండ్రి భోజనంచేసి వరండాలో పడుకొని గురకలు పెడుతున్నాడు.

సత్యం యీ విషయాన్ని మరచి పోవాలని ప్రయత్నించాడు. కాని అతని మెదడులో నళినే మెలికలు తిరుగుతున్నది. ఇతరులముందు నాట్యం చేయకూడదని తాను మాత్రం ఎలా చెప్తాడు? తానే ఆమెను నృత్యం చేయమని ప్రోత్సహించాడు. నృత్యం సామాజిక కళ.

"కాని నా ఉద్దేశ మదికాదు." అతడు ఆలోచించ సాగాడు. "ఈ కామోద్రేకుల నీ యింటికి ఎందుకు రానివ్వాలి? నళిని తల్లి వేశ్య. నళిని తల్లి మాట వింటుందా? లేక నా మాట వింటుందా? ఇంట్లో మగదిక్కు లేదు. ఆదాయం వచ్చే మార్గ మంతకన్నా లేదు...అయితే మాత్రం యీ నీచుల ఎదుట తన నృత్య కళను ప్రదర్శించి పొట్ట పోసుకొంటుందా? తల్లి వేశ్య అయితే, కావచ్చు. నళిని మాత్రం వేశ్య కాదు...కాని..."అతనేదీ నిశ్చయింపలేకపోయాడు... అతని భావాలు త్రాడు పేని నట్లుగా మెలికలు పడుతున్నాయి. అతని మనస్సు స్థిరంగా లేదు.

సత్యం కిటికీ తెరిచాడు. సభికుల ముఖాల్లో ఆనందం తాండవిస్తున్నది. నళిని నాట్యం చేస్తూనే వున్నది. ఆమె పద విన్యాసంలో మంచి స్ఫూర్తి వున్నది. విలువైన వస్త్రాలు ధరించి వున్నది. బహుశా ఆ వస్త్రాలు జమీందారుగారు తెచ్చి వుంటారు. కాంచన అతిథులకు తాంబూలము, సిగరెట్లు యిస్తున్నది. కొంతసేపటికి ఆదినారాయణ వెళ్ళిపోయాడు. కోడూరు జమీందారు, పరివారం మాత్రం మిగిలారు.

సత్య మిది సహించలేకపోయాడు. ఇంటికి నిప్పు పెడదామా అన్నంతవరకు పోయాడు. జమీందారుని చెవిపట్టుకొని

బయటకు గెంటుదామా? కాని అతనక్కడ నుండి కదల లేక పోయాడు, అతని ఊహ నళిని మీదకు మరలింది. నళినికి యిష్టం లేక పోతే వారీమె చేత బలవంతంగా నాట్యం చేయిస్తారా? ఆమె అంత ఉత్సాహంగా నాట్యం చేస్తుందా?

అతను యింటిలో కూర్చోలేక పోయాడు. దేవాలయం వైపు బయలు దేరాడు. సముద్రంలా అతని మనసులో ఆటుపోటులొస్తున్నాయి. వెన్నెల విరిసింది. సముద్రుడు ఉత్తుంగ తరంగ పంక్తులతో ఘోషపెడుతున్నాడు. అతను దేవాలయపు పడిపోయిన ప్రాకారం మీద కూర్చున్నాడు.

కాలం గడుస్తున్నది. కాని అతని కనులకు నిద్రరావడం లేదు. అతనిబుఱ్ఱలో ఏమేమి ఆలోచనలు మెదులుతున్నవో! "నళినిగూడా వేశ్యకూతురే. వేశ్యకూతురు వేశ్యకాకమరేమవుతుంది? నా కామెతో ఎలాంటి సంబంధమూ లేదు. లోకులు నన్ను పిచ్చివాడంటారు, మూర్ఖుడంటారు. ఇంతేనా? కాదు—కాదు... నేనేమిచేయాలి?"

అతనీ ఆలోచనలతో కొట్టుకొంటున్నాడు. అతని ఆలోచనలు ఒకప్రక్కనుండి మరొకప్రక్కకు ఒత్తిగిల్లినవి. "ఆమె నాట్యం చేస్తున్నది, మంచిదే. నాట్యం చేయబోతున్నానని నాకెందుకు చెప్పలేదు? ఇందులో ఏదో కుట్రవున్నది." అని అనుకొంటూ అతను గోడమీదినుండి దిగి దేవాలయ ప్రాంగణంలోకి వెళ్లాడు.

"వారక్కడ యింట్లో ఏమేమి చేస్తున్నారో తెలియదు. కాంచన ఆనందానికి మేరలేకుండా వుండివుంటుంది. వలవేసి చేపను పట్టడంలో ఆమెకు ఆమే సాటి. నళిని పాలుత్రాగే

పిల్లగాదే. తెలివైనపిల్ల. యౌవనవతే. "ఈ పని నాకిష్టంలేదని తల్లితో ఎందుకు చెప్పదు? ఇరువురూ కుమ్మక్కై కాదా? ఇక నళిని ముఖం చూడను." అంటూ అతను మండపంలో పండుకొని నిద్రపోవాలనుకొన్నాడు.

కొంతసేపయినతరువాత లేచి కూర్చున్నాడు. "నేను నళినితో స్పష్టంగా చెపుతాను. ఈ వేషాలు నావద్ద పనికి రావని. కాని ఆమెముఖం నాకు చూపిస్తుందా? ఒకవేళ చూపించినా ఆమెతో యీమాట అనగలనా?" ఈ ఆలోచనలలో పడి కొట్టుకొంటున్నాడు. చంద్రుడు ఆకాశంలో పైపైకి ప్రాకి వస్తున్నాడు. సముద్రుడాతనిని చూచి సంతోషంతో పొంగిపోతున్నాడు. చంద్రున కిదంతా పట్టిందా? తనదారిన తాను సాగిపోతున్నాడు. చంద్రునిలోగూడా ఏదో సభ జరుగుతున్నట్లు, గజ్జెలమ్రోత వినిపిస్తున్నట్లు తోచింది సత్యానికి. అతను కనులు మూశాడు.

ఉదయాన్నే తండ్రి వచ్చి దేవాలయములోని గంట మ్రోగించేసరికి సత్యానికి మెలకువ వచ్చింది. అతను భగవంతుని వైపు తిరిగి ఖిన్నవదనంతో నమస్కరించాడు. తండ్రి అతనిని చూచి చిరునవ్వు నవ్వాడు. అతనితో మాట్లాడాలని ప్రయత్నించాడు. కాని ప్రయత్నం విఫలమైంది. సత్యం ధ్యానమగ్నుడై వున్నట్లు నటించి మాట్లాడలేదు. తండ్రి వెళ్ళిపోయిన తర్వాతనే అతను యింటికి వెళ్ళాడు.

## ౨౦

సత్యం వరండాలో ముఖం కడుక్కొంటున్నాడు. నళిని అతని కొరకే నిరీక్షిస్తున్నట్లు వాకిట్లో కూర్చుని వున్నది. ఆమె అతనివంక చూడసాగింది. కాని సత్యమామెవంక కన్నెత్తి చూడడానికి గూడా యిష్టపడడంలేదు. నళిని ప్రక్కనే వున్న కలశంమీద చేతితో తట్టి శబ్దం చేసింది. కాని అతను తిరిగైనా చూడలేదు. అతనికి కోపం వచ్చినదని గ్రహించింది.

త్వరగా ముఖం కడుగుకొని సత్యం గదిలోకి వెళ్ళాడు. నళిని తన యింటి కిటికిలో నుండి అతని చేష్టలు కనిపెడు తున్నది. కిటికీ తలుపులు చప్పుడు చేసింది. కాని సత్యమామె వంక చూడలేదు. అతను తన యింటి కిటికీ తలుపులు గూడా మూశాడు.

పూర్తికాకుండా వదలివేసిన పాత చిత్రాన్ని బయటకు తీశాడు. దానిపై కప్పిన తెరను తొలగించి కుంచె తీసుకొని దానిముందు కూర్చున్నాడు. ఆ చిత్రాన్ని కాసేపు యిటు పెడతాడు. కాసేపు అటు పెడతాడు. చిత్రలేఖన మతనికి ఆరాధ్య దేవత. మేఘావృత ఆకసము, మెరుస్తున్న విద్యుల్లతలు, క్రింద ఎత్తైన కొబ్బరిచెట్లు, దూరంగా కొండపై నుండి క్రిందకు ఉరకలు వేస్తున్న సెలయేరు. ఆ విద్యుల్లతపై నృత్య భంగిమలో నళిని.

కుంచెతో చిత్రాన్ని అటూ యిటూ సరిచేయబోయాడు. కాని గదిలో వెలుతురు సరిగా లేదు. అందుచే కిటికీ తెరిచాడు. నళిని ఇంకా కిటికీ వద్దనే ఏడుపు ముఖంపెట్టి నిలబడి వున్నది. సత్యం ఆమెవంక క్షణంసేపు చూచి తన పనిలో

తాను నిమగ్నమైనాడు. ఆ సుందర మేఘాల కొక ఆకృతిని తీసుకురాసాగాడు. అతని వ్రేళ్ళు సాగిపోతున్నవి. వాటివెంట మేఘాల స్వరూపం మారిపోతున్నది. అవి రాక్షసులలా కన్పిస్తున్నవి. త్రాగిన నిషాలో ఎఱ్ఱని చింతనిప్పుల్లాగున్న పెద్దపెద్ద కండ్లు, అశ్లీల సంకేతాలు, వికృతమైన ఆకారాలు, వ్యసన గ్రస్త, శిథిల, అస్పష్టరూపాలు అసంఖ్యాకంగా వున్నవి.

నళిని దృష్టి సత్యం వ్రేళ్ల మీద నిలిచింది. సత్యం ముఖం చూచి అతని మనస్సులో ఏమి జరుగుతున్నదో గ్రహించింది. నళిని దృష్టి చిత్రంమీద పడేలా చిత్రాన్ని సత్యం నళిని వైపు త్రిప్పాడు. కాని అతను నళినివంక చూడలేదు.

"ఎందుకలా ముఖం చాటు చేసుకొంటావు?"

సత్యం మాట్లాడలేదు.

"నోటిలో నాలుక మాట్లాడడానికి గాని దాని నక్కడ ఖైదు చేయడానికి గాదు భగవంతు డిచ్చినది." అన్నది నళిని.

సత్యం మాట్లాడలేదు.

"రాత్రంతా ఎక్కడకు వెళ్లావు? చాలా కోపంగా కనిపిస్తున్నావు?"

జవాబు లేదు.

"మాట్లాడితే వ్రతభంగ మాతుందా?"

సత్యం ముఖ మటు త్రిప్పాడు.

"మాటలు గూడా..."

సత్యం చిత్రం వంక చూడసాగాడు.

"మాట్లాడవా?"

సత్యం చిత్రాన్ని క్రింద పెట్టాడు.

"చూస్తా! ఎన్నాళ్లు మాట్లాడవో..." నళిని కండ్లలో నీరు తిరిగింది. నళిని కిటికీ మూసింది. సత్యం గూడా కిటికీ మూశాడు, చిత్రం పూర్తయింది.

అతను మంచముమీద పండుకొన్నాడు. అతని మనస్సులో తుఫా నింకా చెలరేగుతూనే వున్నది. ఒక్కొక్కసారి జాలి కలుగుతున్నది. అతను విచిత్రావస్థలో నున్నాడు.

ఆహారమని భ్రమించి మిడుతలు అగ్నిలో దూకుతవి... "అయితే నేను మిడతనా? నళిని లేకపోతే నేను జీవించలేనా?" అత నీ విషయాన్ని గురించే చాలసేపు ఆలోచించాడు. ఈ ప్రశ్నే అనేక రూపాలలో అతని నెదుర్కొన్నది. అతను దేనికీ ప్రత్యుత్తరించ లేకపోయాడు.

సత్యం లేచి నిలబడ్డాడు. అగ్ని లేదు. పొగ లేదు. మిడత లేదు. అలా జరగడానికి వీలులేదు.

అతడు వెంటనే కిటికీ తలుపు తెరిచాడు. కాని నళిని యింటి కిటికీ మూసి వున్నది. అతను ఉత్తరీయం భుజాన వేసుకొని యింటికి తాళం వేసి బయటకు వచ్చాడు. అతని కెటు పోవాలో తోచడం లేదు. అతడు తనను తానే రక్షించుకోవాలను కొంటున్నాడు. కాని ఎక్కడకు వెళ్లగలడు? ఎవరితో మాట్లాడుతాడు? అటు తిరిగి యిటు తిరిగి తుదకు ఊరచెరువువద్దకు వెళ్లాడు. అక్కడ ఒకచెట్టుక్రింద నారాయణ బాబా ముఠా కూర్చునివున్నది. వారికి కొంచెం దూరంగా సత్యం చతికిలబడ్డాడు.

"జమీందారుగారు జమున కుద్వాసన చెప్పారట, కాంచనభాగ్యం పండింది. కాంచనదేమున్నది నళినిరొట్టె

విరిగి నేతిలోపడింది." ఈ మాటలువినేసరికి సత్యానికి పీరంతా కలిసి తన ప్రాణాలుపిండి కోపం తెప్పిస్తున్నట్లనిపించింది. "నళినిగూడా వ్యాపారం సాగిస్తున్నట్లు తెలిసింది. జమీందారు గారు రాత్రిళ్లు యిక్కడే వుంటున్నాడట. ఆదినారాయణ గూడా చేరాడు. యికనేం ఇల్లుపీకి మేడవేస్తుంది."

సత్యం యీ మాటలు వినలేక తల వంచుకొని అక్కడ నుండి వెళ్లిపోయాడు.

అతను చెరువుగట్టునే వెడుతున్నాడు. చెరువుకావలి ప్రక్క ఆదినారాయణ యిల్లు వున్నది. అతని యింటి అరుగు మీద అయిదారుగురు పెద్దమనుష్యులు కూర్చునివున్నారు. సత్యాన్ని చూడగానే వారు ఆదరణీయవ్యక్తిని గౌరవించి నట్లు గౌరవించబోయారు. సత్యానికి దేమీ అర్థంకాలేదు. అతను అన్యమనస్కంగా రావిచెట్టుక్రింద కూర్చున్నాడు.

"ఇతడు పరమభక్తుడై పోయాడని విన్నాను. రాత్రిం బవళ్లు దేవాలయంలోనే వుంటున్నాడట!" అని అన్నాడు ఆదినారాయణ. ఈ మాటకు సత్యం ఉలిక్కిపడ్డాడు. కాని మారు మాట్లాడలేదు.

"రాత్రింబవళ్లు పూజలోనే మునిగివుంటున్నాడట. భక్తులలోగూడా రెండురకా లున్నారు. ఒకటి మూఢభక్తి, రెండవది భక్తిముదిరి పిచ్చి."

తనతండ్రి చిరునవ్వులోని అంతరార్థం యిప్పటికర్థ మైనది 'సత్యానికి. బహుశా ఆయనే వీళ్లకు "మావాడు రాత్రంతా దేవాలయములోనే గడిపా"డని చెప్పివుంటాడు,

అతనారావిచెట్టుక్రింద కూర్చోవడంచూచి వారి సంభాషణ లాపి సత్యాన్ని గురించి మాట్లాడుకోసాగారు.

సత్యమక్కడ కూర్చోలేక లేచివెళ్లాడు. వారినిచూస్తే సత్యానికాశ్చర్యమేస్తున్నది. అతని నిగ్రహం సడలిపోతున్నది. పిచ్చివానిలా చేలలో కొంతసేపటూయిటూ తిరిగాడు. అలసి సొలసి ఒకచెట్టుక్రింద మేనువాల్చి నిద్రపోయాడు.

అతడుకండ్లు తెరచిచూచేసరికి అయిదుగంటలైనది. అతనికి మనస్సు కొంత కుదటపడినట్లుతోచింది. మెల్ల మెల్లగా యింటికిచేరాడు. ఇంటివద్ద వేపచెట్టుక్రింద నళిని విచారంగా కూర్చునివున్నది.

లక్ష్యాన్ని గురిచూచి బాణంవదలినట్లుగా "నళినీ నీ వింక నాట్యం మానివేయి" అన్నాడు సత్యం. ఈ మాట నళినికి నిజంగా బాణంలాగానే గ్రుచ్చుకొన్నది. కొంతసేపు ఉక్కిరిబిక్కిరైనది. తరువాత సంబాళించుకొని, "నిన్నెవరైనా చిత్రలేఖనం మానమంటే?" అన్నది.

"చిత్రలేఖనం సంగతి వేరు. నాట్యం సంగతి వేరు".

"అని నీ వంటున్నావు! రెండూ కళలే."

"కాని?—"

"నలుగురి దృష్టినీ ఆకర్షించినప్పుడే యీ కళవికసిస్తుంది. నీకళను చూచి మెచ్చుకొనేవారుంటే నీవు పొంగిపోవా?"

"లేదు. లేదు. నా భావం ..."

"ఇతరులకు ఉపదేశం చేయడం చాల తేలిక, ఆపని అంతా చేస్తారు. మీరే అనేవారుగా? కళంటే సాధన అనీ, తపస్సు అనీ, ఇది అనీ, అది అనీ, ఇంకేమేమో...?"

"లేదు. లేదు..."

"ఆదర్శమైన కళలో ఈర్ష్యకు తావులేదు."

"నా మాట ..."

"నీ వింకా పైకి ప్రాకడం మొదలెట్టనేలేదు. క్రిందికి జారుతున్నావు, మరి ..."

"నీవు నా మాట వినుపించుకోవేం ?" ఇలాంటి జవాబు వస్తుందని సత్యం కలలోగూడా అనుకోలేదు. ఇదే అతనికి మొదటి అనుభవం.

"కళను గురించి నీ అభిప్రాయ మిదేనని మొదటనే చెపితే తలుపులు మూసి లోపలకు ఎవరినీ అడుగు పెట్టనిచ్చే దాన్ని కాదు. మనుషులు చెప్పేది ఒకటి చేసేది మరొకటినని నాకిప్పుడర్థమైనది." అంటూ నెత్తిన ముసుగువేసుకొని లోపలకు పోయింది.

"లేదు. లేదు. నా అభిప్రాయ మదికాదు ..."సత్యం మాట్లాడుతూనే వున్నాడు. కాని విధిలేక అతనూ తన యింట్లోకి పోక తప్పలేదు. రాత్రంతా కిటికీ తలుపులు తెరిచే వుంచాడు. కాని నళిని యింటి కిటికీ తలుపులు మూసేవున్నవి.

## ౨౧

ఇరువురూ ఒకరి నొకరు చూచుకున్నారు. కాని దృష్టి మార్చుకున్నారు..

సూర్యోదయమైనది. సూర్యభగవానుడు తన యాత్ర ప్రారంభించాడు. సత్యం మాట్లాడలేదు. నళినికూడా మౌనంగానే వున్నది. వారి హృదయాల్లో ఒక ప్రక్క క్రోధాగ్ని

జ్వాలలు ప్రజ్వరిల్లుతుంటే రెండవ ప్రక్క ప్రేమామృతం వర్షిస్తున్నది. కొంతసేపు ఎండ, కొంతసేపు నీడ. అద్భుతమైన వర్ష ఋతువు.

సత్యానికి ఒక పర్యాయం ఆమెను పలకరించాలని నోటిదాకా మాట వచ్చింది. పెదవులు కదిలాయి. కాని మాట మాత్రం బయటకు రాలేదు. నళిని ముఖం ప్రక్కకు త్రిప్పుకొన్నది. కాళ్లు ఎత్తి ఎత్తివేస్తూ లోపలకు పోయింది. ఆమె వంక చూస్తూ సత్యం అలా నిలబడిపోయాడు.

సత్యం యింట్లోకిపోయి కిటికీ తలుపులు చప్పుడుచేశాడు. కాని నళిని ఆ సంకేతానికేమీ జవాబివ్వలేదు. సత్యానికి విసుగెత్తి బయటకు వెళ్ళిపోయాడు. అతనికేమీ పాలుపోక కోడూరువైపు బయలుదేరాడు. కోడూరు దారి అతనిని విశేషంగా ఆకర్షిస్తున్నది. ఒక్కొక్క అడుగు వేస్తున్నకొద్దీ ఒక్కొక్క సంఘటన గుప్తికి రాసాగింది. బాల్యమంతా సినిమా రీలులా అతని కనులముందు తిరగసాగింది.

అనేక పర్యాయాలు నళిని నతడు కోపగించుకొన్నాడు. ఇక ఆమెతో మాట్లాడ గూడదని గూడా అనుకొన్నాడు. కాని ఆమె అంటే ఎందుకో తన మనస్సలా ఆరాట పడుతుంది. అత నామెతో మాట్లాడకుండా వుండలేడు. అత నెప్పుడూ తననే దోషిగా భావించుకొంటున్నాడు. ఈ బాధ కొంతకాలం వుండక తప్పదు. రాత్రిళ్ళు అతను నళిని మంచి చెడ్డలను గురించే ఆలోచించేవాడు. ప్రొద్దు పొడవగా నేఅతనుఆమెతో మాట్లాడాలని ఆతుర పడేవాడు.

సత్యం ఇంటికి తిరిగి వెళ్ళిపోవాలనుకొన్నాడు. వంతెనవద్ద గుడారము, పందిరి చూచి కొంచెముసేపు ఆగాడు. బహుశా

ఏదో ఎగ్జిబిషను జరుగుతున్న దచ్చట. అతను ఒకటి రెండడు గులు ముందుకు వేశాడు. కాని మరల ఏమాలోచించాడో వెనుకకు కొత్తపట్నంవైపు మరలాడు.

సత్యం ఆలోచిస్తున్నాడు. "నేను కళాకారుణ్ణి. కాని కళాకారుడు మనుష్యుడుకాడా? అతని వస్తువేదైనా చేయి దాటిపోతుంటే విచారించడా? కళ సాధన. అది బజారుకాదు. నళిని ఏమి చేయగలదు? ఆమెకు గత్యంతరంలేదు. తల్లి పిశాచినిలా ఆమెను మురికి గోతిలోకి త్రోస్తున్నది. కొత్త పట్నం వదలి పారిపోతే? భుక్తి జరిగేదెలా? భుక్తిమాట ఎలావున్నా ముందీ అవమానాన్నుండి బయట పడవచ్చు. చూద్దాం. అన్నింటికీ ఆ పరమేశ్వరుడే వున్నాడు.

"కొత్తపట్నంలో వుండి ఏమి చేస్తావోయి? అన్నాడు పద్మనాభం. అతని హృదయంలో నుండి వచ్చిన మాటేనా యిది? అతను నీతినియమాలు కలవాడేనా? నేను వెడితే సహాయం చేస్తాడా? సహాయము చేసినా చేయక పోయినా యిక కొత్తపట్నంలో వుండడం దుష్కరం."

అతను నిశ్చయానికి వచ్చాడు. అతని కాళ్లు తేలి పోతున్నాయి. అతనికి ప్రియమైన కూనిరాగాన్ని ఆలపింప సాగాడు. నడకలో వేగం హెచ్చింది. మద్రాసు కలలు కంటున్నాడు. ప్రదర్శనలు...స్టూడియోలు...ప్రశంసలు...

సత్యం యింటికి చేరాడు. కాని వెంటనే నళినిని పిలువ లేక పోయాడు. ఒక స్త్రీకంటే తా నధికుడ ననే అభిమానం అడ్డు తగిలింది. తనకు తా నపరాధి ననుకొంటున్నాడు. కాని

నళిని కేవిషయం తెలియగూడదు. తనను నళిని 'అపరాధి' అనకూడదు.

నళిని యింటి కిటికీ తెరిచి వున్నది. కాని ఆమె కిటికీ వద్ద లేదు. అతను వాకిట్లో ముఖం కడుగుకోవడానికి వెళ్లే సరికి నళిని వేపచెట్టుక్రింద కూర్చుని తన మృదుమధుర కంఠ స్వరంతో ఏదో గీత మాలపిస్తున్నది. బహుశా సత్యమున్న స్థితిలోనే ఆమె గూడా వున్నట్లున్నది. సత్యం వాకిట్లోకి రాగానే "ఎన్నాళ్లని నాలుకను ఖైదు చేస్తావు? దానిని కాస్త పెరోలుమీద విడిచిపెట్టు." అన్నది.

"ఊఁ."

"ఆఖరికి నీవే జయించావు. చూచావా నేను రాత్రి నాట్యం చేయలేదు. నాట్యం కళగానీ, మరేమైనా గానీ నేను నాట్యం చేయను."

"ఏమిటి నీ వంటున్నది? ఇంత కష్టపడి నాట్యం నేర్చుకొని యిప్పుడు దానిని వదలి పెడతా నంటున్నావా?" అన్నాడు సత్యం.

నళిని కనుల వెంట రెండశ్రు బిందువులు రాలినవి.

"అరె! ఏడుస్తున్నావా?"

నళిని సజలనేత్రాలతో అతనివంక చూడసాగింది. కొంత సేపైన తరువాత "అయితే నీవు నన్ను నాట్యం చేయ నిస్తావా?" అన్నది.

"చేయనిస్తాను. కాని యిక్కడ కాదు."

"మరి ఎక్కడ?"

"మద్రాసులో...మన మిక్కడ నేర్చుకొన్నదేమో నేర్చుకొన్నాము. మద్రాసులో నాట్యశాస్త్ర పారంగతు లున్నారు. అక్కడ నీవు నాట్యం నేర్చుకోవచ్చు. నేను గూడా ఎవరైనా గురువుని వెదకి కొంటాను."

"కాని..."

"కానీలేదు గీనీలేదు. రేపు నీవు నా వెంటరాక తప్పదు. నేను మద్రాసు వెళ్లడానికి నిశ్చయించుకొన్నాను."

"లేకుంటే?"

"ఇక నేను నీముఖ మెన్నటికీ చూడను."

నళిని నవ్వి—"కాని..."

"మళ్ళీ అదే కానీ... నేను చిత్రాలమ్మి నాలుగు డబ్బులు సంపాదిస్తాను. ఏమీ దొరకని రోజు పస్తుందాం. కాని యిక్కడ మాత్రం వుండలేను."

"నన్నుండ నివ్వవా?" అన్నది నవ్వుతూ.

"ఊఁ!" సత్యం ఆశ్చర్యంతో కనులు పెద్దవిచేశాడు.

"నీ వనుకొంటున్నావు. నీవు మద్రాసులో వుంటే నే నిక్కడుంటానని. నీ వెక్కడుంటే నేనూ అక్కడే."

"ఇక్కడ పడివుంటే లాభ మేమిటి?" ఇరువురూ పద్మనాభాన్ని గూర్చి ఆలోచింపసాగారు. ఇంతలో ఎవరో తలుపు తట్టారు. సత్యం నిశ్చింతగా లోపలకు వెళ్ళాడు. అతని తండ్రి వచ్చాడు.

నళినిగూడా తన యింట్లోకి వెళ్లింది.

## ౨౨

తూరుపురేఖ లింకా తెల్లవారలేదు. సూర్యభగవానునికి స్వాగత మివ్వడాని కింకా ఉషాకన్య ముస్తాబుకాలేదు. సత్యం కాల్యాలు తీర్చుకొని దేవాలయం వద్దకు వెళ్లాడు. గుడి తలుపులు మూసివున్నవి. తండ్రి వచ్చేవేళ కాలేదు. అతను చంపకాలు, మల్లెలు మొదలైన పూవులుకోసి గోపుర ద్వారంవద్ద వుంచాడు. మూసివున్న తలుపులకు ఎదురుగా కూర్చుని ధ్యాననిమగ్నుడైనాడు.

అతని స్వభావాన్ని బట్టి చూచినా, వంశపారంపర్యంగా వస్తున్న ఆచారవ్యవహారాలను బట్టి చూచినా అతను భక్తశీలుడు. దేవాలయంలోని పూజా పునస్కారాలంటే అపేక్ష లేదు. కాని భగవంతుని యందు అచంచల విశ్వాసమున్నది. భక్తి ఆడంబరమంటే అతనికి గిట్టదు. దానికి దూరంగా వుంటాడు. తండ్రి వచ్చి అత నక్కడ ఉండడం చూచి చకితుడైనాడు. ఆయన సత్యంతో మాట్లాడాలని ఉబలాటపడుతున్నాడు. కాని సత్యం ఉదాసీనంగా వుండడంచూచి పలకరించలేక పోతున్నాడు. సత్యానికి తండ్రిమీద ప్రేమలేదందామా? అదీకాదు. రక్తస్పర్శ. పరస్పరం ఆకర్షించుకొంటుంది.

"బాబూ! నన్ను లేపకపోయావా? తాళంచెవులు తీసుకువచ్చేవాడినిగా?" అన్నాడు తండ్రి

"మీరు నిద్రపోతున్నారు. లేపటం మంచిదికాదనుకొన్నాను" అన్నాడు సత్యం.

తండ్రి కనులలో నీరుతిరిగింది. వస్తుథా అతను సహృదయుడు. సత్యాన్నిచూడగానే ఆయన మనస్సులో ఎప్పుడూ ఆరిపోతూ వెలుగుతూవుండే దీపశిఖలాంటి దివ్యస్మృతి జాగరిత మౌతుంది.

"భగవంతుని పూజించడం మంచిదినాయనా! శ్రద్ధ, భక్తి లేకపోతే జీవితం సుఖమయంకాదు." అంటూనే ఆయన దేవాలయం తలుపులు తెరుస్తున్నాడు. దేవతామూర్తికి అభిషేకం చేసి పూజలో నిమగ్నమైనాడు. సత్యం మంటపంలో కూర్చుని రెప్పవాల్చకుండా విగ్రహాన్ని చూస్తున్నాడు.

కొంతసేపైన తరువాత అతను దేవాలయమంటపమున కొకప్రక్క కూర్చుని సముద్రగర్భమునుండి ఉదయిస్తున్న సూర్యభగవానుని చూడసాగాడు. సామాన్యంగా అతను ప్రతి రోజూ సూర్యోదయాన్ని చూస్తూనేవుంటాడు. అతని కా దృశ్యం నిత్యనూతనంగానే వుంటుంది. ప్రతిరోజూ సూర్యోదయములో నూతన ఆకర్షణ అతని నాకర్షిస్తుంది.

సూర్యోదయంలాగానే తనజీవితం నిత్యనూతనంగా వుండాలని సత్యం అభిలషిస్తున్నాడు. అతని జీవితములో సంఘటన లేమీలేవు. అదేపని, అవేకోరికలు, అదేబాధ మార్పు లేదు. అతనుపరివర్తన చెందాలనుకొంటున్నాడు.

జీవనదిలా, వెలుగురేఖలా పరివర్తన చెందాలని అతని ఆశయం. అతనిలో నూతనోత్సాహం వెల్లివిరుస్తున్నది. తన జీవితచరిత్రలోనూతనాధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు.ఏ ఆటంకము లేకుండా వుండగలందులకై భగవంతుని ప్రార్థిస్తున్నాడు.

పూజాపునస్కారాలైన తరువాత అతను తండ్రితో కలిసి యింటికి వెళ్ళాడు. దారిలో తండ్రితో యిలా అన్నాడు—"కోడూరులో ఏదో ఎగ్జిబిషను జరుగుతున్నది. నేను వెడతాను. కొంచెం ఆలస్యంగా యింటికి వస్తాను."

"వెళ్ళునాయనా! డబ్బుకేమైనా అవసరముంటే అలమరలోవున్నది తీసుకో."

సత్యానికి ఏడుపువస్తున్నట్లుగా వున్నది. అతనితండ్రి భోజనంచేసి ఆదినారాయణయింటికి వెళ్లాడు. సత్యం చేతితో సైగచేసి నళినిని వేపచెట్టువద్దకు పిలిచాడు. "ఏమిటి ప్రయాణమేనా ?"

"మీ ఆజ్ఞ" చిరునవ్వు నవ్వింది నళిని.

"మీ అమ్మతో చెప్పు. కోడూరులో ఏదో సర్కసు జరుగుతున్నది. నేను చూచి వస్తాను, అని."

"నిజంగా సర్కసు జరుగుతున్నదా ?"

"అవును. సంచిలో గుడ్డలు పెట్టుకో. డబ్బును గురించి భయపడబోకు."

సాయంకాల మయేసరికి వారిరువురూ కోడూరు రోడ్డున సాగిపోతున్నారు. కొంతదూరం పోయి సత్యం వెను దిరిగి చూచాడు. క్షితిజము, దిబ్బమీదనున్న దేవాలయం, చిన్న చిన్న పెంకుటిళ్లు. ఆదినారాయణ రెండతస్థుల మేడ, శిథిలాలు, జీడిమామిడిచెట్లు, సముద్రపు టిసుక ఇంకా ఏమేమి అతని దృష్టిలో పడినవో తెలియదు.

వారు వ్యాకులంగా, విహ్వాలచిత్తంతో మాట్లాడకుండా తొందర తొందరగా వెడుతున్నారు. సత్యం మరల వెనుదిరిగి

చూచాడు. ప్రక్కనున్న నళిని విచారంగా నడుస్తున్నది. ఆమె పాదాలు యంత్రంలా గనెముమీద పడుతున్నవి. ఋతువులు మారుతవి. వాతావరణము మారుతుంది. పంటలు పండుతవి. కోతలు కోస్తారు. కాని గట్లు, గనిమలు మాత్రం చెరగని స్మృతి చిహ్నాల్లా తమ అస్తిత్వాన్ని నిలుపు కొంటాయి. సత్యం, నళిని స్మృతి చిహ్నాల కొక ఆకారం కల్పిస్తే దానికీ గనెము వెన్నెముక అవుతుంది.

ఇరువురూ వంతెన వద్దకు రాగానే నళిని సత్యం చేయి పట్టుకొని ఏదో చూపించ బోయింది. కాని సత్యం ముందుకు సాగి పోతూనే వున్నాడు. వంతెనవద్ద చాలమంది పోట్లాడు కొంటున్నారు. ఎగ్జిబిషను జోరుగా వున్నది. రకరకాల వస్తువులు, కనులు మిరుమిట్లు గొలిపే విద్యుద్దీపాలు. వారి ఊరివాళ్లు గూడా చాలమంది వున్నారు.

ఇరువురూ ఎగ్జిబిషనులోకి వెళ్లి చాలసేపు తిరిగారు. నళిని సత్యం అడుగులో అడుగు వేస్తూ తిరుగుతున్నది. ఎరిగున్న వాళ్ళు కనిపించినప్పుడు సిగ్గుతో తలవంచు కొంటున్నారు. అంతలో వీరిని చూచి మన మెందుకు భయపడాలి అనుకొంటూ ముందుకు సాగిపోతున్నారు.

రాత్రి చాల ప్రొద్దు పోయినది. మద్రాసు వెళ్లే ట్రెయిను వచ్చే వేళయినది. వారి బడివున్న రాస్తాన బయలు దేరారు. సత్యం స్కూలువంక ఓరచూపు చూచి ముందుకు సాగాడు. గుండె గొంతుకలో కొట్లాడుతున్నది. మాటలు పెగిలి బయటకు రావడం లేదు. కంఠం రుద్ధమైనది.

"బహుశా రైలు స్టేషనులో ఎరిగినవాళ్ళు కనిపించ వచ్చు. కనుక నీ వెలానో కనుబ్రామి ఆడవాళ్ళ పెట్టెలో

ఎక్కు. ముందు స్టేషనులో కలుసు కొందాం. జాగ్రత్త. ఇక్కడ బండి రెండు నిముషాలకంటే ఎక్కువసేపు ఆగదు" అన్నాడు సత్యం.

వారు స్టేషనుకు చేరారు. బండీగూడా వచ్చింది. తొందర తొందరగా బండిలో ఎక్కారు. బండి కదలగానే అప్రయత్నంగా వారి కనులు చెమ్మగిల్లినవి.

అంధకారాన్ని చీల్చుకొంటూ బండి మద్రాసువైపు పోతున్నది. దాని వెంట నళిని, సత్యం యిరువురూ పరిచిత ప్రదేశాన్నుండి అజ్ఞాత ప్రదేశంవైపు వెళుతున్నారు.

## ౨౩

"సత్యం...సత్యం..."అంటూ తలుపు తడుతూ ఎవరో పిలుస్తున్నారు. నళిని తలుపు తెరిచేసరికి సూటూ బూటూ వేసుకొని పద్మనాభం ఠీవిగా నిలబడి వున్నాడు.

"సత్యం లేడా ఏం?'

"బయటకు వెళ్ళారు" అన్నది నళిని.

"బహుశా తిరిగి వస్తూవుండవచ్చు. నేనతనిని చూచి వెడతాను" అంటూ చిరునవ్వు నవ్వాడు పద్మనాభం.

నళిని తలువు నానుకొని నిలబడింది. వాకిలి తీసేవున్నది.

"ఏమిటి? మద్రాసు ఎలాగుంది."

"బాగున్నది."

"నీకు యిప్పటికిప్పుడే ఫిలుములలో యాక్టుచేయాలంటే కుదరదు. కొంతకాలం పడుతుంది. అవకాశం..." అతను తన

వాక్యాన్ని పూర్తి చేయలేకపోయాడు. "నేను యిద్దరు ముగ్గురు నిర్మాతలను కలుసుకొన్నాను. వీళ్ళంతా పైకిపోయామను కొంటున్నారు. దరిద్రులు మజ్జిగ ఊదుకు త్రాగుతున్నారు. ఏమంటావు నళిని?" అంటూ పద్మనాభం ఆత్మీయత కన పరచ సాగాడు.

"నీ ఆసరాచూచుకొనేమేము బయలుదేరివచ్చాము."

"మరి దక్షిణ ...?" పద్మనాభం ఆమెవంక అదోలా చూడసాగాడు. అతని నీతి నియమాలు ఎగిరిపోయాయి. నళిని మాట్లాడ లేదు.

ఉదయం ఏడెనిమిది గంటల సమయం. నళిని వంట పనిలో నిమగ్నురాలై వున్నది. ఆమె మద్రాసు వచ్చినప్పటి నుండి, పద్మనాభం సమయాసమయాలు లేకుండా వచ్చి ఆమెను సినిమాలకు, షికార్లకు తీసుకుపోయేవాడు.

"ఏం చేస్తున్నావు?"

"వంట చేస్తున్నాను."

మీ అమ్మను వెంటతీసుకు రాలేకపోయావా? నీవు వంటచేస్తే నీ మృదువైన చేతులు కందిపోవూ? నీ వ్రేళ్లు కాలి కట్టెపుల్లల్లా తయారవుతవి."

నళిని మాట్లాడలేదు.పద్మనాభం ప్యాంటు జేబులోచేయి బెట్టి సిగరెట్టు తీసి ముట్టించి అటూ యిటూ పచార్లు చేయ సాగాడు. నళిని కొద్దిగా భయపడింది.

"ఏమైనా అవసరమున్నదా?" పద్మనాభం చిరునవ్వు నవ్వుతూ అడిగాడు. "ఏమైనా అవసరముంటే సందేహం

లేకుండా అడుగు యిస్తాను. నేను పరాయివాణ్ణికాను. బాల్య స్నేహితుణ్ణి."

నళిని తలవంచుకొని బొటనవ్రేలితో నేలరాస్తూ నిల బడివున్నది. ఆమె మాట్లాడలేదు. పద్మనాభం ఆమెవంక రెప్ప వాల్చకుండా చూస్తూ ఆమె దగ్గరగా వచ్చి నిలబడ్డాడు.

"వద్దు. నాకేమీ అవసరములేదు. బహుశా సత్యం రావడం ఆలస్యం కావచ్చు. అంతదనుక మీరిచ్చట కాలం వృధాపుచ్చడ మెందుకు?" అన్నది.

"నీవు ప్రక్కనుంటే కాలం వృధా అవుతుందా? ఏమిమాటలివి నళినీ!"

నళిని బయటకువెళ్ళి నిలబడింది.

"నీ యిష్టం కోపపడకు." అంటూ పద్మనాభం సిగ రెట్టు పొగ వదలుతూ వెళ్ళిపోయాడు.

నళిని తలుపు నానుకొని కండ్ల నీరు కారుస్తూ కూర్చు న్నది. పద్మనాభం వ్యవహారం ఆమెకు చిన్నతనం నుండి తెలుసు. పద్మనాభం తరచుగా వచ్చి ఆమెతో ఆ మాటా యీ మాటా మాట్లాడి ఏవేవో ఆశలు చూపించేవాడు. సత్యంతో గూడా మంచి చెడ్డలు మాట్లాడేవాడు.

సత్యం, నళిని మద్రాసు వచ్చి తేనాంపేటలో చిన్న యిల్లు అద్దెకు తీసుకొని వుంటున్నారు. ఇరుకైన ఒక గది, వంటయిల్లు, కొద్దిపాటి వరండా. ముంగిలిమాత్రం కాస్త పెద్దది. కొత్తపట్నంలో మాదిరిగా వారికిక్కడి యిళ్లుకూడా విచిత్రంగా నున్నవి. అక్కడ రైతులు గొడ్లనూ, గుఱ్ఱాలను, మేకలను యిండ్లలో కట్టివేస్తారు. ఇక్కడ మద్రాసు

పట్నంలో కొత్త కొంపలో అయిదారు నిర్భాగ్య కుటుంబాలవారు జీవిస్తున్నారు. ఒకరు ఏదో స్టూడియోలో వడ్రంగి, ఒకరు ఎక్స్ట్రా, ఒకరు జ్యోతిష్కుడు, ఒకరు నిరుద్యోగి. నాలుగు వైపులా కొద్దిగా ఖాళీస్థల మున్నది. కొబ్బరిచెట్లు, ఆవల మరల పెద్ద బంగళా. అందులో ఎవరో వ్యాపారస్తుడు వుంటున్నాడు. మొదట్లో యీ బంగళా ఒక జమీందారుది. పాతకాలపు నమూనాలో నున్నది. బంగళాకు వేరే సింహద్వారమున్నది.

కేవలం ఎండ, వానల నుండి రక్షణకొరకై యీ చిన్న యింటికి యిరువది రూపాయల అద్దె చెల్లించవలసి వస్తున్నది. ఒక నెల రోజులు గడచినవి. సత్యం యింటివద్ద నుండి కొద్దిగా డబ్బు తెచ్చాడు. దానితోనే గడుపుకు పోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ యిల్లు గూడా పద్మనాభమే అద్దెకు కుదిర్చాడు.

ఆ పేటలో తెలుగుమాట్లాడేవారి సంఖ్య అధికముగానే వున్నది. అందులో అధిక భాగం స్టూడియోలలో పనిచేస్తున్నారు. మిగతావారు పనికోసమని స్టూడియోల చుట్టూ తిరుగుతున్నారు. ఆ పేటలో రెండు స్టూడియోలున్నవి. పద్మనాభం గూడా ప్రస్తుతం వాటిలో ఒకదానిలో పనిచేస్తున్నాడు. కొత్తపట్నంలోని వాళ్లనుకొన్నంతగొప్పవాడినికానని తెలుసుకోవడానికి అతనికొట్టే కాలం పట్టలేదు. అతను తాననుకొనేటంత గొప్పవాడుకాడు. కాని అతనికేమీ కొరతలేదు. పని దొరుకుతూనేవున్నది. మంచి వేతనం యిస్తూనేఉన్నారు. మద్రాసులోగూడా అతనికొక ముఠా వున్నది. దానికిప్పుడు వెంకటేశ్వర్లు కార్యదర్శి.

మద్రాసు రాగానే సత్యాన్ని పద్మనాభం తాను పని చేస్తున్న స్టూడియోకి తీసుకువెళ్లాడు. "నేనెంతో ప్రయత్నించి చూచాను. చిత్రకారులకెక్కడా ఖాళీలు లేవంటున్నారు. రోజువారీ కూలికి సెట్టుమీద పనిచేస్తామంటే పని చూపిస్తామంటున్నారు" అన్నాడు పద్మనాభం. సత్యం దానికిష్టపడలేదు.

సత్యం పనికొరకు వెదుకుతున్నాడు. ఉదయాన్నే యిన్ని కాఫీనీళ్లు త్రాగి సాయంకాలానికి విచారంగా, నిరాశతో కాళ్లీడ్చుకొంటూ కొంపచేరుకొనేవాడు. ఇది అతని దినచర్య అయిపోయింది. శని ఆదివారాలలో మాత్రం చిత్రలేఖనంచేసే వాడు. అతను చిత్రకారుల జీవితాలను చదివాడు. వాటిలోని సంఘర్షణలతో అతనికి పరిచయమున్నది. ప్రస్తుత మవే యితనికి ధైర్యాన్ని పురికొల్పుతున్నవి.

ఎక్కడ చిత్రకారుడు అవసరమంటే అక్కడకల్లా పరుగెత్తాడు సత్యం. తాను వెళ్లేసరికే అక్కడ ఒక చిత్రకారుడు ప్రత్యక్షమయ్యేవాడు. ఈ చిత్రకళను విడిచిపెట్టి యింకా యేమైనా చేయాలనుకొన్నాడు సత్యం. రెండుమూడు చిత్రాలమ్మాలని ప్రయత్నించాడు, కాని పరిచయంలేకుండా చిత్రాలమ్మడంకూడా కష్టమే.

ఒక పరిచిత చిత్రకారుడు చౌదరిగారివద్దకు తీసుకువెడతాను రమ్మన్నాడు. చౌదరిగారు విఖ్యాత చిత్రకారులు. వేలమంది శిష్యులున్నారు. పేరుప్రతిష్టలున్న వ్యక్తి. ఆయన సిఫార్సుచేస్తే ఎవరికైనా ఎక్కడనైనా ఉద్యోగం దొరుకుతుంది. ఆయన సహృదయుడు. దురదృష్టమేమిటంటే ఆ చిత్రకారుడు సత్యాన్ని ఆహ్వానించిన మరుగోజే నిరుద్యోగి అయినాడు. చిత్రకారుల జీవితాలిలా అనిశ్చితంగా వుంటవి.

సత్యం నళినికి రోజూ అడ యారు నృత్యకళాకేంద్రంలో చేరుస్తానని చెప్పేవాడు. సత్యం అక్కడకు రెండు మూడు మైళ్ల దూరంలోనున్న నృత్యకళాకేంద్రానికి వెళ్ళాడుగూడా. నళిని గూడా నృత్యకళాకేంద్రంలో చేరవలెననే వున్నది. కాని కావలసిన డబ్బు మాటేమిటి? ఒక మాసం రోజు లాగి చూద్దామన్నది.

నళిని అప్పుడప్పుడు యింటివద్ద వంట చేసేది. ఇక్కడ గూడా చేస్తున్నది. రెండు మూడు మట్టిపాత్రలు కొన్నారు. ఉదయానికి, సాయంకాలానికి కలిపి ఒక్కసారే వండేది. నళిని వద్ద రెండు మూడు బంగారు నగలుంటే అమ్మింది. పది పన్నెండు రూపాయలు పద్మనాభం వద్ద అప్పుగూడా అయింది.

తనని గూడా మంచి నర్తకిని చేయమని రాత్రింబవళ్ళు భగవంతుని ప్రార్థించేది. అప్పుడప్పుడు తల్లిని తలచుకొని కనులనీరు నించేది. ఎంత పిశాచిముండయినా తల్లి తల్లే.

మద్రాసు నిజంగా తాను కలలుకన్న మద్రాసు కాదు.

## ౨౪

సత్యం సాయంత్రం నాలుగు గంటలకు యింటికివచ్చే సరికి పద్మనాభం వాకిట్లో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. ఇంటి తలుపులు మూసి వున్నవి.

"ఏమిత్రా బయట పచారులు చేస్తునావు?"

"లోపలకు వెళ్లడానికి అనుమతి లేదు." అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

సత్యం తలుపు తట్టగానే నళిని తలుపు తెరిచింది. సత్యమామెను తడికలా అడ్డుగా కట్టిన చాప చాటుకు పిలుచుకొని పోయి ఆమె చేతిలో యాభై రూపాయలు పెట్టాడు. ఆమె ఆశ్చర్యముతో పైకప్పు వంక చూడసాగింది. "పై కప్పు సరిగానే వున్నది. ఎక్కడా విరిగిపడలేదు." అన్నాడు. "బహుశా భగవంతుడు కిటికీలోనుండి వచ్చి వుంటాడు." అని నవ్వింది నళిని. నళిని సామెతకు సామెత అంటించి నందులకు నవ్వుతూ "అయితే పద్మనాభాన్ని బయటే నిలబెట్టావెందుకు?" అని ప్రశ్నించాడు.

"అతను వచ్చిన సంగతే నాకు తెలియదు."

"నేనే కబురు చేశాను. నీవు నాట్యం నేర్చుకోవడానికి ఏర్పాటు చేయిస్తాను."

సత్యం, నళిని చాపచాటునుండి యీవలకు వచ్చి సంతోషంగా క్రింద చతికిలబడ్డారు. వారు ఒకరివంక ఒకరు రెప్ప వాల్చకుండా చూచుకొంటున్నారు. పద్మనాభం వారి వంక చూస్తున్నాడు.

"ఏమిటోయ్? ఇవాళ లేదో హుషారుగా కనిపిస్తున్నావ్?" అన్నాడు పద్మనాభం.

"హుషార్ కాకేమున్నదిరా! ఇన్నాళ్ళకు మా భాగ్యం పండింది."

"ఊం!"

"నేను నా చిత్రాలను అమ్ముకోవాలని అడయారులో తిరుగుతున్నాను. అక్కడ పెద్దపెద్ద ధనవంతులున్నారు. అయితే వారు బంగళాలలోకి వెళ్లాను. వాకిట్లో వుండే దర్వానులే

నన్ను లోపలికి వెళ్ళనివ్వలేదు. ఎక్కడైనా వీలుచేసుకొని లోపలకు పోతే వారు నగ్నచిత్రాలు కావాలని కోరేవారు. వారి కోసమని నగ్నచిత్రాలు నే నెక్కడ తెచ్చేది. ఒక రిద్దరు నా చిత్రాలలో మనోరంజకత లేదన్నారు. రోడ్డు చివర చిన్న బంగళా వున్నది. అందులో వున్న ఆంధ్రుడే మంచి సజ్జనుడు. ఏదో జమీందారు కుటుంబములో పుట్టివుంటాడు. ఆయన ఒక చిత్రాన్ని కొన్నాడు. ధర చెప్పినదాకా ఎక్కడ? జేబులో నుండి యాభై రూపాయలు తీసి నా చేతిలో పెట్టాడు."

"అలాంటివారు చాలా అరుదుగా వుంటారు" అన్నాడు పద్మనాభం.

"ఎవరో మంచివాడులా కనిపిస్తున్నాడు. చదువుకొన్న విలాస పురుషునిలా కనిపిస్తున్నాడు. ఆయ నింకా యిలా అన్నాడు. 'కాస్మాపాలిటన్ క్లబ్ లో నన్ను కలుసుకో. నన్నెరిగిన వాళ్ళక్కడ పది పన్నెండుమంది వున్నారు. వారితో నీకు పరిచయం చేస్తాను. బహుశా వారు నీకు సహాయం చేయవచ్చు.' పద్మనాభం! ఆ కాస్మాపాలిటన్ క్లబ్ ఎక్కడ వున్నది?"

"మౌంటురోడ్డుమీద. ప్లాజా సినిమాహాలు ప్రక్కన, పోస్టాఫీసు కెదురుగా, పెద్ద బిల్డింగు. పెద్దపెద్ద చెట్లు, పూల తోట, అది భాగ్యవంతుల క్లబ్. తప్పక తొందరగా వెళ్లు. వెళ్లు."

"రేపు వెడతాను. అరే బ్రదర్! నీకు తెలుసా? మన కోడూరు జమీందారుగారి బంగాళా గూడా అడయారులో

వున్నది. మంచి బిల్డింగు. రెండు కారు లున్నవి. వారిక్కడకు వచ్చారని విన్నాను."

"అవునవును తెలుసు. రాకేంచేస్తాడు. గవర్నమెంటు వారు జమీందారీలు రద్దుచేశారామె. ఊరిలో పలకరించే దిక్కులేదు. పూర్వపువైభవంలేదు. ఆ రాచపోకడ లింకెక్కడ నుండి వస్తాయి. అందుకే జమీందారులంతా మద్రాసు కెగ బ్రాకుతున్నారు."

"ఆయనకుగూడా చిత్రలేఖనమంటే మహాసరదా. ఒక పర్యాయం నా చిత్రాలు రెండు కొన్నాడు."

"ఇప్పు డాయన సరదా వేరు. నిజమేరోయ్! ఆదినారాయణగూడా యిక్కడేవున్నాడు. సినిమా తీయాలనుకొంటు న్నాడు."

"వాడికిగూడా ఎక్కిందీ పిచ్చి. ఒకవేళ కొడుకుకోసమై ఫిల్ముతీయాలని సరదాపడుతున్నాడేమో!"

"సరదా ఏమిటి? డబ్బు సంపాదించాలనే ఆపేక్ష. ప్రజ లేమనుకుంటారో నీకు తెలుసా? ఈ సినిమాప్రపంచ ములో అదృష్టం కలిసివచ్చిందంటే కూటికి లేనివాడుగూడా కుబేరుడై పోతాడని. అందరకూ తమతమ అదృష్టాలను పరీ క్షించుకోవాలని వుంటుంది. భారమంతా నామీదపెట్టాడు. కళాకారుల కోసమై తిరుగుతున్నాను. చూడు ఏమి జరుగు తుందో?"

"అయితే వెంకటేశ్వర్లుగూడా యాక్టుచేస్తాడా?"

"వారెవా? ఎందుకు చేయకూడదు? కథగూడా అతను యాక్టు చేయడాని కనుకూలముగానే వ్రాయిద్దాం. బహుశా

మనందరకూ అవకాశం దొరకవచ్చు." నళిని పద్మనాభంవంక చూడసాగింది. ఆమెకుగూడా సినిమాస్టారు కావలెననే కోర్కె వున్నది. ఆమె మనసారాటపడ సాగింది.

"ఇప్పుడు నాటకాలు, నృత్యాలు వెనకబడ్డాయి. ప్రజలు సినిమాల కెగబడుతున్నారు."

"అయితే నీవు బయటే పచారులెందుకు చేస్తున్నావ్? తలుపెందుకు తట్టలేదు" అన్నది నళిని చిరునవ్వునవ్వుతూ.

"స్త్రీ యింట్లో ఒంటరిగావున్నప్పుడు తలుపుతట్టడం ఉచితముకాదు. కాగా సత్యంవచ్చే వేళగూడా అయినది. ఏం? ఏమంటావ్ ?" అంటూ పద్మనాభం నళినివంక, సత్యంవంక ఓరచూపు చూస్తూ అడిగాడు.

"పద, అడయారు స్కూలుదాకా వెడదాము. ఇవాళ నళినిని కళాక్షేత్రంలో చేర్పించాలి" అన్నాడు సత్యం.

"పొద్దున టాక్సీలో అటువైపు వెళ్లాను. అక్కడ యిద్దరు ముగ్గురు సినిమా వాళ్ళుగూడా నివసిస్తున్నారు. ఇందాకవచ్చాముగదా స్కూలు గూడా చూచి పోదామనుకొన్నాను. ఆ వ్యవస్థాపిక నాకు బాగా తెలుసు. ఎన్నో విధాలు చెప్పి చూచాను. ససేమిరా అన్నది. మీకొక్కరికీ జీతం తగ్గిస్తే అందరూ అదే పాట పాడుతారు. తగ్గించనన్నది. అలా వీలు పడదు అని ఖచ్చితంగా చెప్పింది." అన్నాడు పద్మనాభం.

"ఊఁ ?"

"ఇంకా నీవాస్కూలు చుట్టూ ఎందుకు తిరుగుతావు? నాట్యం నేర్పేవాళ్ళు లక్షమంది దొరుకుతారు. నళిని క్రొత్తగా నేర్చుకొనే పిల్ల కాదామె. పైగా కళాక్షేత్రానికి పోవా

లన్నా రావాలన్నా రానూ పోనూ నాలుగు మైళ్ళకు తక్కువ వుండదు. ఇది సులభమైన పనీ కాదు. నాకు చాలమంది మాష్టర్లు తెలుసు. డబ్బుతో అవసరం గూడా లేదు. ఇంట్లో నేర్చుకొన్నా నేర్చుకోవచ్చు. స్కూలులో నేర్చుకొన్నా నేర్చుకోవచ్చు. ఎలాగయినా నృత్యం నేర్చుకోవడం మనకు కావలసింది. నేను మాష్టర్ని యిక్కడకు పంపమంటే పంపుతాను. లేక నళినే అక్కడకు వెడతానంటే వెళ్లవచ్చు. కాస్త ఆసరా చిక్కిన తరువాత పెద్ద యిల్లు తీసుకోవచ్చు. పని దొరుకుతుంది. ధైర్యంగా వుండు. గాబరా పడబోకు."

"ఏం నళినీ! నీ అభిప్రాయ మేమిటి?" సత్యం అడిగాడు, "బహుశా పద్మనాభం సరిగానే చెపుతున్నా డనుకొంటాను."

"నీ యిష్టమే నా యిష్టం."

౨౩

అప్పారావుగారు యిద్దరు ముగ్గురు ప్రసిద్ధ కళాకారులకు వీరిని పరిచయం చేశాడు. అందులో ఒకరు సత్యం చిత్రాన్ని కొన్న జమీందారుగారే. రెండవవారు చౌదరి. చౌదరిగారు సత్యం చిత్రాలు చూచి ప్రశంసించారు. రాబోయే చిత్రకళా ప్రదర్శనములో సత్యం చిత్రాలు తప్పక ప్రదర్శిస్తామని హామీ యిచ్చాడు.

జమీందారుగారి యింటి ప్రక్కనే చెట్టియార్ కాపురముంటున్నాడు. అతనికి నీరుల్లిపాయలు మొదలైన వ్యాపార

మున్నది. పట్నంలోని అనేక కంపెనీలకు డైరెక్టరు గూడా. పెద్ద భూస్వామి. చెట్టియార్‌కి కళంటే మంచి అభిరుచి వున్నదని జమీందారుగారు చెప్పారు.

చెట్టియార్ బంగళా చాల పెద్దది. ఆధునిక పద్ధతులలో నిర్మించబడింది. నాలుగు వైపులా దాదాపు మూడు ఎకరాల తోట వున్నది. నౌకర్లకు వేరు వేరు యిండ్లున్నవి. మూడు కారు లున్నవి. ఇంటిముందు భాగంలో నీరు తుంపర తుంపరలుగా పైకి చిమ్మే జలయంత్రా లున్నవి. దానికి నాలుగు వైపులా నగ్నమూర్తు లున్నవి.

చెట్టియార్ తలిదండ్రులు వెనకటి రోజులలో కొత్వాలు చావడివద్ద ఉల్లి పాయలమ్ముకొనేవారని ఎరిగివున్నవాళ్లిప్పటికీ చెపుతారు. ఇతని పినతండ్రికి గూడా మంచి వ్యాపార మున్నది. ఆయన లంకకు, రంగూనుకు ఉల్లి పాయల ఎగుమతి వ్యాపారం చేస్తాడు. ఆయన పిల్లలు, పోయిన ప్రపంచ యుద్ధంలో చచ్చిపోయారు. చెట్టియారే ఇప్పుడాయన వారసుడు. యుద్ధకాలంలో రెండు చేతులా డబ్బు కూడబెట్టి లక్షాధికారి అయినాడు. అనేక క్లబ్బులలో మెంబరుగూడా.

ఆయన సత్యాన్ని హాలులో కూర్చోబెట్టాడు. హాలు కనులు మిరుమిట్లు గొలిపేలా అలంకరించి వున్నది. అక్కడ వున్న కుషన్ చైరులలో మనిషి అమాంతం కనిపించకుండా దాక్కో వచ్చు. గోడలకు తాతతండ్రుల తైలవర్ణ చిత్రా లున్నవి. గోడలలో ఐదారు అలమరలుగూడా వున్నవి. వాటిలో పెద్ద పెద్ద పుస్తకా లున్నవి. ఫర్నిచరు, మామూలు సామానులా వాటి నెంతో భద్రంగా అక్కడ దాచారు.

"అయితే అబ్బాయ్! నీకీ జమీందారు గారితో ఎప్పుడు పరిచయమైంది?"

"ఇప్పుడేనండి. నాలుగైదు రోజులక్రితం నేను నా చిత్రా లమ్ముకొందామని వారి యింటికి వెళ్లాను."

"ఏమైనా కొన్నాడా? ఆయనేదో దివాలా తీస్తున్నా డనుకొంటున్నారు?"

"ఆఁ ఒక చిత్రం కొన్నారు. ఆయనేదో గొప్ప వంశములో పుట్టినట్లున్నాడు?"

"ఆఁ ఏమి గొప్ప వంశం? ... పిత్రార్జితంతో జీవించడముగూడా గొప్పంటయ్యా! స్వయంగా సంపాదించి ఖర్చుపెడితే అదిగో అప్పుడు గొప్పవాడనేది" అంటూ చెట్టియార్ సత్యం చిత్రాలు చూస్తున్నాడు. "సరే పోనీయ్. ఆయన పెద్ద మనిషే. ఎంతకు కొన్నా డేమిటి?"

"యాభై రూపాయలకు."

చెట్టియార్ రెండు చిత్రాలు ఎన్నుకొన్నాడు. రెండు వందరూపాయల నోట్లు అతని చేతిలో పెడుతూ "చాలునా! మీ జమీందారుగారితో గూడా చెప్పు" అన్నాడు.

జమీందారు, ఆయన వంశం ఏమైనా కానీ సత్యానికి చెట్టియార్ కళాప్రియునిలా కన్పించాడు. చెట్టియారుగారి గోడకు వ్రేలాడుతున్న చిత్రాలను చూచి "నేనూగూడా యిలాంటి చిత్రాలను వేయగలను" అన్నాడు.

"నాకుకావలసిన చిత్రాలన్నీ యిదివరకే వేయించాను. అవసరమొస్తే నీకు తప్పకుండా కబురుచేస్తాను."

"ఎవరైనా మిత్రులతో..."

"మంచిది" అంటూ చెట్టియార్ తల గోక్కొంటూ కాసేపాలోచించి "ఆఁ! నారాయణచెట్టియార్ అనే బంధు వొకాయన వున్నాడు. బహుశా ఆయనకు తైలవర్ణ చిత్రం అవసరం కావచ్చు. మొన్ననే అతని తండ్రి పోయాడు. నేను ఉత్తరం వ్రాసి యిస్తాను. అతనిని కలుసుకోండి. అప్పుడప్పుడు వస్తూండండి." అంటూ చెట్టియార్ ఉత్తరం వ్రాసి ఇచ్చాడు. ఆయన ప్రభావం సత్యంమీద బాగా పనిచేసింది.

సత్యానికి ఏనుగు కున్నంత సత్తువ వచ్చింది. సంతో షంతో యింటికి వెళ్లాడు. అతని యింటిముందు చిన్నకారాగి యున్నది. అందులో ఆదినారాయణ, వెంకటేశ్వర్లు వగైరాలు కూర్చుని వున్నారు. ఇంటి తలుపు తెరిచి వున్నది. తలుపు చాటున నళిని, స్తంభాన్ని ఆనుకొని పద్మనాభం వున్నారు.

"అరే! ఏమిటోయ్! మహా హుషారుగా కన్పిస్తు న్నావ్"?

"ఇంకా రెండు చిత్రా లమ్ముడు పోయినవి."

"నీ పంట పండింది. పెద్ద యిల్లు అద్దెకు తీసుకో. డబ్బుకు భయపడబోకు. వచ్చే పోయే వాళ్ళతో వ్యాపారం వృద్ధి అవుతుంది. బస్తీలలో వున్న కిటుకే యిది. సరుకేమీ లేకపోయినా డాబుసరిగా వుంటే డబ్బు దానంత టదే వెతు క్కొంటూ వస్తుంది. ఇదే పట్నవాసపు పద్ధతి. అడిగే దిక్కే వరు. చూడు. చిన్న హోటళ్ళలో ఏ వస్తువులైతే అమ్ము తారో పెద్ద హోటళ్ళలోగూడా అదేవస్తువు లమ్ముతారు. భేదమల్లా ఏమిటంటే అక్కడికంటే యిక్కడ మూడునాలుగు రెట్లు ధర ఎక్కువ వుంటుంది. ఈనాడు నీ చిత్రానికి యాభై

రూపాయ లిచ్చినవారే రేపు నీ యింటికి వచ్చి అయిదు వంద లిస్తారు. ఈ యిరుకు కొంపలో వుంటే నీ ముఖం చూచేవాడుండడు. ఆదినారాయణగారు గూడా యీ యిల్లు చూచి సిగ్గు పడ్డాడు."

"సిగ్గుపడితే తిరిగి వెళ్లమని చెప్పు." అన్నాడు సత్యం కోపంగా.

"అరే! నీ అవసరం. అనవసరంగా కోపం తెచ్చుకోకు. కోపగించుకొంటే లాభంలేదు, నీలో నీవు బాధపడడం తప్ప" అన్నాడు పద్మనాభం.

ఇంట్లోకి వెళ్ళి సత్యం రెండు వంద రూపాయల నోట్లు నళిని చేతిలో పెట్టాడు. నళిని చాల సంతోషించింది. సామాన్యంగా చిత్రకారులు ఆకటితో మాడి చస్తారని ఆమె అనుకొనేది. కాని సత్యం అదృష్టం బాగున్నదని భావించింది. అన్న వస్త్రాలకు చాల అవసరముగా నున్నది. చాలసార్లు ఉపవాసాలు గూడా చేయవలసి వచ్చింది. ఆకలితో మాడి చావవలసిన అవస్థ తప్పింది. నళిని రూపాయలు చందువా పెట్టెలో పెడుతూ "ఎందుకు నీ వలా ఊరికే కోపగించుకొంటావ్? పద్మనాభం నిజమే చెపుతున్నాడు" అన్నది.

"అతను అబద్ధం చెపుతున్నాడని నే నెప్పుడన్నాను?" అంటూ సత్యం బయటకు వచ్చాడు. పద్మనాభం ఆదినారాయణతో ఏదో మాట్లాడుతున్నాడు. సత్యాన్ని చూడగానే అతను సత్యం వద్దకు వచ్చాడు. కారు వెళ్ళిపోయింది. ఆదినారాయణ సత్యాన్ని చూచి చిరునవ్వునవ్వాడు.

"ఈయన కారెప్పుడుకొన్నాడు?" అన్నాడు సత్యం.

"ఫిలుము తియ్యి తియ్యకపో. ఫిలుము తీయదలుచు కొన్నవాడు మొట్టమొదట చేయవలసిన పనేమిటంటే కారు కొనటం. లేకుంటే ఆయనముఖం చూచేవాళ్లుండరు. స్టూడియో వాళ్లు పలకరు. ఎగ్జిబిటర్లు పలకరు. అందాకా ఎందుకు ఎక్స్ట్రాలు పలుకుతారా అంట. ఇక్కడ బ్రతకాలంటే యిదేపద్ధతి. అందుకే నీకు నేనుచెప్పేది ఈ యిల్లుమార్చరాలని. దగ్గర లోనే మంచియిల్లున్నది. లేకుంటే నాయింట్లోవుండు. నీ హఠం మాని నామాట విను."

"సరే, కాని వారిప్పుడెందుకొచ్చారు?"

"నళిని వాళ్లఫిలుంలోనాట్యం చేయాలట. అందుకోస మని నీతో మాట్లాడుదామని వచ్చారు. సరే అన్నీ నేను చూచుకొంటాను, మీరు సందేహించకండి అని వారికి నచ్చచెప్పాను."

"నళిని ఏమంటున్నది?"

"ఆమె ఒప్పుకొన్నది. ఆమెకు నాట్యమంటే మహా సరదా. అందులోనూ ఫిల్ములో నాట్యంచేయడమంటే..."

"చూద్దాం"

"మంచిది. మళ్లీ కలుద్దాం. నాకు కొంచెం పనివున్నది." అంటూ పద్మనాభం తొందరతొందరగా వెళ్లిపోయాడు. ఆదినారాయణ వాకిట్లో అతనికొరకు ఎదురుచూస్తున్నాడు.

"నీ అభిప్రాయమేమిటి?" అని సత్యాన్ని చేయిపట్టు కొని అడిగింది నళిని.

"ఆలోచిద్దాం. ఇది బాగా ఆలోచించవలసిన సున్నిత మైన విషయం. నన్ను తప్పుగా అర్థంచేసుకోబోకు. సినిమా

వాళ్లు నృత్యకళను ఖూనీచేస్తున్నారని విన్నాను. అశ్లీల భావ భంగిమలు చూపించడంలో వారి ప్రతిభను కనపరుస్తున్నారు. నాలుగుడబ్బులకోసమని గౌరవమర్యాదలు వెచ్చించవలసి వస్తుంది. తెలిసిందా? అందులో ఇది అతని మొదటిపిక్చరు. ఎప్పుడు పూర్తి అవుతుందో, అసలు పూర్తి కానేకాదో ఎవరూ చెప్పలేరు. మొదటిపిక్చరులోనే నీ నృత్యం దెబ్బతింటే తిరిగి నిన్నెవరూ బుక్ చేయరు. ఇదీగూడా ఆలోచించవలసిన విషయం."

"నీ విలా ఆలోచిస్తూ నేవుండు. ఆ వచ్చిన అవకాశం కాస్తా చేయిజారిపోతుంది." అంటూ నళిని ఏడుపుముఖం పెట్టింది.

"నీవు నాట్యం చక్కగా నేర్చుకొంటే యింతకంటే మంచిఅవకాశాలే వస్తవి. అరే! అన్నట్లు పద్మనాభంతో మాష్టరుగారిని గురించి అడుగుదామని మరచిపోయాను."

నళిని ముఖం చిన్నబుచ్చుకొని ఒకమూల కూర్చున్నది.

"చూడు. నీవునన్ను తప్పుగా అర్థంచేసుకొంటున్నావు."

నళిని మాట్లాడలేదు.

"ఇవాళ నీవు సంతోషంగా వుండాలి. భగవంతుడు రెండు వందల రూపాయ లిచ్చాడు. నిజంగా మద్రాసు చాల విచిత్రమైన నగరం. కురిసిందా రూపాయల వర్షమలా కురుస్తుంది. లేదా ఒక్క చుక్కగూడా వర్షించదు."

సత్యం నళినిని ఓదార్చడానికై ఆరోజు సినిమాకు తీసుకొని వెళ్లాడు. కొత్త బట్టలు గూడా కొన్నాడు.

## ౨౬

"నీవు తిరిగి వచ్చేయి నాయనా! ఈవిధంగా కాలం వృథాగా పాడుచేయడం నీవంటి బ్రాహ్మణ కుఱ్ఱవానికి తగదు. వంశపారంపర్యంగా వస్తున్న వృత్తిని విడిచి నీవిలా తిరగడం బాగుండలేదు. నీవు వచ్చేటప్పుడు కాస్త తెలియజేసి వచ్చినా బాగుండేది. తల్లి లేని పిల్లవాడవని ఎంతో గారాబంగా పెంచాను. పెంచినందుకు నీ ఋణ మీలా తీర్చుకొంటున్నా వన్నమాట. ఈ వృద్ధాప్యంలో నాకు నీవు చేయవలసిన మేలిదేనా?" అంటూ తండ్రి కొబ్బరిచెట్టు క్రింద సత్యానికి రహస్యంగా బోధిస్తున్నాడు.

సత్యం ఒక్కసారిగా వెక్కి వెక్కి ఏడవ సాగాడు. అతను తండ్రి మాటకు జవాబు చెప్పగలడు. ఈ ప్రశ్నకు జవాబు యిదివరకే ఆలోచించి అట్టే పెట్టాడు. కాని ఆయన ఎదుట నోరెత్తి మాట్లాడ లేకపోయాడు. ఇంతలో అతనిలో పితృవాత్సల్యం పెల్లుబికింది. తండ్రి తన కేమివ్వలేదు. ఆయన కున్నదంతా యిచ్చాడు. సాధారణంగా తండ్రులు యివ్వలేని అవకాశాన్ని, స్వేచ్ఛని తన తండ్రి తనకు యిచ్చాడు. ఏది కావలెనంటే అది యిచ్చాడు.

"ఏడుస్తా వెందుకు? ఎంత చెడు పేరు సంపాదించుకొన్నామో తెలుసా? నీవు కొత్తపట్నంలో వున్నంతవరకు నే నెవరినీ లక్ష్యపెట్టలేదు. నీ విప్పుడిక్కడ వున్నావు. నేను ఊరిలో అందరిముందు తల ఎత్తుకు తిరగ లేకుండా వున్నాను. ప్రతివాడూ నా వంక వ్రేలెట్టి చూపించేవాడే! గుసగుసలాడే వాడే! ఆదినారాయణ సహకారం గూడా పోయింది. ఆయన

గూడా పిచ్చివాడయి యిక్కడకు వచ్చాడు. కొత్తగాకట్టించిన మేడ పాడుపడింది. దేవాలయములోకిగూడా ఎవరూ రావడం లేదు. వృద్ధాప్యంలో యీ బాధలన్నీ భరించవలసి వచ్చింది. ఇదేనా నీవు నాకు చేయవలసిన మర్యాద?"

సత్యం ముఖానికి చేతులడ్డు పెట్టుకొని ఏడవసాగాడు.

"నేను ఏడవవలసింది నీవు ఏడుస్తా వెందుకురా? ఇదంతా నా తప్పు. నిన్నసలు మొదటినుండి యింత స్వేచ్ఛగా తిరగనివ్వడం నా తప్పు. జరిగినదేమో జరిగింది. ఇక యింటికి వెడదాంపద."

సత్యం ఏడుస్తూనే వున్నాడు.

"ఏడిస్తే లాభ మేమిటి? నేను బయటకు వెళ్లి వస్తాను. ఇంటికి వెళ్ళడానికి సిద్ధంగావుండు. ఒక బ్రాహ్మణ కుఱ్ఱవాడు వేశ్య వెంట తిరుగుతాడటరా? బాగా ఆలోచించుకో. పెద్దవాడవైనావు. కాస్తయినా తెలివివుండాలిరా. మన వంశ గౌరవాన్నయినా కాపాడరా?" అంటూ అనంతకృష్ణశర్మ గద్దించాడు.

బహుశా సత్యం యీ గద్దింపులకు సిద్ధపడే వున్నాడు. ఆ ప్రేమపూర్ణమైన పితృ హృదయంలో నుండి వచ్చే ఒక్కొక్క మాట ములికిలా అతని హృదయాన్ని దూసుకు పోతుంటే సహించలేకపోయాడు. తాను తండ్రి పట్ల తీరని అపరాధం చేశానని భావించాడు. కాని కంఠం సవరించుకొని "అక్కడకు వచ్చి నేనేమి చేసేది. ఇక్కడ నా పని యిప్పు డిప్పుడే ప్రజలు గుర్తిస్తున్నారు. ఆదాయంగూడా బాగానే వున్నది" అన్నాడు.

"సంపాదించాలంటే కొత్తపట్నంలో గూడా మార్గమున్నదిరా నాయనా!"

"ఉన్నది. కాని నేనక్కడ బొమ్మలు గీసి కానీగూడా సంపాదించలేను."

"నీ కులవృత్తివలన ఆకలితో మాడి ఎవరూ చావలేదు."

"ఆ వృత్తి నాకిష్టంలేదు".

"ఎందుకు యిష్టముంటుందిరా? ప్రేమ పిచ్చిలో పడ్డావు. కంళ్లు తెరిచినప్పు డర్థమౌతుంది. ఏదో యిరుగు పొరుగు గదా, చిన్న పిల్లలు ఏదో కలిసి ఆటలాడుకొంటారు. పాటలు పాడుకొంటారనుకొన్నాను. నేను కలలోగూడా అనుకోలేదురా నాయనా; నీ విలా పిచ్చివానిలా దాని వెంట తిరుగుతావని...అయితే నీవు కొత్తపట్నం రావా?"

"తిరిగివస్తే నాకక్కడేమీ లాభం కనిపించడంలేదు."

"లాభం కనిపించడంలా? నీ యింటికి నీవు వెళ్లడానికి గూడా లాభం కనిపించాలన్నమాట. ఆఁ అయితే నీవు దీనితోనే వుంటావా?"

సత్యం జవాబివ్వలేదు. కాని అతని భావభంగిమలను బట్టి తండ్రి సూచన నతడు అంగీకరించి నట్లులేదు.

అనంతకృష్ణశర్మ కనుల నీరు నించాడు. అతని కనుగొలుకులనుండి అశ్రుబిందువులు చెక్కిళ్ళమీదుగా జారి టపటప క్రిందపడుతున్నవి. ఆయన తన ముఖాన్ని ప్రక్కకు త్రిప్పుకొన్నాడు. సత్యంగూడా ఆయనవంక చూడలేక

పోతున్నాడు. కొంతసేపైన తరువాత అనంతకృష్ణశర్మ కన్ను లొత్తుకొని "అయితే యింటికిరావా ?" అన్నాడు.

అనంగీకార సూచకంగా సత్యం తలాడించాడు.

"సరే! నేను చెప్పేది విను. నీవీ పిల్లను పెండ్లి చేసు కొంటే నే నేనుయ్యో గొయ్యో చూచుకొని ఆత్మహత్య చేసుకొంటాను. సాయంకాలము దాకా ఆలోచించుకో. నేను మళ్ళావచ్చి కలుసుకొంటాను" అంటూ వెక్కి వెక్కి ఏడుస్తూ వెళ్లాడు.

సత్యంగూడా ఏడుస్తూనే యింట్లోకి వెళ్ళాడు. నళిని వంటపనిలో వున్నది. సత్యం చాపమీద పండుకొన్నాడు. అతని ఎదుట పెద్ద సమస్య వున్నది. పితృవాత్సల్యం సత్యాన్ని తనవైపుకు యీడుస్తున్నది. కాని తన ప్రాణము నళినివైపు నకు లాగుతున్నది. సత్యం తండ్రి మాటలను, చేష్టలను అవ హేళనం చేశాడు. కాని నేడు పితృవాత్సల్య మతనిని కలవర పెడుతున్నది. మొదట్లో అతను కొత్తపట్నం తిరిగి వెళ్ల గూడదని నిశ్చయించుకొన్నాడు. కాని నేడా నిశ్చయాన్ని తలక్రిందులు చేయాలని ఆలోచిస్తున్నాడు.

అత నటూ యిటూ పొర్లిగింతలేస్తున్నాడు. "నేనిది వరకే నళినిని పెండ్లి చేసుకొంటే బాగుండేదేమో ? చెడ్డపేరు వచ్చేది. వస్తే మరేం పర్వాలేదు. తలాతోకా లేకుండా వాగే లోకుల నోళ్లకు కళ్లెంపడేది. ఇప్పుడు పెండ్లి చేసుకోవా లంటే తండ్రి ప్రాణం ఆహుతివ్వాలి. ఇది అమూల్యము. కనుక యిప్పుడు తొందరేం. కొంతకాల మాగుతాను." సత్యం కన్నులొత్తుకొని రెండవవైపుకు ఒత్తిగిల్లాడు. "ఒకవేళ

పెండ్లి చేసుకోకపోతే నళిని వూరుకుంటుందా? ఆమె వివాహం చేసుకుందామంటున్నది. హాఁ" అంటూ అతను లేచి కూర్చున్నాడు.

*　　*　　*　　*

"నాకు కొద్దిగా పని వున్నది. నేను బయటకు వెళ్లి వస్తాను." అన్నాడు నళినితో.

"భోజనం చేసివెళ్లు. తయారైనది. మీ నాన్నగారు ఏమన్నారు? ఆయనగారంత పవిత్రుడా? ఇంట్లో కాలన్నా పెట్టలేదు." అన్నది నళిని.

సత్యం మాట్లాడక పోయేసరికి — "ఇంతకూ ఏమంటా డేమిటి?" అన్నది.

"ఏమి చెప్పేది?" అంటూ అతను భోజనం ఎలాగో ముగించి అడయారు నదివైపు షికారుకు బయలుదేరాడు. అతని కేదైనా సమస్య ఎదుర్కొన్నప్పుడు యిలాగే షికారుకు బయలుదేరుతాడు. అత నటూ యిటూ తిరుగుతూ కాలం గడుపుతున్నాడు. కాని తన సమస్యను విడదీయలేక పోయాడు. పైగా యింకా చిక్కుపడింది. చీకటి పడింది. అతను కొంపకు చేరుకొన్నాడు.

వాకిట్లో అడుగు పెట్టగానే కాంచన పక్కచుట్ట చంకన బెట్టి వాకిట్లోనే ఎదురైనది. ఆమె నళినిని కౌగిలించుకొన్నది. "కనీసం ఒక ఉత్తరం ముక్కయినా రాయగూడదా అమ్మా ఫలానా చోట ఉన్నానని" అంటూ వెక్కి వెక్కి ఏడవసాగింది. "తెలిస్తే రెక్కలు కట్టుకువాలేదాన్నిగా! ఈ పిల్లాడిమూలంగా నా కిన్ని కష్టాలు వచ్చిపడినవి" అంటూ ఏడుస్తున్నది. ఆమె ప్రక్కనే పద్మనాభం నిలబడి వున్నాడు.

"జి. టి. కి వచ్చింది. నేను వెంటబెట్టు కొచ్చా" నన్నాడు పద్మనాభం

"ఈమె వస్తున్నదని నీ కెలా తెలుసు ?"

"ఆమే ఉత్తరము వ్రాసింది." అంటూ తమాయించు కొని "అవునవును. నేనే నళిని విషయం ఉత్తరం వ్రాశాను. అది అవసరం గూడా. ఎందుకంటే అసలే రోగిష్టిది. పైగా కూతురు దిగులుతో ఎక్కడ చస్తుందోనని నేనే ఉత్తరం వ్రాశాను. ఇది నీకుగూడా నీకు మంచిదేనోయ్. నళినికి అస్తమానమూ వంట వార్పులతోనే సరిపోతుంటే ఇక నాట్యం నేర్చుకొనే దెప్పుడు ? కాంచన వంట చేస్తుంటే నళినికి నాట్యం నేర్చుకోవడాని కవకాశం దొరుకుతుంది."

"అయితే నీవు మా నాన్నకు గూడా వ్రాశావా ?"

"అవును మద్రాసు రావడం తప్పకాదు కాని—"

"మంచి ఘనకార్యం చేశావు." అంటూ సత్యం తండ్రిని గురించి ఆలోచింపసాగాడు. ఆయన రావలసిన టయిము అయిపోయింది. నళిని ఆమె తల్లితో మాట్లాడుతున్నది. పద్మనాభం గూడా వారి మాటల్లో మధ్యమధ్య తనమాట కలుపుతున్నాడు. సత్యం బయట కొబ్బరిచెట్టు క్రిందకు పోయి కూర్చున్నాడు. అతను కాంచన ముఖం గూడా చూడరాదను కొన్నాడు. ఇంతలో అనంత కృష్ణశర్మ వచ్చాడు.

"ఏం! ఏమాలోచించావు ? వస్తావా రావా? నామాట విను. లేకుంటే చెడిపోతావు."

సత్యం మాట్లాడలేదు.

"ఒక్కగా నొక్క కొడుకువి. నిన్ను ఒదిలి వుండ లేను. లే, నాయనా! కొత్తపట్నం వెడదాం. నన్ను బాధ పెట్టడం నీకు క్షేమం కాదు."

సత్యం లేచి నిలబడ్డాడు. ఇంతలో పద్మనాభం కాంచన కేదో చెప్పి వాకిలివైపు వెళ్లాడు.

"వెళ్ళిరా నాయనా! నీ సామానేమైనావుంటే తెచ్చుకో. నా మాట విను. జరిగిందేమో జరిగింది. ఈ విధంగా ఇక్కడ వుండడం మంచిది కాదు." అన్నాడు తండ్రి.

"నీ మనస్సు కష్టపెట్టడం నాకిష్టం లేదు నాన్నా! కాని నేను ఒంటరిగా రాలేను. ఇంతకంటే నాకు వేరే మార్గంలేదు."

"అని నిశ్చయించుకొన్నావా?" అన్నాడు అనంత కృష్ణశర్మ కన్ను లెఱ్ఱజేస్తూ.

"అవును. ఇంతకన్న నేను చేయగలిగినదేమిటి నాన్నా!"

"సరే. బాగా ఆలోచించుకో."అంటూ అయన కన్ను లొత్తుకొన్నాడు."ఎప్పుడైనా డబ్బుకు అవసరం వస్తే ఉత్తరం వ్రాయి. కాని ..." అంటూ వాక్యాన్ని పూర్తి చేయలేక పోయాడు. బయటకు వెళ్ళిపోయాడు.

## ౨౭

"అరే బాప్ రే బాప్! ఇక్కడ పనిచేయడం మహా కష్టం" అనుకొన్నాడు సత్యం ఆవలిస్తూ. అతని ఎదుట ఒక గ్లాసులో చాలా బ్రష్‌లు వున్నవి. రంగు ట్యూబులు అటూ ఇటూ చెల్లా చెదురుగా పడి వున్నవి. చిత్రం సగము పూర్తి అయినది. కాలి గజ్జెల మ్రోత, తకధిం, తకధిం అనే తబలా మ్రోత అతని పనికి ఆటంకం కలిగిస్తున్నవి. కాంచన తాళం వేస్తున్నది. ఆమె ప్రశాంతంగా వున్నట్లు కనిపిస్తున్నది.

"ఇందుకే పెద్ద యిల్లు అద్దెకు తీసుకోమని చెప్పేది. ఇందులో మీా యిరువురపని నడవదు. జనం వస్తూ పోతూ వున్నారు గూడా." అన్నది కాంచన.

సత్యం జవాబివ్వలేదు. కాంచన చాలరోజులనుండి యీ యింట్లోనే వుంటున్నది. కాని సత్యంతో ఎన్నడూ మాట్లాడ లేదు. అత నుండడం ఆమెకు యిష్టంగూడా లేదు, లేనిపోని ఖర్చు దండుగ అనుకుంటుంది.

"అమ్మ నిజమే చెపుతున్నది. పద్మనాభం గూడా యీ మాటే అన్నాడు. ఎక్కడైనా మంచి ఇల్లు ఖాళీగా వుంటే మాట్లాడు." అన్నది నళిని తలుపుచాటునుండి.

సత్యం దీనికిగూడా జవాబుచెప్పలేదు. కొంచెంసేపు అటూయిటూ చూచి బ్రష్‌లు, సామాను వగైరా తీసుకొని చిరునవ్వు నవ్వుతూ తోటలోకి వెళ్లాడు. కొబ్బరిచెట్టుక్రింద అంత ఎండాకాకుండా, నీడాకాకుండా వున్నది. ఉదయం పది పదకొండుగంటల సమయం. ఏ చిత్రకారుడూ అలాంటి సమయములో అచ్చట చిత్రాలుగీయడు. కాని గత్యంతరంలేదు.

అతనెవరిదో ఫొటోని ఎన్‌లార్జిచేసి పెద్దదిగా వేస్తు న్నాడు. అది ఎవరో సేట్‌గారిపని. ఫొటోనిబట్టి నకలువ్రాయ డమే కనుక దీనికి ఊహాపోహలు, చాతుర్యము, కళాదృష్టి యేమీ అవసరములేదు. ఇలాంటిపనే సత్యానికి మామూలుగా దొరుకుతున్నది. కొద్దోగొప్పో సంపాదిస్తున్నాడు. ఇల్లు గడు స్తున్నది. పస్తులుండవలసిన అవసరంతీరింది. సత్యం అదృష్ట వంతుడే. లేకుంటే యితర చిత్రకారుల్లా పొట్ట చేత్తోపట్టుకొని ఏకాదశు లుండవలసివచ్చేది.

సమయం దొరికి నప్పుడల్లా సత్యం చిత్రాలు వేసేవాడు. అతని చిత్రాలు రెండు మూడు చిత్రాకళా ప్రదర్శనములో ప్రదర్శింపబడ్డాయి. వాటిని గురించి ప్రముఖ పత్రికలలో పతాక శీర్షికలు పెట్టి గొప్పగా వ్రాశారు. ఇతరంగా గూడా అతని కనేక ప్రశంశా పత్రాలందినవి. చౌదరిగారి పరిచయమైనది. ఆయనద్వారా నగరములోని చిత్రకారుల పరిచయం గూడా అయినది.

సత్యానికి పని దొరుకుతూనే వున్నది. ఆదాయము గూడా వృద్ధి చెందసాగింది. అతడు నళిని కోర్కెలను త్రోసి పుచ్చదలచ లేదు. అధికారం చలాయించడం అతని స్వభా వానికే విరుద్ధం. అతని కొక ఆదర్శమున్నది. ఇతరులు దానిని పొగడుతారా, తెగడుతారా అనే శంక అతనికిలేదు. తన ఆదర్శము వెంట యితరులుగూడా నడవాలని అతని కోరిక. నడవకపోతే పోనీ. ఫిర్యాదేలేదు.

నళిని భరతనాట్యమో, కథాకళో, లేక మరేదైనా శాస్త్రీయనాట్యమో నేర్చుకోవాలని అతనికోరిక. ఎవరైనా ప్రోత్సహించారో లేక ఆమెకే బుద్ధిపుట్టిందో తెలియదుగాని

నళిని సినిమానాట్యాన్ని నేర్చుకొంటున్నది. సినిమాలుచూచే పిచ్చి ఆమెకు మొదటినుండీవున్నది. పైగా మద్రాసువచ్చిన తరువాత సినిమాలలో యాక్టుగూడా చేయాలనుకొంటున్నది. ఇది ఆమెలో క్రొత్తగావచ్చిన పరివర్తన. ఇది సత్యానికి ఎంతమాత్రం యిష్టంలేదు. దీనిని గురించి యిరువురకూ పోట్లాటవరకూ పోయింది. కాని సత్యం ఆమె కోర్కెను కాదనలేక పోయాడు. ఇప్పుడు రోజూ నృత్య శిక్షకుడు వస్తున్నాడు. వాడిని పద్మనాభమే కుదిర్చాడు. వాడేదో స్టూడియోలో పని చేస్తున్నాడు. అందుచే అతను రావడానికి, పోవడానికి వేళా, పాళంటూ లేదు.

నళిని సంతోషమే తన సంతోషంగా భావించాడు సత్యం. ఆమె కేమాత్రం లోటు రానీయటంలేదు. ఆమెను ప్రపంచపు టంచుల కెత్తాడు. ఆమెతోడిదే లోకమని నమ్మాడు.

చిత్రం గీస్తూనే అతను దాదాపు ఒక నిశ్చయానికి వచ్చాడు. బస మారిస్తే బాగుంటుంది. అతను యింటిఅద్దె కొరకై నలభై యాభై రూపాయలు ఖర్చుపెట్టగలడు. ఆదాయాని కొకస్థాయి, నిలకడ లేకపోయి నప్పటికీ అతనికి ఆత్మ విశ్వాస మున్నది. భగవంతునిమీద నమ్మక మున్నది.

చిత్రం పూర్తికావస్తున్నది. పద్మనాభం పరుగెత్తి కొంటూ వచ్చాడు. అతను రోజూ వస్తూ పోతూనే వున్నాడు. వచ్చి సత్యం పనిలో జోక్యం తప్పకుండా కల్పించుకొన్నా సత్యం మాత్రం అతను వస్తూ పోతున్నందు కేమీ బాధపడే వాడుకాడు. అప్పుడప్పు డతడు తమకు చేతనైన సహాయం గూడా చేస్తున్నాడు.

"అరే బాబూ! నీవు అదృష్టవంతుడివా? లేక నళిని అదృష్టవంతురాలా?" అన్నాడు పద్మనాభం సత్యం చేతిలోని బ్రష్ లాక్కొంటూ.

"ఏమిటి సమాచారం? ఏమి జరిగింది?"

"మన కోడూరుజమీందారుగారికి గూడా సినిమాపిచ్చి యెక్కింది. ఆదినారాయణ ఆయనతో మాట్లాడినాడు. ఇప్పు డాయన గూడా పెట్టుబడి పెట్టడానికి వొప్పుకొన్నాడు. ఇంకెవ రెవరో భాగస్థులున్నారట. ఇక్క మనము డబ్బుకు యిబ్బందిపడ వలసిన పనిలేదు. తొందరలోనే పని ప్రారంభిస్తారట. ఇది ఆది నారాయణ కార్యదక్షత."

"బహుశా బస్తీ గాలి సోకిందనుకొంటాను."

"కాని ఆదినారాయణ పిక్చరు తీయడానికి ఏ షరతు లైతే పెట్టాడో జమీందారుగారు గూడా అలాంటి షరతులే పెట్టాడు. తీయబోయే సినిమాలో తన కుమారుడు యాక్టు చేయాలని ఆదినారాయణ అనగానే జమీందారుగారు నళిని భరతనాట్యం ఉండాలన్నారు. వారు సినిమా డాన్సులు వద్దంటున్నారు. కాని యీ రోజులలో భరతనాట్యం చూచే వాళ్లెవరయ్యా?"

"ఉన్నారు. ఎందుకు లేరు? కాని యదార్థమేమి టంటే సినిమా ఫీల్డులో భరతనాట్యం చేసే వాళ్ళు లేరు."

"నాకు భరతనాట్యం విషయంలో పట్టింపు లేదు కాని యీ వెంకటేశ్వర్లుని పెట్టుకొని సినిమా ఎలా తీస్తారయ్యా?"

సత్యం ఏదో ఆలోచిస్తున్నట్లు కనిపించాడు.

"నళిని గూడా సినిమాలో యాక్టు చేయాలనుకొంటు న్నది. ఆమె బాగా షైన్ అవుతుంది కూడా." అన్నాడు పద్మనాభం.

సత్యం ఆలోచిస్తునే వున్నాడు.

"జమీందారుగా రేమన్నారంటే నళినికి భరతనాట్యం నేర్పడానికి నాట్యాచార్యులను గూడా పంపుతా నన్నాడు. ఒక్క దెబ్బకు రెండు పిట్టలు. నాట్యం నేర్చుకొంటూనూ వుంటుంది, పని జరుగుతూనూ వుంటుంది. నీ చేతి డబ్బు కానీ ఖర్చు గాదు. అదృష్టవంతుడవు."

"మాకు పెద్ద యిల్లు కావాలి. ఇక్కడ పని చేయడం చాల కష్టంగా వున్నది." అన్నాడు సత్యం.

"నీవు చెప్పడమే ఆలస్యమైనది గాని యిల్లు దొరకడ మెంతసేపోయ్. జమీందారుగారికి కావలసినన్ని యిళ్ళు న్నవి." అన్నాడు నవ్వుతూ పద్మనాభం.

"కాని నాకు జమీందారుగారిఇంట్లో ఊరికే వుండడం యిష్టం లేదు. ఈ దానం నాకక్కర లేదు. ఇంకా ఎక్కడ నైనా వెదకి చెప్పు."

"భయపడకు. ఇండ్లకేం! చాలా దొరుకుతవి.నీవు పని చేసుకో, నేను మళ్ళీ వస్తాను." అంటూ పద్మనాభం లేచి కాంచన వద్దకు పోయి చాలసేపు మాట్లాడి వెళ్ళి పోయాడు.

## ౨౮

త్రేనాంపేటలోనే రెండంతస్తుల మేడ అద్దెకు దొరికింది. క్రింద ఎవరో సినిమా వాళ్ళుంటున్నారు. మేడకు నాలుగు వైపులా చిన్న తోటవున్నది. అన్ని వసతులతో ప్రశాంతము గానున్న యిల్లు.

సత్యం పని రోజురోజుకు అభివృద్ధి చెందుతున్నది. అతను పనిమీద పగలంతా బయట తిరగడముతోనే సరిపోతున్నది. నళిని నాట్యం నేర్చుకోవడంలో నిమగ్నురాలైంది. జమీందారు నియమించిన నాట్యాచార్యుడు రోజూ వస్తున్నాడు. ఇంట్లో ఎప్పుడూ సందడిగా వుంటున్నది. ఏదో నూతన ప్రపంచములో అడుగు పెట్టినట్లున్నది కాంచనకు. పద్మనాభంగూడా ఏదో ఒక వంకతో వస్తూనేవున్నాడు. ఒక్కొక్కసారి సత్యంతో మాట్లాడుతాడు. ఒక్కొకసారి కాంచనతో గుసగుసలాడుతాడు. ఒక్కొకసారి నళినిని చూచిపోదామని వచ్చానంటాడు. అతను డబ్బు బాగానే సంపాదిస్తున్నాడు. కాని ఇంతవరకు పెండ్లి చేసుకోలేదు. స్వభావంగూడా మంచిదికాదు. పత్రికలలో గూడా అతనినిగురించి అవాకులూ చవాకులూ వ్రాస్తున్నారు.

ఇవాళ ఉదయమే వచ్చాడు. సత్యం పనిమీద ఎవరో సేట్‌గారింటికి వెళ్ళాడు. అతను కాంచనతో మెల్లగా "ఇప్పుడే మంచి సమయం. అవకాశం దొరికినప్పుడు చెయిజారి పోనివ్వగూడదు. అదృష్టం తలుపు తడుతుంటే తలుపులు మూసుకోవడం కన్నా తెలివితక్కువ మరిలేదు" అన్నాడు.

"ఏఁనాయనా! ఏమిటి సంగతి?" కాంచన మృదువుగా అడిగింది. మామూలుగా కాంచన పద్మనాభంతో అతను

తన ఆత్మీయుడైనట్లుగా మాట్లాడుతోంది. అతనిని ప్రశం
సిస్తుంది. "మనిషంటే పద్మనాభమే మని"షని వచ్చినవా
రందరితో చెప్పేది.

"మీ అమ్మాయి హారంవేసుకు కూర్చున్నది. లేకుంటే
యీ పాటికి మేడ కట్టించకపోయిందా?"

"నేనుగూడా అదే చెపుతున్నాను నాయనా! నా.
మాట వింటేనా? ఆ బ్రాహ్మణ కుఱ్ఱవాణ్ణి పట్టుకు వ్రేలాడు
తున్నది. పోనీ డబ్బున్నవాడైనా ఫరవాలేదు. నళిని ఎప్పటి
కైనా బంగారంతో తులదూగకపోతుందా? అనే ఆశతో
జీవిస్తున్నాను నాయనా! సరేకాని ఏమిటో అదృష్టమన్నా
వేమిటి బాబూ!"

"నేనిప్పుడే కోడూరు జమీందారుగారి వద్దకు
వెళ్ళాను, వారిక్కడే వుంటున్నారు నీకు తెలుసా?"

"వారె! ఎందుకు తెలియదు నాయనా?"

"వారు నళిని నాట్యాన్ని చూడాలనుకొంటున్నారు.
డబ్బు యిస్తున్నారు. పని చూపిస్తున్నారు. నాట్యం కావాలి.
మన ఫిలుం విడుదల కావడమే తరువాయి. అప్పుడు
చూడాలి, నళిని పేరు మ్రోత. జమీందారుగారు డబ్బివ్వక
పోతే ఫిలుం గూడా అంతటితో ఆగిపోతుంది. సామాన్య
మనుకొన్నావా? నాలుగు లక్షలు ఖర్చవుతుంది."

"నీవు నళినితో మాట్లాడావా?"

"ఆమెతో మాట్లాడడమే కష్టంగా వున్నది."

"ఇటు కులవృత్తి చేసుకోకుండా అటు పెండ్లికాకుండా
ఆ పిచ్చిముండ నీ బ్రాహ్మడు తన మాయమాటలతో బంధించి
గానుగలోవేసి పిండినట్లు పిండుతున్నాడు."

"సత్యం వట్టి కంత్రీ. వాడిని నేను బాగా కనిపెడు తున్నాను. వాడు మామూలుబ్రాహ్మడు కాడు. పూజారి కొడుకు. చూస్తూవుండు. నళినినెప్పుడో మోసంచేస్తాడు. నీవు నళినితో గట్టిగా ఎందుకు చెప్పవు?"

"ఏమి చెప్పమంటావ్?"

"వాడు నళినిని నిజంగా ప్రేమిస్తే పెండ్లి యెందుకు చేసుకోడు?"

"పెండ్లా!"

"అవును."

"నళినితో అతని వివాహం జరగడాని కేంతమాత్రం వీలులేదు."

"అవును, చమురుకాళ్ళ పెద్దమ్మకు నళినినిచ్చి పెండ్లి చేయమని నే నన్నానా? ఆమె ఎంత లోతునీటిలో వున్నదో ఆలోచించుకోమని నళినితో చెప్పు. ఆమె కండ్లు తెరుస్తుంది. పెండ్లికి సుతరామూ వొప్పుకోడు. అప్పుడు చూచుకో. నీ పది వ్రేళ్లూ నేతిలో నానుతవి."

"నా ఆయుస్సుగూడా పోసుకొని నూరేళ్లు బ్రతుకు నాయనా! నీవు నిజమే చెపుతున్నావు. ఆ పిచ్చిది కండ్లు మూసుకున్నది. ఇన్నిరోజులనుండి వీడిదగ్గర వుంటున్నది. ఇక చాలు."

"ఇంకొక మంచివార్త చెపుతాను. నళిని మాపిక్చరులో డ్యాన్సుచేస్తుంది. పాటగూడా పాడుతుంది."

నళిని ప్రక్కగదిలో ఏదో డాన్సుగీతాన్ని అభినయపుర స్సరంగా ఆలపిస్తున్నది. పద్మనాభం ఆ గదిలో అడుగుపెట్ట

గానే డాన్సుమాష్టరు తనపై అధికారి వచ్చినట్లు బయటకు వెళ్లిపోయాడు.

"నళినీ! నీకు సంగీతమంటే యిష్టమేగా! మాఫిలుంలో పాడుదువుగాని" అన్నాడు పద్మనాభం.

"సత్యాన్ని కనుక్కొని పాడమంటే అలానే పాడతాను."

"అతను నాట్యం నేర్చుకోవడాని కనుమతించినపుడు గానాని కెందు కనుమతింపడు. ఇలాంటి అవకాశం అన్నప్పుడల్లా దొరకదు."

నళిని మాట్లాడలేదు.

"నేను మ్యూజికల్ డైరెక్టర్ని గదా! నేనే స్వయంగా నేర్పుతాను." అంటూ అతను జేబులో నుండి చిన్న పుస్తకం తీసి దగ్గరలోనే ఉన్న హార్మోనియం వద్ద కూర్చుని ఏదో రాగాన్ని ఆలపించసాగాడు. అతని కంఠ మాధుర్యాని కాశ్చర్యపడుతున్నట్లుగా నళిని అతని వంక చూడసాగింది. అతని సంగీతం, కంఠమాధుర్యం ఆమెను ముగ్ధురాలిని చేసినవి. బస్తీలలో తిరుగుతూ వచ్చి మోసగాడు అయినా డని ఆమె కేమి తెలుసు.

కొంచెంసేపు పాడిన తర్వాత "నీవు మా యింటికి ఒక్కపర్యాయమూ రా వెందుచేత?" అని ప్రశ్నించాడు.

"ఆఁ ఆఁ" కొంతసేపాగి "సత్యాన్ని తీసుకొని తప్ప కుండా వస్తాను" అన్నది.

"నీవు సత్యాన్ని తీసుకొని వస్తానని చెపుతున్నావు. మరి సత్య మేమో నిన్ను వదలి ఒంటరిగా తిరుగుతున్నాడు. అత నిప్పటికీ కొత్తపట్నం గబ్బిలాయేనని నీ వెప్పుడైనా

ఆలోచించావా? పేరు ప్రతిష్టలు వచ్చినవి. భూస్వాముల, జమీందారుల అండ దొరికింది. అదిసరేగాని యీ మాట విన్నావా? ఎవరో ధనవంశీకుల పిల్లతో 'బీచి'లో తిరుగు తున్నాడట. ఎవరైనా అడిగితే ఆమె బొమ్మ గీస్తున్నానని వంక చెపుతాడట. బ్రాహ్మడు. తిరుగుబోతు. వాడిమీద యింత నమ్మక మేమిటి?"

నళిని చుబుకానికి చేయిచేర్చి కొంచెంసేపు అలా విచారంగా కూర్చున్నది. తరువాత లేచి తల్లి వద్దకు పోయింది. వెంటనే పద్మనాభంగూడా పాచిక పారినదనుకొంటూ చిరునవ్వు నవ్వుతూ వెళ్ళిపోయాడు.

౨౯

వెరినా హోటల్ పైఅంతస్తులో టీపార్టీ జరుగుతున్నది. ఎరిగున్న మిత్రులంతా ఆహ్వానింపబడ్డారు. కృష్ణమూర్తి, రుక్మిణుల వివాహం జరిగింది. సన్నాయి మేళాలు లేవు. బాజాభజంత్రీలు లేవు. మంగళసూత్రం లేదు. పసుపు కుంకుమలు లేవు. ఆధునిక కాలంలో, ఆధునిక పద్ధతిలో రిజిష్ట్రరాఫీసులో పెండ్లిచేసుకొన్నారు.

ఫర్లాంగు దూరంలో సముద్రుడు గర్జిస్తున్నాడు. కొత్త పట్నంలోగూడా సముద్ర మిలానే ఘోషపెడుతుంది. సత్యం పాత స్మృతులను నెమరుకు తెచ్చుకొంటున్నాడు. నళిని అతని ప్రక్కనే శిలావిగ్రహంలా కూర్చున్నది. ఇంతకుముందామె టీపార్టీల కెప్పుడూ రాలేదు. సిగ్గుపడిన దానిలా

కన్పిస్తున్నది. చాలామందికి పద్మనాభం నళినిని పరిచయం చేశాడు. ఆమె "నమస్తే" అని మౌనం వహించేది. పెదవి కదిపి ఒక్క మాట మాట్లాడలేక పోయేది. ఆమె కిప్పటివరకు యీ నవనాగరిక ప్రపంచముతో పరిచయం లేదు.

కృష్ణమూర్తి కథారచయిత. ఆదినారాయణ తీయబోయే సినిమాకు కథ, స్క్రిప్టు యీయనే వ్రాస్తున్నాడు. వయస్సు ముప్పై లేక ముప్పైరెండు సంవత్సరా లుంటుంది. అయిదారు సంవత్సరాలనుండి సినిమాఫీల్డులో తిరుగుతున్నాడు. కాని దారిద్ర్యము అతని వెంబడే తిరుగుతున్నది. పోనీ పేరు చూద్దామా! తెరమీద ఒక్క క్షణం కనిపించిమాయమవుతుంది. అతనెప్పుడు చూచినా అసంతుష్టుడుగా కనిపిస్తాడు. ఎందుకంటే నిర్మాతలు, దర్శకులు అతను వ్రాసింది వ్రాసినట్లుండ నివ్వరు. వారి యిష్టము వచ్చినట్లు చించి, మార్చి, అతుకులబొంత చేస్తారు.

చాలమందికి రుక్మిణితో పరిచయంలేదు. ఆమెనాలుగైదు సినిమాలలో అయిదారు నిముషాలు పనిచేసింది. వయస్సు యిరవై లేక యిరవై రెండు సంవత్సరా లుంటుంది. తేనాంపేటలోనే వుంటున్నది. జాతికి బ్రాహ్మణ పిల్ల అంటారు. అయినప్పటికీ ఆమె తల్లి వేశ్య. కృష్ణారావుగూడా బ్రాహ్మడే.

పార్టీలో పద్మనాభం అందరికంటే హుషారుగా కన్పిస్తున్నాడు. పెండ్లికూతురు కూడా మధ్య మధ్య అతనివంక వోర చూపులు చూస్తున్నది. ఆమె పరిచితురాం డ్రామెను ఏకాంతంగా తీసుకొనిపోయి గుసగుసలు పోయేవారు. పరిహాసం చేసేవారు. ఆమె తప్పించుకొని నళినివద్దకు వచ్చి కూర్చునేది.

సత్యం గూడా విచారంగా వున్నాడు. అతడు చాలా మందిని చూచాడు. కాని యిలాంటి గుంపు నెక్కడా చూడ లేదు. అతనికి భయం వేస్తున్నది. అతను ఏకాంతాన్ని కోరు తున్నాడు. అతనికి ఏకాంతమంటేనే యిష్టం.

తొమ్మిది తొమ్మిదిన్నరకు పార్టీ ముగిసింది. ఇంటికి వచ్చేసరికి పదిగంటలైనది. వెన్నెల విరిసింది. నళిని, సత్యం మేడపైకి వెళ్ళి కూర్చున్నారు. చుట్టుపట్ల ప్రశాంతంగా వున్నది. అందరూ నిద్రావస్థలో నున్నారు.

నళిని పిట్టగోడమీద కూర్చున్నది. ఆమె మనసు నేదో కలత పెట్టుచున్నది. ఆమె తల్లివంటిది కాదు. ఇతర స్త్రీల స్వభావంవంటి స్వభావం కూడా కాదామెది. ఆమెలో మాతృ హృదయంలోవుండే మమత వున్నది. యవ్వనవతియైన వేశ్యలో వుండే చంచలత్వ మున్నది. ఆమెను సరిగా అధ్యయనం చేస్తే మనకు అర్థమయేదేమిటంటే ఏదో వస్తువు తయారవుతూ అవుతూ సగంలో ఆగిపోయిన ట్లున్నది.

రుక్మిణి వివాహం యీామె ఆలోచనలను రెచ్చగొట్టింది. రుక్మిణిని యిదివరకు రెండు మూడు సార్లు చూచింది. పద్మనాభాన్ని వెతుక్కొంటూ ఒక పర్యాయం తమయింటికి వచ్చింది. ఆమెను గురించి యిదివరకు చాలా సంగతులు విన్నది. ఆమె...ఇవాళ...వివాహం చేసుకొన్నది....అదిగూడా ఒక బ్రాహ్మడితో...ఆమె చకితురాలైనది.

సత్యం గూడా సందిగ్ధావస్థలోనే వున్నాడు. నళినిగూడా పెండ్లి చేసుకొందామని ఎక్కడడుగుతుందోనని అతని భయం. దానికి ఏమి జవాబు చెప్పుదామా? అని ఆలోచిస్తున్నాడు.

ఏదైనా ఆలోచన తడితే అది అంత మంచిదిగా, సంతోషజన కంగా కనిపించడంలేదు. మరి ఏమి చేయాలి? తండ్రి సల హాను అవహేళనం చేయడం సులభంకాదు. ఈ ఆలోచన లతో అతనొకచోట కుదురుగా కూర్చుండ లేక పోతున్నాడు.

"నిద్రవస్తున్నది?" సత్యం వెళ్లడానికి వంక పెట్టాడు.

"ఈ పండు వెన్నెలలో నిద్రవస్తున్నదా? రోజూపోయే నిద్ర కాదూ?" అన్నది నళిని.

సత్యం కూర్చున్నాడు.

"నేనూ ఆలోచించాను. మనం గూడా......"

"నాకు నిద్రముంచుకు వస్తున్నది. రేపు ఉదయమే తొందరగా వెళ్ళాలి."

"నేను మాట్లాడితే సరి. ఏదో తొందర పని వున్న దంటావు. బయటకు వెళ్ళాలంటావు. ప్రస్తుతం నీ ధోరణి బాగు లేదు. మీ నాన్న గారు వచ్చి వెళ్ళినప్పటి నుండి చూస్తూ వున్నాను, నీ ధోరణి మారింది" అన్నది నళిని.

"నీ అనుమానమే గాని ఏమీ మారలేదు."

"అయితే యిలా ఎంతకాలమని వుంటాం— ఇది ప్రపంచం. నలుగురూ ఆడిపోసు కొంటారు. ముఖాలెన్ని వున్నవో నోళ్ళూ అన్నే."

"ప్రపంచాన్ని గురించి చాలా తెలుసుకొన్నట్లున్నావే!"

"ఎలా చెప్పను?"

"నాకు తెలుసు నీవు చెప్పబోయే దేమిటో."

"అనుకునేవాళ్లు ఏమేమి అనుకుంటారో ఎలా తెలుస్తుంది? కాని మనం గూడా......"

"అనుకు నేవాళ్ళు పెండ్లి చేసుకొన్న తరువాత గూడా అనుకుంటూ నే వుంటారు. ఇప్పుడు తొందరేమిటి ? అయినా నీ కివ్వాళ యీపిచ్చి పట్టుకొన్న దేమిటి ?" సత్యానికి వుండి వుండి తండ్రి మాటలు గుప్తికి రాసాగినవి.

"కాని..."

"భయపడకు. నే నింకెవరినీ పెండ్లి చేసుకోబోవడం లేదు. వెళ్ళు. పండుకో—చాల ప్రొద్దుబోయింది." సత్యం నళినిని క్రిందకు తీసుకొని పోయాడు. నళినికి శ్వాస బంధించినంత పని జరిగింది.

## 30

**మ**రుసటి రోజు నళిని సత్యంతో మాట్లాడలేదు. ఆమె అలిగింది. ఆమెకు కోపం వచ్చింది. ఆమె హృదయానికి దెబ్బ తగిలింది. ఆమె అతనిని తప్పించుకు తిరుగుతున్నది. ఆమె యీ విషయం తల్లితో గూడా చెప్పలేదు. ఆమె నిప్పులు కక్కుతున్నది. లోపలనుండి పైకుబుకి వచ్చే తుఫానును ఎలాగో అణచుకొంటున్నది.

సత్యంగూడా ఆమెకు నచ్చజెప్పటానికి ప్రయత్నించ లేదు. మాట్లాడితే మాటకు మాట ఎక్కడ పెరుగుతుందో నని అతని భయం. అత నామెను ఊరడించలేక పోతున్నాడు. తండ్రిమీాద కోపంవస్తుంది. బాగా ఆలోచించి సిగ్గుపడు తున్నాడు.

పనిగూడా చేయలేకపోతున్నాడు. చౌదరిగారి వద్దకు వెడితే ఆయనగూడా కోపపడ్డాడు.

"ఏం బాబూ! ఇప్పుడు గీస్తున్న చిత్రాలు చూపించ వేం? ప్రస్తుతం చిత్రాలు వేయడంలేదా?" అని అడిగాడు.

"అవునండి. చాలా కొద్దిగా వేస్తున్నాను. ప్రస్తుతం ఫొటోగ్రాఫులను ఎన్‌లార్జి చేయడంతోనే సరిపోతున్నది."

"ఆ పనిగూడా చేస్తున్నావన్నమాట?"

"చేయకపోతే జరగడంలేదండి."

"చిత్రాకారులు ఆకలితో మరణిస్తున్నారంటే ఎందుకు మరణిస్తున్నారు? వారు తమ ఆదర్శాలతో రాజీపడలేక పోతున్నారు. ఎప్పుడైతే యిలా చేస్తారో చిత్రకారులంటూ ఉండరు."

"కాని..."

"అవునవును. కష్టాలువస్తవి. నేనుగూడా అనుభ వించాను. కష్టాలను సహించగలిగినప్పుడే చిత్రకారుడు పరి పక్వం చెందుతాడు. నీ వీ పనిచేస్తే నీలోని కళాతృష్ణ తీరదు. సంపాదనగూడా అంతంతమాత్రంగానే వుంటుంది. ప్రతి దారికి గమ్యమంటూవుంటుంది. కేవలంపొట్టకూడేకాదు కావలసింది."

"జీ"

"నవయువకుల్లోయింకొక చెడుఅలవాటు గూడా వున్నది. నాలుగైదు చిత్రాలు వ్రాసేటప్పటికే ప్రాణాలు దిగజారి గర్వం ఎగబ్రాకుతుంది. నా అంతవాడు లేడని విఱ్ఱవీగుతారు. అందుచేతనే భారతదేశంలో యీనాడు చిత్రకారుల సంఖ్య చాల స్వల్పముగా నున్నది."

సత్యానికి కొత్తపట్నంలో తాను గడపిన స్వతంత్ర జీవనం జ్ఞప్తికి రా సాగింది. అక్కడ తను నిశ్చింతగా చిత్రాలు

వేసుకొనేవాడు. ఈనాడు యిక్కడ గూడా చిత్రాలు గీస్తూనే వున్నాడు. కాని ఆ సంతృప్తి, నిశ్చింతలేదు. పేరు ప్రతిష్టల కొరకు తన కళను విక్రయించుకొంటున్నాడు.

"పైగా నీ మీద బాధ్యత లేమున్నవి? పెండ్లికాలేదు. నీ ఒక్క పొట్టకు ఎలాగో సంపాదించుకోలేక పోలేవు. కళా సాధన చెయ్యి."

సత్యం మెదలకుండా కూర్చున్నాడు. ఆయన ఎదుట తన దుఃఖ గాథను వినిపింప దలచలేదు. అతను కాలాన్ని చంపడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని కాలమే అతనిని చంపుతున్నది. కాసేపు యీ మిత్రుని వద్దకు, వెడతాడు. కాసేపు ఆ మిత్రుని వద్దకు వెడతాడు. ఒంటరిగా వెళ్ళి సినిమా కూడా చూచి వచ్చాడు.

మరుసటిరోజు గూడా యిరువురూ అలా కోపంగానే వున్నారు. సత్య మేదైనా అడిగితే నళిని పెడసరంగా జవాబు చెప్పేది. ఆమె నృత్య శిక్షకుణ్ణి గూడా పంపించి వేసింది. తల్లితో గూడా మాట్లాడడం లేదు. దీనికి దయ్య మేమైనా పట్టిందా అని తల్లికి అనుమానం.

సాయంకాలం పద్మనాభం వచ్చాడు. అతను చాల విచారంగా వున్నట్లు కనిపిస్తున్నాడు. ఆ విచారానికి కారణం తెలుసుకొని అందరూ లోలోపల నవ్వుకొన్నారు. బాపినీడు ఒక్కసారిగా అదృశ్యమైనాడు. అతని కొరకు వెదకి వెదకి పద్మనాభం విసిగి వేసారిపోయాడు. ఎరిగివున్న చోట్లకల్లా టెలిగ్రాము లిచ్చాడు. మిత్రుల యిళ్ళన్నీ వెదికాడు. కాని అతని జాడ కనిపించలేదు.

ఈ సంఘటనే యిదివరకు జరిగివుంటే సత్యం, నళిని పొట్ట చెక్కలయ్యేలా నవ్వేవారు. కాని యీ మాట విని ఒకరిముఖా లొకరు చూచుకొంటూ కూర్చున్నారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

రెండురోజులతరువాత బాపినీడు ఎవతో చెడిపోయిన దానిని లేవదీసుకొని కొత్తపట్నం పారిపోయాడని అసలు విషయం బయటపడింది. అతను మాంచి మజాలోవున్నాడు. ఇన్నిరోజులకు అతనికోరిక తీరింది. అతను తనస్వంతయింటిలోనే వుంటున్నాడు. ఈ మద్రాసునగరంలోవుండే గంద్రగోళము అతను సహించలేకపోయాడు. పెద్దచెట్టును ఒకచోటనుండి త్రవ్వి మరొకచోట నాటితే సామాన్యంగా ఎండి, మాడి పోతుంది.

ఈమాటవిని అంతా గొల్లున నవ్వారు. ఇంతలో సత్యంపేర టెలిగ్రాంవచ్చింది. అంతా నిశ్శబ్దంగావున్నారు. అనంతకృష్ణశర్మ దేహస్థితి ఏమీ బాగుండలేదట. ఇప్పుడా యింకాసేపా అంటున్నాడట. సత్యం మామ టెలిగ్రామిచ్చాడు. సత్యానికి పిడుగు మీదపడినట్లైనది. అతని కేమీ తోచలేదు. అతను కొత్తపట్నం తిరిగి వెళ్లాలనుకోలేదు. ఇప్పుడు వెళ్లక తప్పేదెలా ?

ఆ రాత్రి మెయిలుకే అతను కొత్తపట్నం బయలు దేరాడు.అతనిని స్టేషనువరకు పంపించడానికి నళినికూడా వెళ్లింది. ఆమె ఏడుస్తున్నది. సత్యంగూడా కళ్లొత్తుకొంటూనే సెలవు తీసుకొన్నాడు.

## ౩౧

సత్యం మద్రాసు వెళ్లినప్పటినుండి అనంతకృష్ణశర్మ ఆరోగ్యం సరిగా వుండడంలేదు. ఆయన పరిస్థితి నానాటికి క్షీణింపసాగింది. మద్రాసు వెళ్లివచ్చినప్పటినుండి మంచం పట్టాడు. సేవా శుశ్రూషలు చేయడానికిగూడా ఎవరూలేరు. ఈయన లేవలేనికారణంగా కొత్తపట్నంలోని దేవాలయం స్థితిగూడా అసహాయుడైన రోగిస్థితిలాగున్నది. పూజాపునస్కారాలమాట అటుంచి దీపారాధన చేసే దిక్కుగూడా లేదు.

సత్యం రాత్రింబవళ్లు తండ్రివద్దనే వుంటున్నాడు. మందూమాకూ యిప్పిస్తున్నాడు. కోడూరునుంచి డాక్టరు రోజూ వస్తున్నాడు. కాని రోగమేమిటో నిర్ధారణ చేయలేక పోతున్నాడు. అనంతకృష్ణశర్మ రోజురోజుకూ క్షీణించిపోతు న్నాడు. ఎముకలుమాత్రం మిగిలాయి. సత్యం తండ్రిని మద్రాసు తీసుకుపెడతానన్నాడు. కాని డాక్టరు అనుమతించలేదు.

దగ్గరబంధువు విధవావిడ ఒకామెవున్నది యింట్లో. ఆమె వంటచేస్తుంది. కొత్తపట్నంలోనున్న పరిచితులు, అపరిచితులు రోజూ వస్తూ పోతున్నారు. దూరదూరాలనుండి చుట్టాలుగూడా వస్తున్నారు. సత్యం ఇటు తండ్రిని అటు చుట్టాలను చూసుకోవలసి వస్తున్నది. మద్రాసులో సంపాదించిన డబ్బు కొద్దో గొప్పో వున్నది. దానితో సరిపెట్టు కొస్తున్నాడు.

అనంతకృష్ణశర్మ కొడుకువంక చూస్తూ మంచంమీద పడి వున్నాడు. అతని ముఖంలో ఎల్లప్పుడూ ఒకే భావం గోచరిస్తున్నది. అది పితృవాత్సల్యం.

సత్యం బంధువులంతా చేరి "ఇది మామూలు రోగం కాదురా నాయనా! మానసిక రోగం. మానసిక రోగానికి మందు లేదంటారు." అనసాగారు. సత్యం మాట్లాడకుండా తలవూపేవాడు. ఈ రోగానికి తానే కారణమని మనసులో గుర్తించాడు. కాని గత్యంతరం లేదు.

"నీ వాయన యిష్టానుసారంగా పెండ్లి ఎందుకు చేసుకోవు! అలా పెండ్లి చేసుకొంటే నీవొక యింటివాడవవుతావు. ఆయన ప్రాణాలు నిలుస్తవి."

సత్యం సందిగ్ధంలో పడ్డాడు.

ఒకరోజు అనంతకృష్ణశర్మ సత్యాన్ని తన మంచము వద్దనే కూర్చుండబెట్టుకొని యిలా అన్నాడు. "నీ తల్లి ఇవాళ వుండివుంటే..." సత్యం కనులలో నీరు తిరిగింది. అతనెప్పుడో మాతృవాత్సల్యానికి దూరమైనాడు. అందుచే అతను మాతృవాత్సల్యంకొరకు అఱ్ఱులు చాస్తున్నాడు. మాతృప్రేమకొరకు అంగలారుస్తున్నాడు.

"నేనింకా ఎన్నాళ్ళు జీవిస్తానో తెలియదు. నా మాట విని నీ మామ కూతుర్ని వివాహం చేసుకో. ఇప్పుడామె యవ్వనవతి అయింది గూడా. చచ్చి స్వర్గంలోవున్న మీ అమ్మ యీ సంబంధానికి చాల సంతోషిస్తుంది. ఇవాల్టి సంబంధం కాదిది. తరతరాలనుండి వస్తున్నది. ఏమంటావు నాయనా!"

సత్యం శిలావిగ్రహంలా కూర్చున్నాడు. అతను భవిష్య జ్జీవితాన్ని గురించి ఆలోచింపసాగాడు. అతను నళిని కేమీ మాట యివ్వలేదు. కాని నళినిని పెండ్లి చేసుకోవాలనే దృఢ

సంకల్పం అతనిలో వున్నది. అందుకనే ముందుగానే ఆమెకు మాటయివ్వలేదు. "తండ్రిగారికి నచ్చజెపితే యీ వివాహాని కనుమతించరా ?" అనే ఆశతో యింతవరకు నెట్టుకొచ్చాడు.

"నాయనా! మంచి కుటుంబం. వంశంపేరు నిలబెట్టు. జరిగినదేమో జరిగింది. నా మాట నిలబెట్టు. లేకుంటే ఏమి జరుగుతుందో ఆ భగవంతునికే తెలియాలి." అంటూ సత్యం మామ సత్యానికి నచ్చచెప్పసాగాడు.

సత్యం మారు మాట్లాడలేక పోయాడు. పైగా తండ్రి చూపులు శూలాల్లా గ్రుచ్చుకొంటున్నాయి. ఆయన యిది వరకెన్నడూ తననేమీ కోరలేదు. పైగా ఆయనకున్న సర్వస్వం తన కొరకై బలిదానం చేశాడు. అమ్మ చనిపోయేనాటికి నాన్నకు రెండవ వివాహం చేసుకోవడానికి తగిన వయస్సే. కాని తన శ్రేయస్సు నాకాంక్షించి తనకు పోషణ సరిగా జరుగదనే ఉద్దేశ్యంతో ఆయన ఆజన్మాంతం విదురుడుగానే వుండి పోయాడు. తాను తెచ్చిన చెడుపేరును సహించాడు. పొరపాటునైనా తనను పల్లెత్తుమాట అని ఎరుగడు. దేని సహాయ్యంతో తాను పెరిగి పెద్దవాడై అభివృద్ధి చెందాడో ఆ వాత్సల్యలత నిపుడెలా త్రెంచివేయగలడు...?సత్యానికి యీ విషయాలన్నీ బాగా తెలుసు.

అతను వరండాలోకి వెళ్ళి కూర్చున్నాడు. అక్కడ నారాయణబాబా కూర్చుని వున్నాడు. అనంతకృష్ణశర్మ జబ్బుగా వున్నందున మంచి చెడ్డలు విచారించడాని కప్పుడప్పుడూ వస్తుంటాడు. అత నంత్యకులజుడు. అందుచే వరం

డాలో నుంచే పలకరించి పోతుంటాడు. ఇది గ్రామరివాజు. కట్టుబాటు.

నారాయణబాబా సత్యంతో ఎక్కువగా మాట్లాడ లేదు. అత నిప్పుడే మద్రాసునుండి వచ్చాడు. పనిపాటలు చూసుకొంటున్నాడు. ఇదివరకు అతనివంక కన్నెత్తి చూడని వారంతా యిప్పు డతనితో ఏదో ఒక వంకపెట్టుకొని మాట్లాడ డానికి ప్రయత్నిస్తున్నారు.

"ఎందుకు మోరాయిస్తావు? తండ్రిమాట విను బాబూ!" అన్నాడు నారాయణబాబా.

సత్యం మాట్లాడలేదు.

"పెండ్లి చేసుకో బాబూ! పెండ్లి చేసుకొన్నా అది వేశ్యగనుక దానిని గూడా వుంచుకోవచ్చు. ఇటు మీ నాన్న గారి కోరికా నెరవేరుతుంది. అటు కాంచన అభ్యంతర మేమీ వుండదు."

సత్యం మాట్లాడలేదు. ఈ అభిప్రాయాన్ని నారాయణ బాబా స్వయంగా వెల్లడించాడు. దీని వలన సంతోషమే కలుగుతుందో, దుఃఖమే కలుగుతుందో ఎవరూ చెప్పలేరు. సత్యం యీ మాటలు వినిపించుకోదలచలేదు. "యింట్లో నుంచి ఎందుకు వెళ్ళిపోగూడదు?" అనుకొన్నాడు. "తండ్రికి నిజం చెప్పేస్తాను. అప్పుడూ ఆపద విరుచుకు పైనబడవచ్చు. చూస్తా ఏమి జరుగుతుందో" అతనింట్లో వుండలేకపోతున్నాడు, పారిపోలేక పోతున్నాడు. తండ్రి కనులు నిరంతరం అతనిని వెన్నాడుతున్నట్లు తోస్తున్న దతనికి.

అతను చేలగట్ల వెంబడే పడి కోడూరువైపు వెడు తున్నాడు. ఈ చేలగట్లలో నుంచే అతని జీవిత భాగ్యరేఖ ఉదయించింది. తా నపరాధినని భావిస్తున్నాడు. మంచంలో వున్న మూడుకాళ్ల ముదుసలిని విడిచి పారిపోవాలనుకొం టున్నాడు. కాని ఎవరో అతనిని వెనుకకు లాగుతున్నట్లు భావిస్తున్నాడు. అతను అడుగులు వేస్తున్నాడు.

అతను వంతెన వద్దకు చేరాడు. విచారంగా పిట్టగోడ మీద కూర్చున్నాడు. నీళ్ళవంక చూడసాగాడు. నీళ్ళల్లో నళిని ప్రతిబింబం కనిపిస్తున్నట్లు తోచిం దతనికి. "నళిని యెడల నా కర్తవ్యాన్ని నిర్వహించవలసిన బాధ్యత నామీద వున్న దంటే తండ్రి యెడల నా కర్తవ్యాన్ని నిర్వహించవలసిన బాధ్యతగూడా నామీద నున్నది." ఈ ఆలోచనలతో అతను ముందుకు సాగిపోతున్నాడు. వేణుగోపాలరావు కోడూరు నుండి వస్తూ ఎదురు పడ్డాడు.

"మీ నాన్నగా రెలాగున్నాడు?" అన్నాడు వేణు గోపాలరావు.

"అలాగే వున్నారు."

"నే నాయనను చూద్దామనే వెడుతున్నాను. మరి నీ వెక్కడకు వెడుతున్నావు?"

"కోడూరుదాకా వెళ్ళివద్దామని."

వేణుగోపాలరావు కొత్తపట్నంవైపు వెళ్ళాడు. వేణు గోపాలరావు సత్యంతో అంతకు ముం దెప్పుడూ మాట్లాడ లేదు. అనంతకృష్ణశర్మతో అతనికి పూర్వంనుండీ విరోధ

మున్నది. ఇప్పు డాయన జబ్బుగా వున్నాడని విని ఉండబట్టలేక చూచిపోదామని వస్తున్నాడు.

వేణుగోపాలరావు వెళ్లడం చూచి సత్య మిలా అనుకొన్నాడు. "ఆజన్మవిరోధులై వుండీ రోగంతో ఉన్నాడంటే చూడడానికి పోతున్నాడు. మరి నేను కన్నకొడుకునై వుండి పారిపోతున్నాను. విశ్వాసఘాతకుణ్ణి."

అతను కొత్తపట్నంవైపు మరలాడు. కాని తండ్రి కోరిక నెరవేర్చాలా లేదా? ఒకనిశ్చయానికి రాలేకపోయాడు.

## ౩౨

ఎలియడ్సుబీచిలో జనం గుంపులు గుంపులుగా చేరారు. నాలుగుకారులు నిలబడివున్నవి. నౌకర్లంతా అటూ యిటూ పరుగెత్తుతున్నారు. చాలమందిస్త్రీలుగూడావున్నారు. వెన్నెలతీరిచి కాస్తున్నది. సముద్రుడుత్తుంగతరంగ పంక్తులతో ఘోషపెడుతున్నాడు. అద్భుతమైన సంగీతం. అద్భుతమైన దృశ్యం.

కోడూరుజమీందారుగారు తన స్నేహితులతో కలిసి పిక్‌నిక్ చేస్తున్నాడు. ఆదినారాయణతప్ప జమీందారుగారి మిగతా స్నేహితులు చాలమందివున్నారు. నళినిని, కాంచనను గూడా ఆహ్వానించారు. నళినికి నృత్యంనేర్పేఅతను పిక్‌నిక్ ఏర్పాట్లన్నీ చేస్తున్నాడు.

ఎలియడ్సుబీచి మద్రాసుకు దక్షిణంగా అడయారు సమీపములోనున్నది. అక్కడెప్పుడూ జనం అంతగావుండరు.

సాధారణంగా ధనవంతులే అక్కడకు వెడతారు. వారి పిక్‌నిక్‌లే ఎక్కువగా జరుగుతుంటవి. పిక్‌నిక్ లేనప్పుడా ప్రదేశమంతా నిర్జనంగా, భయంకరంగావుంటుంది. ఒకటి రెండు స్మారకచిహ్నాలున్నవి. అవి సముద్రంలో మునిగి చనిపోయిన ఇంగ్లీషువాళ్లవి. దూరంగా బెస్తవాళ్ళగుడిసెలున్నవి. గవర్నరుగారికోసమని చిన్నబంగళాగూడా వున్నది. కాని ఎప్పుడూ ఖాళీగానే వుంటుంది. దగ్గరలో కొబ్బరిచెట్లున్నవి. ఒకవైపు చాల దూరంవరకు సరివితోటలున్నవి. తరువాత అడయారు కళాక్షేత్రంలోని పెద్దపెద్ద బంగళాలున్నవి.

చాలరోజులనుండి కోడూరుజమీందారుగారు యీ పిక్‌నిక్ ఏర్పాటు చేయాలనుకొంటున్నాడు. ఇప్పటికి అవకాశం చిక్కింది. నళినిని దృష్టిలోపెట్టుకొనే యీ పిక్‌నిక్ ఏర్పాటు చేసినట్లు తోస్తున్నది. సత్యం కొత్తపట్నంలో తండ్రి సేవాశుశ్రూషలలో మునిగివున్నాడు. నళిని కాంచనతో ఒంటరిగా యింట్లో వుంటున్నది.

నృత్యశిక్షకుడామె సమక్షంలో జమీందారుగారి కోరిక వుంచాడు. ఆమె అంగీకరించలేదు. "తండ్రి చావుబ్రతుకుల మధ్య ఆయనక్కడ. నేనిక్కడ విందు..." అన్నదామె.

ఇంతలో కాంచన అందుకొని "నీవేమో అతనంటే ప్రాణాలు విడుస్తున్నావు. నీవంటే అతని కేమీ లక్ష్యం లేదు." అన్నది. ఇదివరలో తల్లి యిలాంటి మాటలంటే కసురుకొనేది. సత్యం ముందు వివాహ విషయమెత్తేసరికి అతను ఉదాసీనంగా వుండడంవలన ఇప్పుడామెకేమిచేయాలో తోచడంలేదు. ఆమె సందిగ్ధావస్థలో పడింది. ఒకనిశ్చయానికి రాలేకపోతున్నది.

జమీందారుగారి ఆహ్వానాన్ని గురించి నృత్యశిక్షకుడు రోజూ పాఠం చెప్పినట్లు చెపుతున్నాడు. పిక్నిక్ అంటే నళినికి మొదట్లో ఉత్సాహం లేదు. రోజూ నృత్యశిక్షకుడు వచ్చి అనేక విధాల వర్ణించి చేప్పేవాడు. కాంచన దానికి తాళం వేసేది. రాత్రింబవళ్లు సత్యాన్ని ఆడిపోసుకోవడమే ఆమె పని. ఆమె దృష్టిలో కోటీశ్వరుడు జమీందారుగారు భగవంతునితో సమానం. వయస్సులో వుండగా ఎప్పుడైనా 'ఆయన మనిషిని అవుతానా'అని కలలుకనేది. పాపం కలలు కలలుగానే వుండిపోయినవి. ఆ అవకాశం చెల్లెలు జమునకు దక్కింది. ఇప్పుడెన్నేళ్లు వచ్చినా ఆ చెల్లెలుకే అణగి మణగి వుండవలసి వచ్చింది. దాని ముందు తల వంచుకు తిరగవలసి వస్తున్నది. బహుశా ఈర్ష్యగా గూడా వున్నదేమో? ఏమైనా సరే నళిని జమీందారుగారి పిక్నిక్కు వెళ్ళి తీరవలసిందే అనుకొన్నది.

నృత్య శిక్షకున కిప్పుడు మంచి అవకాశం దొరికింది. "చూడమ్మాయ్! నీ వొక్కదానివే వెళ్ళవలసిన పనిలేదు. మీ అమ్మ గూడా వెంటవస్తుంది. పెద్దవారి ఆహ్వానాన్ని తిరస్కరించడం శ్రేయస్కరం కాదు."

కాంచన గూడా నళినికి యిరవై నాలుగు గంటలు ఉన్నవీ లేనివీ నూరిపోసేది. మంచి చెడ్డలు చెప్పేది. నళినిని ఒప్పించాలని ఎన్నో విధాల తిప్పలు పెట్టేది.

తుట్టతుదకు నళిని పిక్నిక్కు వెళ్ళడానికి ఒప్పుకొన్నది. సాయంత్రము పద్మనాభం వచ్చేసరికి యీ విషయం చెప్పింది. ఈ మాట వినగానే అతను ఎగిరి గంతువేశాడు. ఎందుకంటే ఇది అతని కర్తవ్యం. అతను రోజూ వస్తూ పోతూనేవున్నాడు.

సినిమా పాటలు నేర్పుతూనే వున్నాడు. నళినికి ఎన్నో ఆశలు చూపిస్తూనే వున్నాడు. గంటల తరబడి మాట్లాడుతూనే వున్నాడు.

నళిని బలవంతంగా అతని వైపుకు మొగ్గుతున్నది. కారణం సత్యం ఉదాసీనత కావచ్చు. పద్మనాభం నేర్పుతున్న సినిమా పాటలు కావచ్చు. లేక సినిమాలలో యాక్టు చేసి పేరు ప్రతిష్టలు సంపాదించాలనే అభిలాష కావచ్చు. ఈ ఆకర్షణ ఎందుకో. సరిగా అర్థం కావడం లేదు.

"నీవు జమీందారు చేతిలో చిక్కవద్దు. వారు నమ్మక ద్రోహం చేస్తారు. పెద్ద రాతిక్రింద వ్రేలుపెడితే నలుగుతుంది. కోడూరు జమీందారుగారి విషయం చెప్పనే అవసరం లేదు. నీ పినతల్లినే చూడు." అంటూ పద్మనాభం ఫిల్ము కళాకారునిలా తన సంభాషణ చదువ సాగాడు.

పద్మనాభం యిలా అంటాడని నళిని ఊహించనైనా లేదు. అతను పిక్‌నిక్‌కి వెళ్లమనే ప్రోత్సహిస్తాడనుకొన్నది. అత నిలా సలహా చెప్పేసరికి అతని యెడల మరీ ప్రసన్నురాలైనది.

"మరి నేను మాట యిచ్చానే?"

"సరే. కొంచెం జాగ్రత్తగా మసలుకో. మీ అమ్మను గూడా వెంటబెట్టుకు వెళ్ళు." అన్నాడు పద్మనాభం.

నళిని చిరునవ్వు నవ్వుతూ, కండ్లు త్రిప్పుతూ అతనివంక అదోలా చూడసాగింది.

"కాని నళినీ!... నీవు గూడా...యీ విధంగా...మన యిరువురమూ ఒక్కచోట...మీ అమ్మ చెప్పలేదా?" అత

నేదో చెప్పబోయాడు. నళిని భావభంగిమను అధ్యయనం చేస్తూ అతను తూచి తూచి మాట్లాడుతున్నాడు. నళిని చిరునవ్వు నవ్వుతూనే వున్నది. కాని మొదట్లోనే యీ విషయం తెలిస్తే బహుశా పిల్లిలా అతనిమీదకు దూకేది.

పద్మనాభం చిరునవ్వు నవ్వి ఊరకొన్నాడు. "సరే. మంచిది. నాకు కొంచెం పని వున్నది. వెళ్లివస్తా" నంటూ వెళ్లిపోయాడు. తాను నళినిని పెండ్లి చేసుకొంటానని కాంచనతో పద్మనాభం లోగడే చెప్పి వున్నాడు. కాంచన యీ మాట విని ఉలిక్కిపడింది. నలుగురూ తన యింటికి వస్తూ పోతూ వుండాలని కాంచన కోరిక. నళిని వివాహ బంధంలో చిక్కుకోరాదని ఆమె తలంపు. వివాహం మాట ఎత్తనంత వరకు పద్మనాభం ఆమెకు బాగానే నచ్చాడు.

నళిని పిక్‌నిక్‌కు వెళ్ళింది. జమీందారామెను సంతోష పెట్టడాని కనుక్షణం ప్రయత్నిస్తున్నాడు. తల్లి నౌకర్లతో మాట్లాడుతున్నది. జమీందారు గారికి యితర అతిథుల విషయం పట్టలేదు. నళిని చాలసేపటివరకు మౌనంగా వున్నది. ఎన్నో విధాల బ్రతిమాలితే అప్పుడు మాట్లాడింది. ఆమె పసిపిల్ల కాదు. ఆమె కన్ని విషయాలూ సమగ్రంగా తెలుసు. తెలిసికూడా ప్రాణాలు బిగబట్టి వారితో మాట్లాడుతున్నది. బహుశా తప్పనిసరై మాట్లాడుతున్నది కాని ఆమెను నాట్యం చేయమని కోరగానే ఆమె నిర్మొగమాటంగా నిరాకరించింది.

అయినా జమీందారుగారు చాల సంతోషంగా కనిపిస్తున్నారు. ఆయన నళినిని సినిమాకు వెడదామని ఆహ్వానించాడు.

నళిని ఆయన వెంట సినిమాకు వెళ్ళడాని కంగీకరించలేదు. జమీందారుగారు ముఖం చిన్నబుచ్చుకొన్నాడు.

పదకొండు, పన్నెండు గంటలవరకు పిక్‌నిక్ జరుగుతూనే వున్నది. పన్నెండున్నరకు జమీందారుగారు తన కారులో నళినిని, కాంచనను వాళ్ళ యింటివద్ద విడిచిపెట్టాడు. యవ్వనవసంతం తిరిగి వచ్చినట్లు కాంచన ఆనందానికి మేర లేకపోయింది.

## 33

ఉదయం నళిని చాల ఆలస్యంగా నిద్ర లేచింది. ఆమెకు నిత్యకృత్యాలు తీర్చుకోవడానికి గూడా బద్ధకంగా వున్నది. ఆవలిస్తున్నది. కిటికీలోనుండి కొబ్బరి చెట్లవంక చూస్తున్నది. వాకిటికి కట్టిన తెర నటూ యిటూ కదుపుతున్నది. వేస్తున్నది. కూర్చుంటున్నది. ముఖంలో స్థాయీ భావం కనిపిస్తున్నది.

రోజూ ప్రొద్దెక్కేవరకు నిద్రపోయే కాంచన ఈరోజు నళినికంటే ముందే లేచింది. ఏదో ఆస్పత్రిలోకి పోతున్నట్లుగా వంటిట్లోకి పోయేది ప్రతిరోజూ. ఇవాళ తెల్లవారేసరికే ఉప్మా, కాఫీ చేసింది. ఎండి పాలిపోయిన ఆమె చెక్కిళ్ళలో నేడు కెంపుదనం కనిపిస్తున్నది. ఆమె ముఖం వికసించినదానిలా వున్నది.

నళిని ముఖం కడుగుకొని పలహారం చేయకుండానే దుప్పటి ముసుగుపెట్టి మరల పండుకొన్నది. ఆమె బుర్ర ఆలోచనలతో నిండిపోయింది. "సత్యంలేని సమయంలో నేను

జమీందారుగారి పిక్ నిక్ కు వెళ్ళడం సమంజసమేనా?" ఈ ప్రశ్న కనేక జవాబు లొచ్చేవి. ఈ జవాబుల ఔచిత్యా నౌచిత్యాలను గురించి మరల శంకించేది. ఆమె సందిగ్ధావస్థలో పడి కొట్టుమిట్టాడుతున్నది. తనలో తానిలా ప్రశ్నించుకొంటుంది. "నే నేం చేశాను? నేను రంగస్థలంమీద నాట్యం చేస్తుంటే సత్యం బయట కెక్కడకూ వెళ్ళకుండా అక్కడే కూర్చుంటాడా? నాకీమాత్రం అధికారంలేదా?" అని కొంచెంసేపు నిశ్చితంగా కూర్చునేది. మరల అంతలోనే కలవర పడేది. తనను తాను అపరాధినినిగా భావిస్తున్నదామె.

"ఏమమ్మా! ఫలహారమన్నా చేయలేదు?"

"ఊఁ" నళిని ఏదో సమాధానం చెప్పవలె నను కొన్నది. కాని చెప్పలేదు.

"నీవు తినకపోతే నేనూ తినను" అన్నది కాంచన.

నళిని రెండవ ప్రక్కకు ఒత్తిగిలి పండుకొన్నది.

కాంచన గడపమీద కూర్చుని గొణగసాగింది. "ఇన్ని రోజులూ నిన్ను పెంచి పెద్దదాన్ని చేసింది ఇందుకేనంటే? చెప్పూతున్నాను. చూడు. తల్లిమాట పెడచెవిని పెట్టి ఎక్కడుంటావో చూస్తా. తల్లిని మరచిపోయిన వాళ్ళెవరూ యీ ప్రపంచములో బాగుపడలేదు. తెలిసిందా? ఏం తప్పుడు పని చేశావని యిలా బాధపడతావు. ఇది మన కులవృత్తి. తర తరాలనుండి వస్తున్నది. ఎవరి కులవృత్తి వారి కున్నది. అందరికీ అన్ని వృత్తులూ వున్నాయి. జమీందారుగారు పెద్ద మనిషి. నే నెవరైనా రౌడీ ముండాకొడుకు దగ్గరకు తీసుకు వెళ్లానా? నీవు సీతవైనా, సావిత్రివైనా నాకూతురువేనని

తెలుసుకో. ఆ పూజారి బ్రాహ్మడి పెండ్లానివి కావు. కాలేవు. వేశ్య కూతురు చేయగూడని పని నీవేమీ చేయలేదే? ఈ నిరర్థక బ్రాహ్మడితో నీ జీవితం పాడు చేసుకోవడం నా కిష్టంలేదు. పెద్దదానను. చెప్తున్నాను. తరువాత నీ యిష్టం." అంటూ సణుగుతూ వెళ్లిపోయింది. కాని వెళ్లేది ఎక్కడకు? కాసేపు వరండాలో అటూ యిటూ కాలు గాలిన పిల్లిలా తిరిగి మరల లోపలకు వచ్చింది.

"అయితే నీవు ఫలహారం చేయవా? నా మాటలు నీకర్థంకాలేదా?"

"అబ్బా నన్నెందుకు వేధిస్తావే?" అంటూ నళిని లేచి ఉప్మా తినసాగింది.

"నాకు తెలుసు. మా అమ్మాయి తెలివి తక్కువది కాదని. ఈ ప్రపంచములో ఎవరి పనులు వారి కున్నవి."

"అవునవు" నంటూ జమీందారుగారు ముందు సూచనైనా చేయకుండా ఏకాయెకి గదిలో జొరబడ్డాడు. ఇది మర్యాదహీనమైన పని. తల్లి ఎదుట నళిని ఏమీ మాట్లాడలేక పోయింది. ఆయన హడాహుడిగా కూర్చున్నాడు.

జమీందారుగారు కాంచన చెవిలో "నీవు చెప్పేది యదార్థం. ప్రపంచములో డాక్టరులు లేనిదేశా లుండవచ్చు. జమీందారులు లేని దేశా లుండవచ్చు. ప్లీడర్లు లేని దేశా లుండవచ్చు. రాజకీయ నాయకులు లేని దేశా లుండవచ్చు. కాని వేశ్యా వృత్తి లేని దేశా లెక్కడా లేవు." అనిఅంటూ నవ్వసాగాడు. కాంచనగూడా తన బోసినోటితో నవ్వింది.

"నిద్రమత్తు వదలిందా?" అన్నాడు జమీందారు నళిని వంక తిరిగి. ఆమె సిగ్గుతో తలవంచుకొని తుండుగుడ్డ తీసికొని స్నానాల గదిలోకి వెళ్ళబోయింది.

"కూర్చో. అలా పారిపోతావేం. నీవు చాలా మంచి దానివిలా కనిపిస్తున్నావు. నీవు బాగా నాట్యం నేర్చుకోవాలని నా కోరిక. మద్రాసులో నాట్యకత్తెలు చాలమంది వున్నారు. నీవు వాళ్ళందరినీ తలదన్ని పోవాలి ... ఒక్క పర్యాయం పేరు సంపాదించావంటే ఇక సినిమా రంగంలో నీ పేరు మ్రోత మోగి పోతుంది. ఏమంటావు కాంచనా?"

"తమరు యదార్థం సెలవిస్తున్నారు." అన్నది కాంచన. కాని నళిని ఆయనవంక కన్నెత్తి అయినా చూడలేదు.

"నీవు అలసినట్లున్నావు. నేనుగూడా వెళ్ళాలి. సాయంత్రం అడయారులో నౌకా విహారానికి నీవు తప్పక రావాలి. వస్తావా?" అన్నాడు జమీందారుగారు.

"కాని..."

"ఏమీ అడ్డు చెప్పవద్దు. ఏం కాంచనా?"

"అయ్యో!"

"ఎప్పుడేది కావలెనన్నా కబురు చెయ్యి. నీవు డబ్బుకు యిబ్బంది పడగూడదు. మీరు బాధపడుతుంటే నేను సహించలేను." అంటూ ఆయన వెళ్ళిపోయాడు. నళినికి దేమీ నచ్చలేదు. కాని ఏమి చేయగలదు?

నళిని స్నానంచేసి బట్టలు మార్చుకొని గదిలో కూర్చున్నది. ఇంతలో నృత్యశిక్షకుడు వచ్చాడు. ఆమె తన ఆరోగ్యం

సరిగా లేదని వంక పెట్టింది. ఆమె ఏదో ఆలోచిస్తూ గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నది.

కొంచెం సేపైన తరువాత పద్మనాభం వచ్చాడు. అతను జమీందారుగారివద్ద నుండి వస్తున్నాడు. అతని జేబు బరువుగా నున్నది. అతను తన బ్రోకరు డబ్బు వసూలు చేసుకొన్నాడు — అతడు పిక్‌నిక్‌లో పాల్గొనకపోయినా అతని సలహామీదనే నళిని కొరకు జమీందారుగారు పిక్‌నిక్ ఏర్పాటు చేసాడు. ఇక్కడ అతను నళినికి జమీందారుగారి అవగుణాలన్నీ వర్ణించి చెప్పాడు. పద్మనాభం దొంగతనం చేసినా అతని కాలి జాడలుగూడా గుర్తుపట్టలేనట్లుగా చేస్తాడు. అతనికి ఒకనోరుకాదు, అనేకనోరు లున్నవి. ఒక హృదయం కాదు, అనేక హృదయాలున్నవి. అతడనేక వ్యక్తుల సమూహమవగలడు. ఒక్కొక్కప్పు డేకాకి అవుతాడు. మరొకప్పుడు మరొకటవుతాడు.

"నళినీ! నిన్న నీ వా పిక్‌నిక్‌కు వెళ్లడం మంచిదిగాదు. ఎంత చెడ్డపేరు వస్తుంది? సత్యానికి తెలిస్తే పాప మతనేమనుకొంటాడు? ఏమిజరుగుతుందో తెలియదు" అన్నాడు పద్మనాభం.

"తెలిస్తే కొంపలేమీ మునిగిపోవులే. అతనేం పుస్తె కట్టాడా? లేక డబ్బుపోసి కొన్నాడా? ప్రపంచం భస్మమైపోదులే" అన్నది కాంచన.

నళిని విచారంగా పక్కమీద కూర్చున్నది. ఆమె సందిగ్ధంలో పడింది. పద్మనాభం కాంచనతో యిలా అన్నాడు.

"నేనేదో ఒక్కమాట అన్నాను. ఇంతలో నీమేమో దూసి పోశావు" అత నొక్కక్షణం మాట్లాడలేదు.

"నీవిలా ఎంతకాలమని కూర్చుంటావు? రా. కాసేపలా తిరిగివద్దాం. బయట కారు సిద్ధముగావున్నది." అన్నాడు పద్మనాభం.

"కాని..."

"నీ వెప్పుడూ కాని...కాని అంటావు. భయపడకు. నా వెంటవస్తే సత్యమేమీ అనుకోడులే, అతనికి తెలుసు నా సంగతి. ఇలా ఎంతసేపని బాధపడుతూ కూర్చుంటావు."

నళిని తల్లి వంక చూచి ఆమె సమ్మతిసూచకంగా తల త్రిప్పడం గమనించి పద్మనాభం వెంట బయలుదేరింది. ఆమెకు, ఆమెతల్లికి, ఆదినారాయణకు, సత్యాన్ని ఎరిగివున్న మరికొంత మందికి తప్ప జమీందారుగారి పిక్‌నిక్‌కి నళిని వెళ్ళిందని తెలియదు. ఈ విషయం సత్యానికి తెలియగూడదని ఆమె తలుస్తున్నది. ఒకవేళ పద్మనాభం చెపితే...?

పద్మనాభం ఆమెను ఆదినారాయణ యింటికి తీసుకు వెళ్లాడు. నళినినిప్పుడు ఒత్తిడిచేయవలసిన ఆవశ్యకతలేదు. ఆదినారాయణ యవ్వనం తిరిగి వచ్చినట్లు ఆమెతో చాలసేపు సరసాలాడాడు. భోజనసమయమైనది. నళిని వెళ్లి కారులో కూర్చున్నది. పద్మనాభం చాటుగా ఆదినారాయణతో సలహా సంప్రతింపులు జరుపుతున్నాడు. బహుశా డబ్బువిషయం కావచ్చు. ఆదినారాయణ పీనాసివాడైనా పద్మనాభంముందు గుప్పిట ముడువలేడు.

నళిని పద్మనాభంతో యిలా అన్నది. "ఇవాళ జమీాం దారుగారు మరల కబురు చేశారు. ఏమి చేయాలో తోచడం లేదు. ఆపదలో చిక్కుకొన్నాను."

"నేను మొదటనే చెప్పలేదూ. ఆయన వలలో చిక్క వద్దని. చూస్తున్నావుగా ఆయనగారి వాలకం?"

"కాని నేనేమి చేసేది? ఆరోగ్యం బాగాలేదని చెప్తాను. ఏమో సత్యమెప్పుడు వస్తాడో తెలియదు?"

"అలా చేయబోకు. వాడు మొండి ముండాకొడుకు. రక్తం కండ్లచూట్టానికి గూడా వెనుకాడడు. అన్ని ఏర్పాట్లు నేను చేస్తాను. ఇవాళ నీవు వెళ్ళవలసే వుంటుంది. వీళ్ళతో జాగ్రత్తగా మెలగాలి."

నళిని అతనివంక భయంగా చూడసాగింది. పద్మనాభం మీాద ఆమెకు విశ్వాసం కుదిరింది. అత నేమి చెప్పితే అది చేయవలసిన స్థితిలో పడిన దామె.

"భయపడకు. నేను సత్యానికి ఉత్తరం వ్రాస్తాను."

అతను నళిని యింటిలోనే భోజనంచేసి నళినితో కాంచనతో చాలసేపటివరకు మాట్లాడుతు కూర్చున్నాడు.

సాయంత్రం నళిని నౌకావిహారానికి వెళ్ళక తప్పలేదు. నృత్యశిక్షకు డామెను వెంటబెట్టుకు వెళ్ళాడు. తల్లి యింటిలోనే వున్నది. నౌకలో వారిరువురే వున్నారు. జమీాందారు...నళిని.

ఆమె యింటికి చేరేసరికి అర్ధరాత్రి అయినది. ఆమె కనులశ్రుజలపూరితాలైనవి.

## ౩౪

సత్యం మారిపోయాడు. అతని కొక్కసారిగా జీవితం శూన్యంగానూ, ప్రపంచం నిర్దయత్వంగానూ తోచ సాగింది. అత నిరువదియైదు సంవత్సరాలకే ముసలివానిలా కన్పిస్తున్నాడు. తండ్రి మరణం అతనికి జీవితంమీద విరక్తి పుట్టించింది. అతను కొత్తపట్నంలో వుండలేకపోయాడు. వెంటనే మద్రాసు వచ్చాడు. పద్మనాభం యిప్పటివరకు సత్యానికి ఉత్తరం వ్రాస్తానని నళినితో చెప్పుతూనే వున్నాడు.

తాను భూమిమీదపడి కండ్లు తెరవక ముందే భగవంతుడు తల్లినీడ తనమీద పడకుండా చేశాడు. జీవితంలో మిగిలిన తండ్రి సహాయం గూడా తొలగించాడు. అత నేకాకి. అతనిముందు జీవిత మున్నది. భవిష్యత్తు వున్నది. ఈ సంఘర్షణలతో అతను భయభీతుడై చైతన్య రహితంగా కూర్చున్నాడు. అతనికి జీవితం తుచ్ఛంగా కన్పింప సాగింది. మృత్యుదేవత అట్టహాసాలముందు జీవిత కాంక్షలన్నీ నిరర్ధకంగా, నిష్ఫలంగా తోచసాగినవి.

అతను చాలరోజులు ఊరికే వున్నాడు. పని చేయవలెననే కోరిక గూడా కలగడం లేదు. ఊరికే యిక్కడకూ అక్కడకూ తిరిగేవాడు. తండ్రి మరణానికి తానే కారణమని, అపరాధినని భావిస్తున్నాడు. తండ్రి కోరిక తీర్చినట్లైతే ఆయన యిప్పటివరకు జీవించే వాడేమో ?

పట్నంలో పనిచేయకుండా బ్రతకడం చాలకష్టం. మరణం కోరికొన్నా తొంగిచూడడంలేదు. రాళ్లురప్పలు అడ్డువచ్చినా నది తన గమనం మారుస్తూనే ముందుకు సాగునట్లుగా జీవితం

ఎలానో సాగిపోతూనే యున్నది. పరిస్థితులతో పోరాడుతూ జీవితాన్ని భారంగా యీడుస్తున్నాడు. చిన్న చిన్న రాళ్లు నదీప్రవాహ వేగానికి మునిగిపోతవి. పెద్ద రాళ్లు అడ్డు కట్టల్లా నిలుస్తయి. చివరకు ఒక రోజు — కాలప్రవాహంలో కలిసిపోవటం జరుగుతుంది. ఒక జీవితం సమాప్త మౌతుంది. పరిస్థితుల మీాద మృత్యుపరదా దిగజారుతుంది.

ఇంట్లో చాల యిబ్బందిగా నున్నది. నళిని తలుచు కొంటే వేల రూపాయలు సంపాదించగలదు. కాని ఎన్నడూ అట్టి నీచాని కొడిగట్టలేదు. ఆమె విషయం సత్యానికి బొత్తి గా తెలియదు. సత్యానికి తగిలిన గాయాన్ని రేపేటంతటి నిర్ద యురాలుకాదు నళిని. సత్యమామెతో మునుపటిలా మాట్లాడ లేక పోతున్నాడు. అతను తన దుఃఖాన్ని మరచి పోవడానికి ప్రయత్నిస్తున్నాడు. నళినిని చూడగానే అతనికి తండ్రి గుప్తికి వస్తున్నాడు. నళినితో కలిసి మెలిసి వుండడం కష్టంగా తోస్తున్నది. కాని నళినిని విడిచి వుండడం అసంభవం. అతని జీవితం మేకుకు కట్టి వేసి నట్లున్నది.

ఎంత వరకు జీవముంటుందో అంతవరకు జీవితం నదిలా ప్రవహిస్తుంది. శూన్యజీవితం గూడా ప్రవహిస్తుంది. కాల గమనాన్ననుసరించి జీవనస్రవంతి గూడా పరివర్తనం చెందు తుంది. సత్యంలో కొద్దిగా పరివర్తన మొచ్చింది. పరివర్తనల ప్రభావం అతని మీాద పడింది.

అతను జీవితమైదానాన్ని విడిచి పారిపోలేకపోతున్నాడు. నిష్క్రియాత్ముడై అక్కడ వుండలేక పోతున్నాడు.

నళిని అతని మనస్సును సంతోష పెట్టడానికి ప్రయత్ని స్తున్నది. కాని ఆమె ప్రేమలో మార్పు, కృత్రిమత్వం గోచ రిస్తున్నవి. పెద్ద వృక్షమూలాన్ని ఆధారం చేసుకొని పై కెగ ప్రాకి చుట్టుపట్ల నున్న చెట్లమీదకు ప్రాకే లతలాగున్న దామెప్రేమ యిప్పుడు. కాని యీ విషయం సత్యానికి తెలిస్తే అతను తనను విడిచి వెళ్లిపోతాడేమో ననే భయం కూడా వున్నది. అందుచే ఆమె యితరత్రా సురక్షితమైన స్థానం కొరకు వెదకుతున్నట్లు కనిపిస్తున్నది. ఇది నిజం. సత్యం లేనప్పు డొక విధమైన ఆలోచనలు వస్తున్నవి. సత్యం ఉన్నప్పు డొక విధమైన ఆలోచనలు. చిన్ననాటి స్నేహం.

జీవన సమస్య. ఇంట్లో కూర్చుంటే పొట్టగడవదు. పైగా నళినిని పోషింపవలసిన బాధ్యత. తాత తండ్రు లిచ్చి పోయిన ఆస్థిపాస్థు లేమీలేవు. సంపాదించినది కాస్తా తండ్రి గారి మందు మాకులకు ఖర్చయింది. అప్పులుగూడా పెరిగి పోతున్నవి. ఇబ్బందులు రోజు రోజుకు పెరుగుతున్నవి. నళినికి నృత్యం నేర్పుతున్నాయనకు జీతం బాకీ వున్నది. సత్యం అకస్మాత్తుగా వూడిపడేసరికి ఏదో ఆపద ముంచుకొచ్చినట్లు కాంచన రాత్రింబవళ్లు సణుగుతున్నది.

చిత్రకారుల వృత్తి కొన్నాళ్లు వసంతము కొన్నాళ్లు హేమంతము. అతను చాల రోజులు పనికొరకై వెదికాడు. కాని మంచి పని ఒక్కటీ దొరకలేదు. చివరకు పద్మనాభం చెప్పినమీదట స్టూడియోలో పనిచేయటానికి ఒప్పుకున్నాడు. స్టూడియోలో పనిచేయడ మతనికి యిష్టంలేదు. రాత్రింబవళ్లు స్టూడియోపనితోనే సరిపోతుంది. రెండవ పని యేదైనా

చేసుకోవడానికి సమయం దొరకదు. ఏంచేస్తాడు. విధిలేక ఒప్పుకొన్నాడు.

ఇరువురూ పనిలో ఉన్నారు. సాయంకాలం ఎప్పుడైనా సత్యం యింటిదగ్గర వుంటే నళిని వుండదు. ఒకవేళ ఎప్పుడైనా యిరువురూ యింట్లో వుండవలసివస్తే సూటీ, పోటీలతో ఒకరి మీద వొకరు నేరారోపణ చేసుకొంటూ వుంటేవారు. అతి కష్టంమీద విశ్రాంతి దొరకుతున్నది. ఇలా జరుగుతున్నప్పటికీ సత్యం నళిని హృదయ సీమ నుంచి పూర్తిగా తొలగలేదు.

ఒక రోజు పద్మనాభం వచ్చి "నళిని మద్రాసు సంగీత సభలో నాట్యం చేయాలని జమీందారుగారు కోరుతున్నారు. ఇలా అయితే ఆమె పేరు బయటకు వస్తుంది. సినిమా విడుదల కాగానే నళిని పేరు మోత మ్రోగిపోతుంది. నళిని పేరు ప్రతిష్టలమీదే సినిమా సఫలత ఆధారపడి వున్నది. సరే. ఫిల్ము సంగతి ఆవలపెట్టు. నాట్యశాస్త్ర పారంగతులైనవారు నళిని నాట్యం చూస్తారు. వారికి నళిని నాట్యం నచ్చిందంటే నళినిచేసిన సాధన ఫలమైన దనుకో, తెలిసిందా?" అన్నాడు.

నళిని దగ్గరలోనే కూర్చునివున్నది. ఆమె సిగ్గుతో చిరునవ్వు నవ్వుతున్నది. సత్యం ప్రశాంతంగావున్నాడు.

"సభాసదులంతా వొప్పుకొన్నారు. నేను వారితో మాట్లాడివచ్చాను. నీవు నీచిత్రాలను ప్రదర్శనములో పెట్టి ఎలా పేరుప్రతిష్టలు సంపాదించి ఆనందిస్తున్నావో అలానే నళినిగూడా తన కళను ప్రదర్శించి పేరుప్రఖ్యాతు లార్జించాలి. పోనీ కొద్దిరోజు లాగుదామనిచూస్తే అవకాశం కాస్తా చేయి

జారిపోతుంది. కష్టాలు మనుషులకుకాక ద్రిమ్మాకుల కొస్తాయా ? చచ్చిపోయినవాళ్ల కొరకు ఎంతకాలమని ఏడుస్తాం ?"

"ఏం నళిని ? నీవేమంటావ్ ?" అన్నాడు సత్యం. అతని చేయి పట్టుకొని పైకిలేచి అతని భుజంమీద చేయివేసి "నీ యిష్టమే నాయిష్టం" అన్నది.

"డబ్బునుగురించి భయపడబోకు, జమీందారుగారిస్తా నన్నాడు" అన్నాడు పద్మనాభం దీమాగా. అతనేమిటో దయ చూపిస్తున్నట్లు "నేనీవిషయాన్ని గురించి ఆయనతో మాట్లా డాను. మీరేమీ భయపడవద్దు. అని కూడా అన్నాడు."

కిరసనాయిలుకగ్గిపుల్ల గీచి అంటించినట్లుగా సత్యం "ఎవ రిస్తే నేమోయ్ ? నేనింకా కుంటివాడిని, గ్రుడ్డివాడినికాలేదు. నాకూ కాళ్లూచేతు లున్నవి. ఆయనగారి దానధర్మాలతో, దయాభిక్షతో నళిని నాట్యం నేర్చుకోలేదు. అయితే గియితే ఎంతఖర్చవుతుంది?" అన్నాడు కోపంగా.

"లేదు, లేదు. నా ఉద్దేశమదికాదు. చిన్నతనంలో నళిని కాయన సహాయంచేశాడు..." అన్నాడు పద్మనాభం.

"చేసివుండొచ్చు. చిన్నప్పటిసంగతి వేరు. ఇప్పటిసంగతి వేరు. నీతినియమాలున్న జమీందారులు చాల అరుదుగా వుంటారు. వాళ్ళకు హృదయముండదు. కండ్లకు క్రొవ్వువెగదట్టి వుంటుంది. లేదు, నేనంగీకరించను. ఒకవేళ నళిని నాట్యంచేస్తా నంటే నా ఖర్చుమీదే నాట్యంచేస్తుంది. కాని జమీందారు ఖర్చుమీదకాదు. ఎంత ఖర్చు అవుతుంది ?"

"అయిదారువందలు" అన్నాడు పద్మనాభం మెల్లగా.

"రెండుమూడు నెలల్లోనే నీ డబ్బు సంపాదిస్తాను. అంత వరకూ నళిని యింకా బాగా అభ్యాసంచేస్తుంది." మందిరలోని దేవతామూర్తిని చూస్తున్నట్లుగా నళిని సత్యంవంక చూస్తున్నది. అపరాధిననే భావన ఆమె హృదయాన్ని గాయపరచి మంటపుట్టింప సాగినది. ఆమె బావురుమని ఏడవాలనుకొన్నది.

సత్యం శాంత స్వభావము కలవాడు. అతనికి కోపం సామాన్యంగారాదు. ఒకవేళ వచ్చిందో తనను తానదుపులో పెట్టుకోలేడు. పద్మనాభానికిది బాగా అనుభవమే. సత్యానికింత కోపంరాగా పద్మనాభ మెన్నడూ చూడలేదు. అతను చకితుడైనాడు. అధికంగా మాట్లాడ గూడదనుకొని వెళ్లిపోయాడు.

## ౩౫

పది పదిహేను రోజులు గడిచినవి. సత్యం అక్కడ స్టూడియోలో ఊపిరాడకుండా పని చేస్తుంటే పద్మనాభ మిక్కడ నళినితో బాతాఖాని కొట్టేవాడు. నళిని అతనిని ప్రసన్నుని చేసుకోవడానికి నిరంతరం ప్రయత్నిస్తున్నది. పద్మనాభం వద్ద ఒక మర్మమున్నది. అవసరమైతే దానిని నళినికి వ్యతిరేకంగా వుపయోగించగలడు. అందుకనే ఆమె అతని యిష్టాయిష్టాలపై ఆధారపడ వలసి వచ్చినది.

వీరిద్దరు కలిసి మెలిసి వుండటం కాంచనకు గూడా యిష్టమే. అప్పుడప్పుడు పద్మనాభం వద్ద డబ్బు గూడా గుంజేది. ఆమె దృష్టిలో సత్యం కంటే యితనే మెరుగు. మంచి వాడు కూడాను.

కోడూరు జమీందారు గారి వద్దకు నళిని వెళ్ళడం తనకు సుతరాం యిష్టంలేన ట్లభినయించేవాడు పద్మనాభం. కాని తానే సత్యం లేనిసమయంలో నళిని జమీందారు వద్దకు వెళ్ళి వచ్చే ఏర్పాటు చేయకతప్పలేదు. నృత్యశిక్షకుడామెను వెంటబెట్టుకు వెళ్ళేవాడు. ముప్పది సంవత్సరాల ప్రౌఢలా కాంచన ఆనందోత్సాహాలలో తేలియాడుతున్నది.

సత్యానికేమాత్రం తెలియకుండా యీ పనంతా జరిగిపోతున్నది. నళినిని కారులో ఎక్కించుకు పోయేవారు. ఒకవేళ ఎప్పుడైనా ఆలస్యమయితే రిహార్సల్సులో ఆలస్యమైనదని బొంకేది. సత్యానికీ పనేమీ నచ్చలేదు. సినిమాలలో చేరి యిలా విచ్చల విడిగా తిరగడ మతనికి యిష్టంలేదు. కాని నళిని హృదయానికి బాధ కలిగించ దలచలేదతను.

ఒక్క పర్యాయం స్త్రీ కాలు జారినదంటే తిరిగి దానిని సరిజేసుకోవడం కష్టం. బహుశా మాటి మాటికి అలా జారుతూనే వుంటుంది. బలవంతంగా పతనంవైపు కాకర్షింపబడుతుంది. ఎత్తైన శిఖరాగ్రాన్నుండి దొర్లి నరాయి క్రిందకు పోయే ఆగుతుంది. క్షణికావేశంలో నళిని ఏమేమో చేసింది. ఇప్పుడు దానిని సరిదిద్దుకొనే శక్తి, సాహస మామెలో లేవు.

ఆదినారాయణగూడా అప్పుడప్పుడామెను తీసుకు వెళ్ళేవాడు. ఆమె వెళ్ళక తప్పేదికాదు. ఎందుచేతనంటే పద్మనాభానికి వలెనే ఆదినారాయణకుగూడా తనమర్మమంతా తెలుసు. తల్లి ఎన్ని చివాట్లు పెడుతున్నా తానింతవరకు సత్యంతో తెగతెంపులుచేసుకోవాలని నిశ్చయించుకోలేదు.

జమీందారుగారి భార్య కోడూరు వెళ్ళిపోయింది. నౌకర్లుగూడా వెళ్ళారు. బంగళా అంతా శూన్యంగా వున్నది. జమీందారీలు రద్దయిన కారణంగా జమీందారుగారి ఆర్థిక స్థితి బాగులేదనే అపవాదు నళిని దాకా ప్రాకింది. వెనుకటి ఆభరణా లన్ని అమ్ముకుతింటున్నారని వినికిడి. సర్కారువారిచ్చే భరణంగూడా సరిగా రావడం లేదు. కాని వెనకటి రాజ పోకడలు మాత్రం ఆయనను విడిచిపెట్టి పోలేక పోతున్నవి. ఆయనగారి భార్య కోడూరు వెళ్ళిపోవడానికి బహుశా ఆర్థిక కారణమే కావచ్చు. జమీందారు నింకా మిథ్యాభిమానం పట్టి పీడిస్తున్నది.

నళిని జమీందారుగారి యింటిలో కాలు పెడుతూనే గదిలో తన పినతల్లి ఉండడం చూచింది. ఆమె విచారంగా వున్నట్లు కనిపిస్తున్నది. ఆమెతో మాట్లాడుతూ, మాట్లాడుతూ జమీందారుగారు వెళ్ళిపోయినట్లు తోస్తున్న దామె ముఖంలో.

"ఆరోగ్యం బాగున్నదా?" అన్నది పినతల్లి.

"నీ వెప్పు డొచ్చావు పిన్నీ!"

"నిన్న".

"కబురన్నా చేయలేదే?"

"వీరిని కలుసుకున్నాక కబురు చేద్దామనుకొన్నాను. అమ్మ కులాసాగావున్నదా?" నళిని లేచి నిలబడడం చూచి "కూర్చో! వా రిప్పుడే వస్తారు." అన్నది జమున.

నళిని మెదలకుండా కూర్చున్నది. కాని తన పినతల్లి ఎందుకు వచ్చిందో సులభంగా గ్రహించ గలిగినంత వయస్సు

వచ్చింది నళినికి. నౌకర్లు చాకర్లు కోడూరు వెళ్ళి యీ విషయం చెప్పివుంటారు. జమీందారుగారు జమునకు డబ్బూ దస్కం పంపడంగూడా ఆపేశాడు.

"ఆఖరికి నీవుగూడా..." జమున మాట్లాడుతూనే యున్నది. నళిని ఆ మాటలు వినిపించుకోకుండా ముఖ మటు త్రిప్పుకొన్నది. "నాకు తెలుసు. నేనే పరిచయంచేశాను. ఇప్పు డనుభవిస్తున్నాను. ఇదిచాలు! మీ అమ్మతోగూడా చెప్పాను. ఆమెకు వీళ్ళలో ఏమి అందచందాలు, భాగ్యభోగ్యాలు కనిపిస్తున్నవో నాకు తెలియదు."

నళిని విషయం మార్చాలనే ఉద్దేశముతో "ఎక్కడ బసచేశావు పిన్నీ!" అని అడిగింది.

"హోటల్లో"

"మే మిక్కడవుండగా అక్కడెందుకున్నావు?"

"మీరుకోడూరునుంచి బసులుదేరి వచ్చేటప్పుడు నీవు గానీ, మీ అమ్మగానీ మాటమాత్రం చెప్పారా?"

ఇరువురూ కొంతసేపు మౌనంగా కూర్చున్నారు. ఇంతలో జమీందారుగారు గదిలోకివచ్చారు. ఆయన నళినిని చూచి చిరునవ్వునవ్వాడు. "అరె వెధవ ఎంత తెలివితక్కువ పనిచేశాడు. నా ఆరోగ్యం బాగులేదురా అని చెపితే నిన్ను తీసుకువచ్చాడా?" అంటూ నృత్యశిక్షకునివంక చూచి "కూర్చో నళినీ!" అన్నాడు. నళిని పినతల్లి ఒకసారి నళినివంక, మరొకసారి జమీందారువంక తీక్షణంగా చూడసాగింది.

"నేను తమకే విన్నవించేది. మీరు నాబ్రతుకు తెరువు కేదైనా యేర్పాటు చేయకపోతే..." అని యింకా ఏమో

అనబోతున్నది జమున. జమీాందారుగారు నిర్భయంగా మీాసం మీాదకు చేయి పోనిచ్చి మెలిపెడుతున్నాడు. "నేను నళిని యెదుట యిలాంటిమాట లెందుకంటున్నానా అని మీారాలోచి స్తున్నారు కాబోలు. నళినిగూడా నాలాగా మీా మోసంలో పడగూడదనే నా కోరిక. మిమ్ములను నమ్మగూడదు. నా వద్ద ఉత్తరప్రత్యుత్తరాలు, ఫోటోలు అన్నీవున్నవి. మీారు నన్నెప్పుడో వివాహమాడారు. నేను బజారుస్త్రీని కాదు." నళిని అక్కడనుండి లేచి వెళ్లి వరండాలో కూర్చున్నది. "నేను చాలరోజులాగాను, ఇంకెన్నాళ్లాగను. మీారు నా తిండితిప్పల కేదైనా ఏర్పాటు చేయిస్తారా? చేయరా!" అన్నది జమున.

జమీాందారు మాట్లాడలేదు. అతను పాతకాలపు మనిషి. మెత్తని స్వభావంకలవాడు. బాగా చదువుకొన్నవాడు గూడా. కాని స్త్రీలోలుడు. ఆడవాళ్లకు టోపీ వెయ్యడం అతనికి వెన్నతో పెట్టిన విద్య. మేఘం ఎప్పుడూ గర్జించదనీ గర్జిస్తే దాని నెవరూ ఆపలేరనీ అతనికి తెలియనివిషయం కాదు.

"తమరు మాట్లాడరేం?"

"భయపడకు. అంతా సరి జేస్తాను."

"ఇలా అంటూనే నెలలూ, సంవత్సరాలూ గడుపుకొ స్తున్నారు."

"ఎందుకలా కోపగించుకొంటావు?"

"అవును లెండి. ఇప్పుడు నే నెందుకు పనికి వస్తాను. నా ముఖం ఎందుకు చూస్తారు. ఇంకొక పిట్ట పడింది మీా వలలో. సరే. నా భుక్తికి మీారు సరియయిన ఏర్పాటు చేయకపోతే నేను కోర్టుకు పోతాను. కోర్టువారు నాకు మనో

వర్తి యిప్పిస్తారు. దాన్ని మీరెప్పుడూ తప్పించుకోలేరు."
అంటూ జమున లేచి నిలబడింది. ఎంతో ప్రయత్నంమీద యీ రోజు జమీందారుని కలుసుకో గలిగింది. ఇదివరకు రెండు మూడుసార్లు వస్తే యింటివద్ద లేడు. ఫోను చేసినా ఫోను వద్దకు రాలేదాయన. కనుక కంటికి కనిపించగానే జమున వెనకా ముందు లేకుండా నిప్పులు కురిపించింది.

"రా అమ్మా! ఇంటికి పోదాం పద." అంటూ జమున నళిని చేయి పట్టుకొని టాక్సీలో యింటికి తీసుకుపోయింది. దారిలో వారిరువురూ ఒకరితో నొకరు మాట్లాడు కోలేదు.

సత్యమిప్పటివరకు యింటికి రాలేదు. కాంచన, జమున చాలసేపటివరకు బిగ్గర బిగ్గరగా మాట్లాడుకొన్నారు. ప్రక్క గదిలో నళిని వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

## ౩౬

జమున తన సామాను వగైరాలన్నీ సర్దుకొని కాంచన యింటికి వచ్చింది. ఆమె యిలా రావడానికి రెండుద్దేశా లున్నవి. ఒకటి- తానిక్కడున్నంతవరకు జమీందారు నళినిని తన వద్దకు తీసుకు వెళ్లడానికి సాహసించలేడు. రెండోది- తన అక్క కాంచనతో నళిని విషయమై మాట్లాడ వలెనను కొంటున్నది.

సత్యానికి జమున యిక్కడ వుండడం సుతరాం ఇష్టం లేదు. ఇదేమిటి? ఈ రోజులలో అతనికి యిష్టం లేకుండా చాల పనులు జరిగి పోతున్నవి. అత నే వాతావరణంలోనుండి పారిపోయి వచ్చాడో అదే వాతావరణ మిచ్చటా

తయారయినది. ఏ వ్యక్తికి దూరంగా వుండా లనుకొన్నాడో ఆ వ్యక్తి మద్రాసు వచ్చింది.

అతను తన పనిలో నిమగ్నుడవడానికి ప్రయత్నిస్తున్నాడు. అతను సాధ్యమైనంత తొందరలో నళిని నృత్య ప్రదర్శనంకొరకు అయిదారు వందల రూపాయలు సంపాదించా లనుకొంటున్నాడు. అతను స్టూడియోలో పనిచేస్తూనే వీలైనప్పుడు బయట గూడా యితర పనులు చేస్తున్నాడు. స్టూడియో అధికారులు చూచి మెచ్చుకొని అతని వేతనం వృద్ధి చేసేలా అతను శ్రమకోర్చి గొప్ప గొప్ప పనులు చేస్తున్నాడు.

జమున వచ్చినందువలన ఏమి జరిగినా జరుగకపోయినా నళిని యింట్లో వుండటాని కవకాశం దొరికింది. ఆమెను జమీందారు బలవంతంగా తన యింటికి తీసుకొని వెళ్లలేక పోతున్నాడు. కాంచన పాడునోటికి తాళం పడింది. పద్మనాభం వస్తూపోతూనే వున్నాడు.

జమున, కాంచన ఆమాటా, యీమాటా మాట్లాడుకొనేవారు. "నీవు జమీందారువెంట వృధాగా ఎందుకు పడతావు? నాకు తెలుసు. ఆయన దివాలాతీసే పరిస్థితులలో వున్నాడు. ఇప్పుడు నాకు చిల్లిగవ్వయినా పంపిస్తున్నాడా? మోసానికి దాసుడై నాడు. ఈ సినిమా తీయడంగూడా ఒక మోసమే. ఇరవై ముప్పై వేలు అప్పు దొరికింది. అదే పెట్టుబడి. ఇరవై ముప్పై వేలలో ఎక్కడైనా సినిమా తయారవుతుందా? నళిని కండ్లలో కారం కొట్టడాని కీ పన్నాగం పన్నాడు. తుదకు నళిని రెండింటికీ చెడిన రేవడిలా తయారవుతుంది." అన్నది జమున.

"అయితే యిప్పు డేం చేయాలి ?"

"నళినికి పెండ్లి చేసేయ్. వాకిట్లో కూర్చుని వచ్చేపోయే వారి నాహ్వానించే పిల్లగాదు నళిని. ఇప్పుడు వాకిళ్లలోగూడా యిందుకోసం నిలబడుతున్నారు. ఎవరైనా మంచివాడు దొరికితే వాడితో వేరుగా కాపురంపెట్టి గుట్టుగా, మర్యాదగా జీవిద్దామని."

"మనవాళ్ళు యిదే పొరపాటు చేస్తున్నారు. మొదట్లో నన్నొకాయన చేరదీశాడు. చివరకు ఆయనా మునిగాడు. నన్నూ ముంచాడు. డబ్బు వ్యామోహంలో పడ్డాను." అన్నది కాంచన.

"అవును. యదార్థం చెప్పావు. నేనూ యీ జమీందారుని చూచి మోసపోయాను. ఇప్పుడిలా కొంపలు పట్టుకు తిరగ వలసిన స్థితికి తీసుకువచ్చాడు."

"అందుకనే నేనే మంటున్నానంటే ఒక్కరిమీదే ఆధారపడి వుండవద్దు. వయసు వచ్చిన పిల్లవు. వయసులో నాలుగు డబ్బులు సంపాదించుకొంటే ముసలిదానవయిన తరువాత విశ్రాంతిగా కూర్చుని తినవచ్చు. అప్పుడు సంపాదించుకొందాంలే అనుకొంటే అప్పుడు నీ ముఖం చూచే వాడుండడు అంటుంటే అది వింటేనా ? పైగా దానికా బ్రాహ్మణపిల్లవాడి పిచ్చిపట్టింది. ఇప్పుడే దారికి వస్తున్నది. ఇప్పుడిప్పుడే నా మీద దయ చూపిస్తున్నట్లు, నా మాటకు విలువ యిస్తున్నట్లు కనిపిస్తున్నది. ఒకవేళ మనజాతిలో ఎవరైనా పెండ్లి చేసుకొంటే దాని మగడే దానిని నమ్మని కాలము వస్తుంది. చిన్నతనం. ఇప్పుడు దీనికేమీ అర్థంకాదు. తరువాత విచారిస్తుంది."

అన్నది కాంచన స్పష్టంగా. బహుశా అక్క చెల్లెండ్రిరువురు యింత స్పష్టంగా ఎన్నడూ మాట్లాడుకొని వుండరు.

"ఈడొచ్చిన పిల్ల వద్ద మన మాటలు, ఆటలు ఎక్కువ కాలం సాగవు. ఇది లోక సహజం. కనుక నళినిని సత్యాని కిచ్చే ఎందుకు పెండ్లి చేయలేకపోయావు?" అన్నది జమున.

"వాడి మూలంగానే యిది సర్వనాశనమైనది. ఆ నిర్భాగ్యుడు దీని నేమి సుఖపెడుతాడే? ఒకసారి పనిదొరికితే, మరొకసారి దొరకదు. ఋతువుల్లా మారిపోయే వీరి జీవితాలను నమ్ముకొని సంసారం సాగించడం దుష్కరం."

"అయితే పద్మనాభం...?"

"ఆఁ అతనికి పనిపాట లున్నవి. బండి దొర్లిస్తున్నాడు. ఈ పరిస్థితులలో నళిని జమీందారుగారి అండన బ్రతకాలని నాకు లేదు. అతను ముసలివాడయినాడు. పైగా నీవు చెప్పుతున్న మాటలు వింటుంటే ..." కాంచన జమున మాటలు పూర్తిగా విశ్వసించినట్లు మాట్లాడింది. "జమీందారుగారి స్థితి పూర్తిగా చితికిపోయిన దనే అనుమానం యిప్పటికీ కలగడంలేదామెకు. ముసలి ఏనుగకు, గానుగెద్దులకు తేడా ఏమున్నది."

జమున చిరునవ్వు నవ్వింది. జమీందారు వద్ద తన పని పూర్తికాకపోయినా యిక్కడ తన ఉద్దేశం నెరవేరిందని భావించిందామె. "సరే నేనొక్కమాట అడుగుతాను చెప్పు. సత్యానికి నళినిని పెండ్లి చేసుకోవడం ఇష్టంలేదా?"

"ఇష్టం వుంటుంది. ఇష్ట మెందుకుండదు? కాని అతనేమైనా పిచ్చివాడా? పెండ్లి లేకుండా పని జరిగిపోతుంటే

పెండ్లి ఎందుకు చేసుకొంటాడు ? సర్వనాశనం చేశాడు.” అన్నది కాంచన.

అందరూ భోజనాలు ముగించుకొని పండుకొన్నారు. సుమారు మూడు నాలుగు గంటలకు పద్మనాభం వచ్చాడు. అతను సామాన్యంగా రోజూ యిదే సమయానికి వస్తాడు. అతను నళిని గదిలోకి వెళ్ళబోయాడు. ఇంతలో కాంచన పిలిచింది. జమునగూడా ప్రక్కనే కూర్చున్నది.

అతనిని కుర్చీలో కూర్చోబెట్టి “అబ్బాయీ! మా వయసేమో మళ్ళిపోయింది. ఇంకా ఎన్ని రోజులు బ్రతక బోయి బ్రతుకుతాం. నా బొందిలో ప్రాణముండగానే నళినిని ఒక యింటిదానను చేయాలని నా కోరిక. దాని చేతులకు పసు పంటితే చూడాలని నా ముచ్చట.” అన్నది కాంచన.

“సత్యం...?” అన్నాడు గుటకలు మ్రింగుతూ.

“సత్యంమాట వదిలేయ్! నా పిల్ల నతనికివ్వాలని లేదు.”

“నళినికి నీ వంటి పెండ్లికొడుకు రావాలి” అన్నది జమున.

“మరి నళిని ఒప్పుకొంటుందా ?”

“ఎందుకొప్పుకోదు ? చిన్నది దానికేం తెలుసు?”అన్నది కాంచన.

“నాకేమీ అభ్యంతరంలేదు. కాని... ?”

“ఏమిటి నాయనా ?”

“నేనిలాంటి రోజు కోసమే సంవత్సరాల తరబడి ఎదురు చూస్తున్నాను. నేనిందుకోసమే మిమ్ములను మద్రాసు పిలిపిం

చాను. సత్యం తండ్రికికూడా తెలియపరిచాను. ఆయన అసలు విషయం తెలుసుకొన్నాడు. నామాట అర్థమౌతున్నవా? కాని రోజులు మందంగావున్నవి. ఈ ఫిల్ము తయారుకానీ...అప్పుడు చూద్దువుగాని మనమజా. అప్పుడు మనరొట్టె విరిగి నేతిలో బడుతుంది." అంటూ అతను నళిని గదిలోకి వెళ్లాడు.

పద్మనాభం చెప్పిన యీ మాటలలో క్రొత్తదనమేమీ లేదు. అతనికి మామూలే. ప్రపంచం చూచాడు. స్త్రీలవిషయ మతనికి బాగా తెలుసు. అతను స్వంత వ్యవసాయ మెన్నడూ చేయలేదు. ఇతరుల పొలాలలో దొంగతనంచేసి జీవితం గడుపుకొంటున్నాడు. చిన్నప్పటినుండి అతని స్వభావమే యిది. పుట్టుకతోనూ, వంశపారంపర్యంగాను వస్తున్న సంస్కారాలను ఒక్కసారిగా మార్చడం చాలకష్టం. అతను నిజంగా నళినిని పెండ్లి చేసుకోవాలనుకొంటున్నాడా? చెప్పలేం.

సాయంత్రం అలసిసొలసి యింటికివచ్చాడు సత్యం. అతను ఉదాసీనంగా కనిపిస్తున్నాడు. కాంచన మెల్లగా జమున చెవిలో "త్రాగివచ్చినట్లున్నాడు. కొంప మునిగింది." అన్నది.

సత్యం త్రాగలేదు. అతను చాల అలసిపోయాడు. అతను స్నానంచేయకుండానే తనపక్కమీద పండుకొన్నాడు. నళిని గ్రుచ్చిగ్రుచ్చి అడిగితే "నేను స్టూడియోపని వదలుకున్నా"నని చెప్పాడు.

"ఎందుకు?"

"నేను నౌకరీ చేయలేనని మొదట్లోనే చెప్పలేదూ. నేను పీళ్ల బానిసనుకాను. నేనొక మంచి సెట్ తయారు

చేశాను. దానిని చూచి హెడ్ ఆర్టిస్టు మండిపడ్డాడు. వాడికి నేనంటే ఈర్ష్య. వాడిస్థానం నేనెక్కడాక్రమిస్తానోనని వాడి భయం. వాడివ్వాళ నలుగురైదుగురుముందు నన్ను నానా మాట లన్నాడు. వాడి అధికారదర్పమంతా నామీద చూపించాడు. నన్నేదో డబ్బుపోసి కొన్న బానిసలా చూచాడు. నేను సహించలేకపోయాను."

నళిని కనులలో నీరు తిరిగింది.

"భయపడకు. ఎలాగో డబ్బు సంపాదించ లేకపోను. భగవంతుడే మనకు సహాయం చేస్తాడు. నీ నృత్య ప్రదర్శనం జరిగి తీరుతుంది." అంటూ నళిని సమీపంగా జరిగాడు.

ఈ విషయం కాంచన విని "నేను చెప్పలా. ఈ చిత్రకారుల నమ్మక మేమిటసి? బుఱుతువుల్లో పూచే పూలు" అన్నది.

## 38

చాలా రోజులు గడిచినవి. సత్యం రాత్రింబవళ్లు కష్టపడుతున్నాడు. కాని సఫలత పొందలేక పోతున్నాడు. బాధ్యతలు నానాటికి పెరుగుతున్నవి.

తండ్రి చనిపోయి చాలా మాసాలు గడిచినవి. జీవన సంఘర్షణలో పడి ఆయన మాట గూడా మరచిపోయాడు. నళిని ఎదురుగా వుంటే ఉత్సాహంగాను, ధైర్యంగాను వుంటాడు. నవచైతన్యం వెల్లివిరుస్తుంది.

ఒకటి రెండు చిత్రాలమ్ముడు బోయినవి. దానితో కాలం నెట్టుకొస్తున్నాడు. కాని నృత్య ప్రదర్శనం కొరకు

అయిదారు వందల రూపాయలు ప్రోగుచేయలేకపోతున్నాడు. నళిని ఉదాసీనంగా వుంటున్నది. మాట్లాడడం గూడా తగ్గించింది.

సత్యం యింటికి యిప్పుడు వచ్చే పోయే వారి సంఖ్య అధికమైనది. నృత్య శిక్షకుడు గూడా అక్కడ గంటల తరబడి వుంటున్నాడు. నళిని నృత్య ప్రదర్శనం కొరకు తయారవుతున్నది. నిరంతరాభ్యాసావస్యకత వున్నది. కాంచన ఎదురుగా వుంటే ఆమెకు మరీ కోపంగా వుంటున్నది. కాంచన నళినితో సరిగా మాట్లాడలేక పోతున్నది.

కాంచన సత్యాన్ని చూచి ఎప్పుడూ గుడ్లురుముతుంది. "సత్యం యింట్లో వుంటున్న కారణంగా నళిని ఎక్కడకైన వెళ్ళలేక పోతున్నదా? లేక ఎవరైనా నళిని వద్దకు రాలేక పోతున్నారా?" అన్న సందేహం ఆమెను పట్టి పీడిస్తున్నది. జకున కోడూరు వెళ్లిపోయింది. కాంచన అప్పుడప్పుడు పద్మనాభం యింటికి వెళ్లి వస్తున్నది.

కాంచన నిన్న నళినిమీద మండిపడింది. సత్యం ప్రక్కగదిలో నున్నాడు. బహుశా ఆమె ఉద్దేశం సత్యం గూడా వినాలనే అయివుంటుంది. "ఈ రోజుల్లో మగవాళ్లు పెళ్లాలనే సరిగా చూడడంలేదు. నిన్నేమిచూస్తారే. నీవు రోజురోజుకు పిచ్చిదానవై పోతున్నావు. బాగా తిని తైతక్కలాడే రోజులెప్పుడో పోయాయ్. ఎన్నాళ్ళని యిట్లా కష్టాలనుభవిస్తావు? నాకింకెవరూ దిక్కులేరని నీవిట్లానన్ను ఏడిపిస్తున్నావను కొంటాను. చూస్తాను. ఇలా ఎంతకాలమేడిపిస్తావో?" అన్నది కాంచన.

రాత్రంతా నళిని విచారంగా నున్నది. సత్యమెప్పుడైనా విచారంగా వుంటే తాను ఓదార్చేది. కాని ఇప్పుడామె ఏదో చెప్పవలెనను కొంటున్నది. కాని చెప్పలేక పోతున్నది.

మరుసటి రోజు సత్యమామెను బీచికి తీసుకు వెళ్ళాడు. జనం చాల మంది వున్నారు. ఆదివారం. గాలిమేయడానికని చాలమంది భార్యాబిడ్డలతో సహావచ్చారు. ఈ గుంపు నుండి తప్పించుకొని సత్యం, నళిని ఏకాంత ప్రదేశంలోకి వెళ్ళికూర్చున్నారు.

సత్యానికి చిన్ననాటి దృశ్యం కనులకు కట్టినట్లున్నది. సంక్రాంతి పండుగ, రంగురంగుల దుస్తులు, చెలియలికట్టకు ఢీకొడుతున్న సముద్రం, ఇసుకలో బొమ్మరిల్లు మంటపం, దేవాలయం, నళినితో ప్రథమ పరిచయం. జీవనదిలా అతని జీవితం చాలదూరం ప్రవహించింది. సముద్రంలా గంభీరంగా విస్తరించింది.

"నళినీ! ఎందుకలా ఉదాసీనంగా వుంటున్నావు? డబ్బుకేమీ యిబ్బందిగా లేదా?" అన్నాడు.

"లేదు. నేను ఉదాసీనంగా ఎక్కడున్నాను?"

"లేదు. నీవు అబద్ధం చెపుతున్నావు. మీ అమ్మ యిందుకే కాబోలు కోప పడుతున్నది. ఏం యిందు కేనా?"

"ఆమె ఎప్పుడూ అంతే. అది ఆమె కలవాటు. విని విని నా చెవులు చిల్లులుపడి పోతున్నవి."

"మరి నీ వెందు కూరకొంటున్నావు?"

"నే నూరుకోవడం లేదు."

"ఇందుకనే నేనా రోజు వివాహవిషయం నీతో ఏమీ చెప్పలేదు."

నళిని కన్ను లశ్రుపూరితాలయినవి.

"నేను మా నాన్నగారి ఆత్మను కష్ట పెట్ట దలచలేదు. ఆయనకు మన పెండ్లి...ఈ మాట నేను నీతోగూడా చెప్ప లేకపోయాను." సత్యం కంఠం గాద్గదిక మైనది. "బహుశా ఆయన..." సత్యం ముఖం రెండుచేతులతో దాచుకొన్నాడు.

"నీవు గూడా విచారిస్తున్నావా ? మన మిక్కడకు కన్నీరు కార్చడానికేనా వచ్చింది ?"

సత్యం కొంతసేపు వెక్కి వెక్కి ఏడ్చాడు. "ఇక నీ వెప్పుడు కోరితే అప్పుడు మనం వివాహం చేసుకొందాం. నీ నృత్యకళా ప్రదర్శనంతోపాటు మన వివాహంగూడా జరిగిపోవాలి. అదే మంచి సమయం. ఏమంటావు ?"

నళిని ముఖం రెండవ ప్రక్కకు త్రిప్పుకొన్నది. ఆమె సిగ్గుపడుతున్నదని సత్యం గ్రహించాడు. కాని నళిని మనస్సులో వేరే తుఫాను వీస్తున్నది.

"భగవంతుడు మనకు మేలే చేస్తాడు. చేసినా చేయక పోయినా నీవు నా చెంతనుంటే నా కేమీ కొదవలేదు. ఒకవేళ పస్తు లుండవలసి వచ్చినా సంతోషంగావుంటాను."

"నీ చెంత నుండక మరెవరిచెంత నుంటాను ?" అంటూ నళిని సత్యం చూపులను తప్పుకొని సముద్రం వంక చూడ సాగింది. బహుశా ఆమె సత్యం ముఖాన్ని సరిగా చూడడానికి సాహసించలేక పోతున్నది.

"లోకం మనల నేదృష్టితో చూచినా, పతితులని నిందించినా, లేక యింకేమి చేసినా మనలను మాత్రం విడదీయలేదు. ఇది ఎన్ని సంవత్సరాల తపస్సో నీకు తెలుసా నళినీ! బహుశా జన్మ జన్మల తపః ఫలమై వుంటుంది."

నళిని మౌనంగా కూర్చున్నది.

"ఇంకా ఉదాసీన భావమేనా? ఏదీ ఒక్క చిరునవ్వు." అంటూ సత్యం నళిని గడ్డం పుణికి పుచ్చుకొన్నాడు. నళిని సిగ్గుతో చిరునవ్వు నవ్వింది.

సత్యం నిశ్చింతగా సముద్రం వైపు చూస్తున్నాడు. నావలు ఒడ్డుకు చేరుకొంటున్నవి. జాలరివాండ్ర భార్యలు చేపల బుట్టలు తీసుకొని ఒడ్డున గుమిగూడారు.

"పాపం వీరు పగలంతా సముద్రంతో పోరాడుతారు. చేపలు ఒక్కొక్కసారి బాగా దొరుకుతవి. ఒక్కొకసారి దొరకవు. అది వారి వారి అదృష్టంమీాద ఆధారపడివుంటుంది."

"నీ స్థితిగూడా యిలానే వున్నది. పది చిత్రాలు గీస్తే ఒకటి అమ్ముడుపోతున్నది. అదైనా ఊరంతా తిరిగితే."

"ఒకరి దగ్గర బానిసగా బ్రతికేకంటే యిదే మంచిది. వీరింతగా ఎందుకు కష్టపడుతున్నారో తెలుసా. ఒడ్డున ఎవరో వారి కొరకు నిరీక్షిస్తుంటారని. అలానే నీవూ నా కొరకు నిరీక్షిస్తూ వుండాలి."

"నిరీక్షిస్తూ నిరీక్షిస్తూనే యిన్ని రోజులు గడిచాయి."

"ఇక నిరీక్షించవలసిన అవసరంలేదు."

"మనకు డబ్బు అవసరం వస్తుంది. మీ చిత్రాలను ప్రశంసించి, కొన్న ఆ చెట్టియార్ వద్దకు మరల పోతే! మంచి వాడని విన్నాను. సహృదయుడు, ఈ మాత్రం సహాయం చేయడా?"

"డబ్బునుగురించి నీ వేమీ భయపడవద్దు. రేపు నేను ఆయనవద్దకు వెళ్లి వద్దామను కొంటున్నాను."

వారు చాలసేపు బీచిలోనే గడిపి యింటికి మరలి వస్తుంటే జమీందారుగారి కారు ఎదురుపడింది. ఆయన సత్యాన్నిచూచి చిరునవ్వు నవ్వుతూ వెళ్ళిపోయాడు.

## 3౮

సత్యం సుమారు పదిపన్నెండు గంటలకు చెట్టియార్ యింటికి వెళ్లాడు. అతనిచేతిలో రెండుమూడు చిత్రాలున్నవి. అందులో ఒకటి అతను చాలా సంవత్సరాలక్రిందట గీచినది. విద్యుత్ రేఖలపై నృత్యభంగిమలో నళిని చంచలదృక్కులు. గత్యంతరంలేక ఆ చిత్రాన్నిగూడా బేరంపెట్టాడు.

సింహద్వారంవద్ద ఘూర్కా అతనిని ఆటంకపరిచాడు. అతను లోపలకు కబురుపంపాడు. సత్యం వాకిట్లో ఎండల్లోనే నిలబడవలసి వచ్చింది. పదిపదిహేను నిముషాలు గడిచినవి. కాని లోపలనుండి అనుమతిరాలేదు. బహుశా చెట్టియార్ గారు భోజనం చేస్తున్నాడేమో ననుకొన్నాడు.

ఇంతలో ఐస్‌క్రీం అమ్ముకొనేవాడు సైకిలుమీద గంట వాయిస్తూ ఆ వైపు వచ్చాడు. ఇంట్లోవున్న పిల్లలందరూ

పరుగెత్తుకొంటూ బయటకువచ్చారు. ఒకఅమ్మాయి ఎండ దెబ్బనుండి రక్షణకోసమని కాగితపుటోపీ పెట్టుకు వచ్చింది. ఆ టోపీమీద చిత్రించివున్న స్త్రీల దృశ్యాలు సత్యాన్ని ఉరిమి చూస్తున్నట్లున్నవి.

అతని మెదడు పనిచేయడం మానివేసింది. అతను స్తబ్ధుడై అలా చూస్తూ నిలబడ్డాడు. ఆ చెట్టియారుగారు వరండాలో నిలబడి వికటాట్టహాసం చేస్తున్నాడు. "అమ్మా! టోపీ సరిగా పెట్టుకో. లేకపోతే ఎండదెబ్బ తగులుతుంది." అంటూ నవ్వుతున్నాడాయన. ఆ అమ్మాయి టోపీ సరిజేసుకొన్నది.

సత్యానికి అది తాను వేసిన చిత్రమేనని గ్రహించడానికొట్టేసేపు పట్టలేదు. ఆ అమ్మాయి నెత్తిమీద టోపీగా ఉపయోగపడుతున్న చిత్రాన్నే చెట్టియార్ అంతగా ప్రశంసించికొన్నది. సత్యం కనులు మూసుకొన్నాడు. ఆ దృశ్యాన్ని చూడలేక పోయాడు. పిల్లలాడు కోవడానికే బహుశా చెట్టియార్ చిత్రం కొని వుంటాడని భావించాడు.

పిల్లలంతా ఐస్‌ఫ్రూట్ కొనుక్కొని సైడు కాలువ ప్రక్కనున్న చెట్లక్రిందకు చేరి చప్పరించ సాగారు. సైడు కాలవలో రంగు రంగుల కాగితపు పడవొకటి తేలియాడు తున్నది. చిన్నచిన్న అలలు దానికి తాకుచున్నవి. ఒకపిల్లవాడు ఆ పడవను నడిపించాలని పిట్టగోడ మీద కూర్చుని వెనక ప్రక్క మెల్లగా గాలి ఊదుతున్నాడు. పిల్లలంతా ఐస్‌క్రీం చప్పరిస్తూ కేరింతలు కొడుతున్నారు.

"ఎండలో ఆడబోకండి. లోపలకురండి" అంటున్నాడు చెట్టియార్. తానక్కడ వున్నట్లు చెట్టియార్ కు సూచిండానికై సత్యం ఆయన వంక తొంగి తొంగి చూస్తున్నాడు. మెల్లగా సకిలిస్తున్నాడు. అతను పైడు కాలువవంక చూచి నీరు కారి పోయాడు. కంపింప సాగాడు. ఎలాగో నిలద్రొక్కుకొని అచేతనంగా అలా నిలబడి పోయాడు. అతని రెండవ చిత్రం మురుగు కాలవలో నానై తేలుతున్నది. అతని చేతిలోని రెండు చిత్రాలు జారిక్రింద పడినవి.

కనులు తెరచి వున్నా చూడలేని గ్రుడ్డివానిలా అతనా బంగాళా వంక చాలసేపు చూస్తూ నిలబడ్డాడు. "ఏమిటలా చూస్తావ్ ? వెళ్ళు. బాబుగారు పనిమీద వున్నారు. వారి నిప్పుడు కలుసు కోవడానికి వీలులేదు"అన్నది ఘూర్ఖా కంఠం.

సత్యం యంత్రంలా వెనుదిరిగి వెళ్లిపోయాడు. అతని మెదడెప్పుడో పనిచేయడం మానేసింది. అతను కొండంత ఆశతో వచ్చాడు. "చెట్టియారుగారు కళాపిపాసి. ఆయనే తన కింత ప్రోత్సాహమిచ్చాడు. ఒకటి రెండు చిత్రాలైనా కొనక పోతాడా !" అనే ఆశతో వచ్చాడు.

ఒక కళాపిపాసి యింట్లో తన చిత్రాల కిలాంటి గతి సంభవిస్తుందని అతను కలలో గూడా అనుకోలేదు. తన చిత్రాలు గూడా భాగ్యవంతుల యిండ్లలో గోడలకు తగిలించ బడి ఆ యింటికి శోభను చేకూరుస్తాయని భావించాడు. స్థిరంగా వుండలేక నడుస్తున్నట్లునడుస్తున్నాడు.

"కళాపిపాసి. పచ్చి మోసం. గొప్ప గొప్ప చిత్రకారుల చిత్రాలు నాలుగైదు కొని చూచి వుండవచ్చు. పేరును

బట్టి చిత్రాలు కొనివుండవచ్చు. ఒట్టి మట్టి బుఱ్ఱ. అల్లం రుచి కోతి కేమి తెలుస్తుంది? పైగా యీ ప్రశంస లెందుకో?” సత్యంలో విద్రోహ భావం మొలకెత్తింది.

“ఈ డబ్బున్న వాళ్ళంతా యింతే. ఉల్లిపాయ లమ్మి కూడబెట్టాడు. తెలి వెక్కడనుండి వస్తుంది? నెమలి పింఛం నెమలికి కాక కాకికి సరిపడుతుందా. మర్యాదహీనుడు.” అనుకొంటూ సత్యం ముందుకు సాగిపోతున్నాడు. అతని కోపం దావాగ్నిలా ప్రజ్వరిల్లుతున్నది. ఆ బంగళాను చెట్టియార్‌తో సహా తగల బెడదా మనుకున్నాడు. అతడు మండుతున్న కాగడాలా నడుస్తున్నాడు.

“నే నతని నెంతగానో ప్రశంసిస్తానని భావించాడు కాబోలు. అందుచే అతని పేరు ప్రతిష్ఠలు పెరుగుత వనుకొన్నాడు. అది నా పనిగాదు. నేను చిత్రకారుణ్ణి. ఇలాంటి వాళ్ళను చిత్రకారులు తోలుబొమ్మలుగా భావిస్తారు. ఈ డబ్బున్న వాళ్ళకు పుచ్చుకోవడమే కాని యివ్వడం తెలియదు. కాని దానం చేయాలన్నా లాభాలు గుణిస్తారు. నీచులు” అతని కోపం వశం తప్పిపోతున్నది. అతడు త్రాగిన వానిలా తూలుతూ తూలుతూ నడుస్తున్నాడు.

“ఏమైనా సరే. ఆకలితో మాడి చచ్చినాసరే నే నిలాంటి వెధవలకు నా చిత్రాల నమ్మను.” అంటూ అతను కొద్దిసేపు దారిలోనున్న వంతెనమీద కూర్చున్నాడు.

అతడు మహా ప్రపంచంలో గుట్టుమిట్టాడుతున్నాడు. నళిని చక్కగా అలంకరించుకొని రంగస్థలంమీద నాట్యం చేస్తూ వుంటుంది. నాట్యం చేస్తూ చేస్తూ ఒక్కసారిగా ఆమె

కాలి గజ్జెల మ్రోత ఆగిపోయి వుంటుంది. అంతా నిశ్శబ్దం. అతను కూర్చోలేకపోయాడు. లేచి నడుస్తున్నాడు.

"ఏం ప్రదర్శనం జరుగదా ? ఎందుకు జరుగదు ? భగవంతు డేదో దారి చూపించక పోడు. నృత్య ప్రశంసకులు గూడా యీ చెట్టియారు లాగానే వుంటారా ? నళిని మహాత్వాకాంక్ష పూర్తి చేసి తీరాలి. నేను డబ్బు సమకూర్చాలి. జమీందారుగారి సాయ మర్థిస్తే? లేదు. ఎంతమాత్రం వీలు లేదు. ఇదంతా స్వార్థపరత్వం క్రిందికి వస్తుంది. మాలో ఒకరు సఫలత పొందితీరాలి." అతని కాళ్ళు తేలిపోతున్నాయి. నడకలో వడి హెచ్చింది. అతను నడుస్తున్నాడు. అడుగులు యింటివైపు పడుతున్నవి.

3౯

సత్యం అడుగులు తడబడుతూ యింటికి చేరాడు. మూర్ఛ వచ్చినవానిలా గున్నాడు. మెట్ల మీదనే కూర్చున్నాడు. అతను రాగానే యింటిలోకి వెళ్ళలేకపోయాడు. చెట్టియార్ తన నవమానం చేశాడని నళినితో ఎలా చెప్పగలడు ?

పైనుండి గజ్జల మ్రోత వినిపిస్తున్నది. నృత్య శిక్షకుడు పాట పాడుతున్నాడు. కాంచన వరండాలో కూర్చుని తాంబూలం వేసుకోవడానికని వక్కలు నలగగొడుతున్నది.

సంగీతం సాగిపోతూనేవున్నది. సత్యం క్రిందనే కూర్చొని వున్నాడని నళినికి తెలియదు. సత్యం మనస్సు వికలమై శూన్యమావరించింది.

"వాహ్వా. వాహ్వా. నీవు బాగా నాట్యం చేశావు. కాలం వృథాగా పాడుచేశావు. నీవిదివరకే నృత్య ప్రదర్శనమిచ్చి వుండవలసినది." అన్నాడు శిక్షకుడు.

"ఈ బ్రాహ్మణ మండూకానికి జలుబు చేసింది. ఇల్లు గడపడమే అంతంతమాత్రంగా వుంటే యింకా ప్రదర్శనానికి డబ్బెక్కడ తెస్తాడు." అన్నది కాంచన బోసినోరాడిస్తూ.

"ఆయన ఎవరినైనా అడిగితే యివ్వరా?" అన్నాడు శిక్షకుడు.

"ఎందు కివ్వరు? కాని నళిని తనకంటె పై కెక్కడ పోతుందోనని అతని భయం కాబోలు. ఉడుకుమోతుతనం" అన్నది కాంచన.

"ఫిలుంలో ఒక్క పర్యాయ మలా కనిపించనీ. ఇక చూచుకో నళిని భాగ్యం. బంగారంతో తులతూగుతుంది. రూపాయల వర్షం కురుస్తుంది. పేరు ప్రతిష్టలు వృద్ధిచెందుతవి" అన్నాడు శిక్షకుడు.

"అయ్యోరాత. ఈ బ్రాహ్మణపిశాచం దానిని సరిగా ఫిలుములలో యాక్టుచేయనిస్తేనా?" అన్నది కాంచన.

సత్యంపైకి వెళ్లాలనుకొన్నాడు. అతని అధికారంచెల్లితే కాంచనగొంతు నులిమి చంపేవాడు. ఈ మాటలకు నళినేమీ మాట్లాడకపోవడం అతనికి విచారమేసింది. అతనక్కడనుండి లేచి వెళ్లిపోయాడు. రోడ్లవెంట తిరగసాగాడు.

అలసిసొలసి అతను మరల యింటికిచేరాడు. అతను మేకుకు కట్టివేసినట్లు తిరుగుతున్నాడు. గజ్జలమ్రోత యింకా వినిపిస్తూనేవున్నది. సంగీతం సాగిపోతూనేవున్నది. కాంచన వాకిట్లో లేదు. అప్పుడుగూడా సత్యంపైకి వెళ్లడానికి సాహసించ లేకపోయాడు. అక్కడే మెట్లమీద చతికిలబడ్డాడు.

ఒక్కసారిగా గజ్జలమ్రోతాగిపోయింది. ఏదో వస్తువు క్రిందపడిన చప్పుడయింది. సత్యం ఉలిక్కిపడ్డాడు, కాని కదల లేదు. చాలాసేపటివరకు ప్రశాంతంగా వున్నది. నళిని విశ్రాంతి తీసుకొంటున్నదని భావించాడు. ఇప్పుడామెతో తన విషయం చెప్పవచ్చు. అతను లేచాడు. కాని గజ్జలమ్రోత మరల వినిపింపసాగింది. అతను స్తంభాన్నానుకొని కూర్చున్నాడు. "ప్రదర్శనంకొరకై నళిని యింత కష్టపడుతుంటే నేను వెళ్ళి ఆమెతో ఈ విషయమెలా చెప్పను? బహుశా ఈ ప్రదర్శనం జరుగకపోవచ్చు. అయితే ఆమెపెండ్లిగూడా ఆగిపోతుందా?"

మరల గజ్జలమ్రోత ఆగిపోయింది. సత్యం సాహసంచేసి లోపలకు వెళ్లాడు. అతను గడపలోనే కట్టెలా నిలబడ్డాడు. నళిని, పద్మనాభం అతనిముందు గాఢాలింగనంలో వున్నారు. పద్మనాభం యిలాంటి పని చేస్తాడని అతను కలలోగూడా అనుకోలేదు. నళిని సత్యంవంక నిరసనభావంతో చూడసాగింది.

సత్యం రెండుక్షణాలలా చూస్తూ నిలబడ్డాడు. అతను కదలలేదు, మెదలలేదు. కొంతసేపటికి తలగోకికొంటూ మెట్లు దిగి వెళ్ళిపోయాడు. అతను మెట్లు దిగి క్రింది వాకిలిదగ్గరకు వచ్చేసరికి కాంచన ఎదురై "పోరా, పో. నీవు నా పిల్లనేమి సుఖపెడతావురా? వెళ్లు యిక్కడనుండి" అన్నది. పద్మ

నాభం వికటాట్టహాసం చేశాడు. సత్యం వెనుదిరిగి గూడా చూడలేదు. అతను నడుస్తూనే వున్నాడు. చొక్కా అంతా చింపుకొన్నాడు. అతను రోడ్డు మలుపు వద్దకు వచ్చేసరికి అతనివెనుక పిల్లలుచేరి "పిచ్చోడు, పిచ్చోడు" అంటూ గోలచేయసాగారు. అతని నడకలో నిర్భయత్వ మున్నది. పిచ్చితన మున్నది. గాంభీరత్వ మున్నది. అతను నడుస్తూనే వున్నాడు.

౪౦

మౌంటురోడ్డు ప్రక్కన ఎలక్ట్రిక్ స్తంభాల క్రింద పెద్ద పెద్ద బొమ్మలు బొగ్గుతో గీచి కనిపిస్తవి. పెద్ద దిబ్బ, దానిమీద దేవాలయం, ఉత్తుంగతరంగపంక్తులతో సముద్రం, దాని పృష్ఠభూమిపై విద్యుత్ రేఖలు, వాటిపై నాట్య భంగిమలో ఒక సుందర యువతీ లలామ. ఆ యువతి ఆకారం నళినిని పోలివుంటుంది. కాని యీ సుందరి బాలిక. యవ్వన వసంతంలో వికసించిన పుష్పంకాదు. చిత్రాలన్నీ ఒకే తీరుగా వుంటవి. వాటి క్రింద పెద్ద పెద్ద అక్షరాలలో "సత్యం" అని వ్రాసేవాడు.

అప్పుడప్పుడు కాస్మాపాలిటన్ క్లబ్ ఎదుట—ఎక్కడకు పెద్ద పెద్ద భూస్వాములు, జమీందారులు, కళాపిపాసులు, వస్తూపోతూ ఉంటారో అక్కడ ఫుట్‌పాత్ మీద బొగ్గుతో బొమ్మలు గీసేవాడు. ఇప్పుడు సత్యాన్ని గుర్తించడం చాల కష్టం. ధూళిధూసరితమై రేగిన తల వెండ్రుకలు, మాసిన

గడ్డం, చినిగిన బట్టలు, శుష్కించిన శరీరము ... అస్థిపంజరము...ఎముకలగూడు. ఒకప్పు డాకర్షణీయంగా, అందంగా కనిపించిన అతని విశాల నేత్రా లిప్పుడు చలువరాళ్ళలాగున్నవి. తనపై కెగబ్రాకిన లతావితాన భారంతో నేలకు క్రుంగి, కృశించిన మ్రానులాగున్నా డతడు.

అతని చుట్టూ ఎప్పుడూ గుంపులు గుంపులుగా చిన్నా పెద్దా మూగుతారు. కొంద రతనిమీద జాలిపడతారు. కొంద రాశ్చర్యపడతారు. కొంద రతనిమీద రాళ్లు రువ్వేవారు. కాని అత నేమీ మాట్లాడేవాడుకాడు. ఎప్పుడూ మౌనంగా వుండేవాడు.

అప్పుడప్పుడు గుంపును చీల్చుకొంటూ నడివయసు యువతి ఒకామె వచ్చేది. చిన్న పాత్రలో అన్నం తెచ్చేది. కాని సత్యం ఆమెవంక చూడనైనా చూచేవాడు కాడు. ఆమె తెచ్చిన అన్నం ముట్టనైనా ముట్టేవాడు కాడు. ఆమె రాగానే అత నక్కడనుండి లేచి వేళ్లేవాడు. ఆ యువతి కన్నీరు కారుస్తూ అతని వెంట కొంత దూరం వెళ్లేది. తుదకు హతాశురాలై తిరిగి వెళ్లిపోయేది.

ఆమే నళిని. ఆమె ఎన్నో తీర్థాలు సేవించి వచ్చింది. కాని యింకా మురికిగుంటవలె కాలం గడుపుతున్నది. ఆమె యిప్పుడూ వాకిట్లో కూర్చుంటున్నది. కాని విటుల నాకర్షింపలేకపోతున్నది. సుఖ రోగాల కారణంగా శరీరమంతా గుల్లయిపోయింది. పొరపాటున దారితప్పి ఎవరైన విటుడు వస్తే ఆమెను చూచి అసహ్యించుకొనేవాడు.

తానేదో గొప్పవాడైనట్లు నటించి, ఏవేవో ఆశలు చూపించి పద్మనాభం నళిని కిలాంటి ఉపకారం చేశాడు. అతను స్వయంగా పాలమ్ముకొని జీవిస్తున్నాడు. ఆదినారాయణ ఒక ఖాతా దారతనికి. నళిని ఇనుప సంకెళ్ళలో చిక్కిన బానిసలాగున్నది. చావనూలేదు బ్రతకనూలేదు.

ఆదినారాయణ సినిమా తీయలేక పోయాడు. అతని వద్ద చాలినంత ధనం లేదు. సగం వరకు తీసిన ఫిలుం అమ్ముకొని కొత్తపట్నం చేరాడు. దివాలా తీసేవాడే. ఎలాగో బ్రతికి బయట పడ్డాడు. ఇప్పుడు వ్యవసాయం చేసుకొంటున్నాడు.

కొత్తపట్నం దేవాలయంలో దీపం వెలిగించే దిక్కు గూడా లేదు. అది శిథిలమౌతున్నది. చాలా కుటుంబాల వారు మద్రాసు వలస వెళ్లారు. ఆ పాడుపడిన గ్రామం యిప్పుడు భీతిగొల్పుతున్నది. తిరునాళ్లు గూడా జరగడం లేదు. కాలం మారిపోయింది.

ఎక్కడా ఒక్క రీలుగూడా తయారు చేయకపోయే సరికి పద్మనాభం ముఖం నిర్మాత లెవరూ చూడడం లేదు. సినిమా ప్రపంచంలోని మాయాజాలాని కతను గురియైనాడు. కానీకి గూడా దేవురించ వలసి వచ్చింది. త్రాగుడు మొదలెట్టాడు. సరిగా గొంతెత్తి పాడలేక పోతున్నాడు. అతనిప్పుడు చెంగల్పట్టు క్షయాసుపత్రిలో వున్నాడు.

కాంచన, కోడూరు జమీందారుగారు అనంత కాల గర్భంలో లీనమైనారు.

సత్యం వెన్నెల రాత్రిళ్ళు సముద్రపు వొడ్డున చిన్న పిల్లలు చేసుకొన్న బొమ్మరిల్లు పాడుచేయడంలో మదించిన ఏనుగులా ప్రవర్తిస్తున్నాడని విన్నాం. సముద్రపు నురుగు పట్టుకోబోయేవాడు. అది చేతిలోనుండి జారిపోతే కిలకిలా నవ్వుతూ సముద్రంలోకి దూకేవాడు. పోలీసు వాడొకడతనిని చూచాడు. అతనిమీద ఆత్మహత్యానేరం మోపి న్యాయాధీశుని ఎదుట హాజరు పరిచాడు. న్యాయాధీశుడతనిని పిచ్చివానిగా నిర్ణయించి పిచ్చి ఆసుపత్రికి పంపించాడు.

పిచ్చి ఆసుపత్రిలో అతనిని చూడడానికి కేవలం నళినికి మాత్రమే అనుమతి వున్నది. దేవాలయములోని భగవంతుని దర్శించినట్లుగా ఆమె వారమున కొక పర్యాయం అతనిని దర్శించి వచ్చేది. ఆమె పశ్చాత్తాప పడుతున్నది.

